సరస్వతీ గ్రంధమాల : ౪౦

# ఛిన్నహస్తము

(ప్రథమ భాగము)

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎం. ఎ., బి. ఎల్.

రు 2/-

పబ్లిషర్సు: అద్దేపల్లి అండు కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# పీఠిక

ప్రస్తుతభాషాప్రపంచమున నగ్రగణ్యత వహించిన ఆంగ్లము ప్రసిద్ధి నెఱుఁగని సమయమున, ఫ్రెంచిభాష యనేక పాశ్చాత్యప్రభువుల సమధికారణముతో మహోన్నతదశను గాంచెను. తత్ఫలముగ పూర్వపు మన సంస్కృతవాఙ్మయమందువలెను, నేటి ఆంగ్ల వాఙ్మయమందు వలెను ఫ్రెంచిభాషయందు సారస్వత శైవలిని శాఖోపశాఖలతో పొంగి అనేక వినూత్న మధురరచనలను పుష్పింపజేసినది. అట్టి ప్రసిద్ధభాషకు జెందిన యొక రసవంతమగు నవలయే యీ గ్రంథమునకు మాతృక. కథావిషయములుకూడ ఫ్రెంచిసీమకు చెందినవే. ఫ్రెంచిరచనలయందు సహజములగు విచిత్రకల్పనలు, వింతపోకడలు ఆంధ్రపాఠకలోకమునకు పరిచయ మొనర్పవలెనను నా తలంపు దీనివలన సఫలమైన కృతకృత్యుఁడను.

అశ్రాంతము నాయెడల నవ్యాజవాత్సల్యముఁ జూపుచు, నా ప్రయత్నములందుఁ దోడ్పడుచు, పెక్కు తెఱఁగుల నన్ను బ్రోత్సహించు సుహృద్వరులగు దీని ప్రకాశకు లెంతయు వందనీయులు.

కలకత్తా
23-8-29

సుజనవిధేయుఁడు
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

***

## కృతిసమర్పణము

చిఱుతప్రాయమునఁ గడలేనియిడుములకుఁ బాల్పడియుఁ జిత్తశాంతిని గోల్పడక, సహనకవచము ధరించి, ధైర్యాసిఁ జేఁబూని జీవితసంగ్రామమున మొక్కవోని పరాక్రమమునఁ బోరి విజయోపేతులై, మేడన్ (Madan), బటోక్రిష్టపాల్ (Butto Kristo Pal), తాతా (Tata), బసివిరెడ్డి (Basivi Reddi), లెస్లీ (Leslie) ప్రభృతుల కైవడి ఉన్నతోద్దేశసిద్ధివడసి, వాణిజ్యమునకు వన్నెఁదెచ్చి సర్వసంపదసంపన్నులై, సకలసద్గుణసంశోభితులై, పూతచారిత్రులై, అర్థిజనకల్పంబై, పెక్కేఁడులు కర్మవీరులై, మనుగడగడపి దివంగతులైన శ్రీ శ్రీ అద్దేపల్లి చన్నయ్యనాయుఁడుగారి పవిత్రస్మృతి కీకృతిప్రసవము సమర్పితము.

***

నవంబరు మాసము. నేటిరజని శీతజర్జరమై భయదమైయుండెను. వియత్తల మంతయుఁ గృష్ణకాదంబినీసంకులమై యుండెను. ప్రబల పవన తాడనమున వృంతచ్యుతశుష్కపర్ణపటలము రాజపంథ ధూళిఁ గలిసి నల్వలనులకు నెగసిపోవుచుండెను. నిబిడకుహేలికధూమ్రావగుంఠనమున దిగంతము లావృతము లైపోయెను. రాజపథస్థోజ్జ్వల విద్యుద్దీపద్యుతులు ఝంఝాటికజవనికాంతరాళమున స్తిమితములై, నిష్ప్రభలై గానంబడుచుండెను. కడుంగడు మత్తిల్లి విహాయసమంటు లీల భీషణనిర్ఘోష మొనర్చుచు, వృద్ధోర్వీరుహంబులతోఁ బోరిపోరి నిజబలపరీక్ష సలుపుకొని కడుంగడు గర్వమున ఝంఝానిలము దశదిశలఁ బరిభ్రమణ మొనరించుచుండెను. వర్షమాసన్న మాయెను. కరము రమణీయములై యుండు నాటకాలయము లిద్యావసరమున ప్రభారహితములై జనశూన్యములై యుండెను. రమ్యమైన రాజపథము జనసంచలనము లేనిదై యుండెను. ప్రేమికప్రేమికుల యస్ఫుట కలహాసనమిత్తతి ఆ తెఱవునందు వినఁబడుచుండుటలేదు. అప్పుడప్పుడు ఒకటి రెండు బండ్లు మాత్రము మార్గమునఁ గన్పట్టుచుండెను. భీతిగొల్పు గాలివాన యాసన్న మగుటఁ గాంచి, యెల్ల జనసమమునఁ బథసన్నికటమునఁ గల విశ్రామమందిరము సేరుకొనిరి.

కాని, యీభీషణవిభావరియం దిరువురు యువకులు జనశూన్యమగు రాజపథమున, గడుంగడు గాఢమైన సంతమసమున ముందునకు సాగిపోవుచుండిరి! ఉభయులు దీర్ఘకాయులు బలిష్ఠాంగులు. సుందరవేషులు! స్పష్టప్రసంగ, యుచ్చహాసనములచే రాజమార్గమును ముఖరిత మొనరించుచు నుభయులు నడచుచుండిరి. దూరమునుండి యాకస్మికముగఁ జూచి నట్లైన నాతెరువరు లిర్వురు సోదరు లను

భ్రమ పుట్టకమానదు. కాని ఒకించుక బరికించినచో, వారి యాకృతుల తీరునందు అంతగఁబోలిక ద్యోతకము కాదు. ఒకని కాయము గౌరవర్ణముకలదై యుండెను. రెండవవాని తనువు మిక్కిలి మలీమసమై యుండెను. మొకటివాని నయనయుగళము సునీలమై, ముఖము ప్రశాంతమై, సుందరమై, సప్రసన్నమై యుండెను. రెండవ యాతని కన్నులు కృష్ణవర్ణయుతములై, ఆననము దృఢతాసమన్వితమై యుండెను. ఇరువురును తరుణవయస్కులే!

రెండవ యాతఁడు — నీకు మతిపోయినదా యేమి? ఈ గాలి వానయందుఁ గాల్నడక నత్తావున కరుగుట సాధ్యమా? ఇంచుక సేపటిలోఁ గుంభవృష్టిగ వర్షము గురియును.

"నీమేనమామగారి యిల్లు విశేష దూరము లేదు. గాలివాన తీవ్రముగ నారంభము కానిమున్నె, మన మాచోటుఁ జేరఁజాలుదుము. కాని, మనము వడివడిగ నడకసాగింపవలెను."

"అవును. అట్లైన రెండు రూకల బండిబాడుగను వెచ్చకఁ దీసి కొనఁగలవు! ఇట్టి మితవ్యయము కొనియాఁడదగినదే జూలూ! నీవు అచిరకాలములోఁ గోటీశ్వరుఁడవు కాఁగలంగుదువు జుమీ!!"

"అది పేరాసగాదు. నీవలె వెనుకముందు లాలోచింపక నేను విత్తము వెచ్చఁబెట్టను. వర్జర్సుగారి యాలోచన ననుసరించి పనిసలుపక యున్న యెడలఁ, బ్రతికూల పరిణామముఁ జూపట్టును. అతఁడు నిన్ను మిగులఁ బ్రేమించును. ఇప్పుడైననుసరే, నీవాతని కొఠీవ్యాపారమును బాధ మొదలిడితివేని, ఆతనికన్నియ నీకు సేకూరుట అసంభవము కానేరదు."

"పెండిలిపై నాకిసుమంతైన వాంఛలేదు. ఎలిన్ సుందరియే. కాని, ఆమెవంటి వనితవలన నాకు సుఖము చేకూరదు."

"అట్లైన నీకామెపై నిసుమంతైన ననురాగము లేదా?"

"అనురాగము లేకుండుటేమి? కాని, ఆమె యింకను నిండు

జన్వనికాలేదు. ఆమాట యట్లుండ, భాగస్థుండై తనతోంగలిసి వ్యాపారము జేయంగలవానిని నామేనమామ వెదకుచుండెను. ఎవరేని ధనికునితనయునికే దుహితనొసంగవలెనని ఆతం డూహించుచున్నాండు !!"

"నీవు పొరబడితివి. అతని యిచ్ఛ యదికాదు. తనకన్నియ పెండిలియైనపిదప, జామాతను వృద్ధిలోనికిం గొనివచ్చుట కాతండు వ్యాపారమందు వానిం దనభాగస్థునింగాం జేసికొనును. అట్లు లొనర్చినయెడల భవిష్యమందుం జిన్నవాండే అవలీలగ వ్యాపారమునంతను సాగించంగలండని ఆతని యభిప్రాయము."

"అట్లైన నా యనుంగు జెలిమికాండైన ఖాతంజీ జూలుస్ విగనరీ వంటి జామాత అతని కెందు లభించును? వృద్ధుని వ్యాపారమును గడు నేర్పుగ నాతండు సాగింపంజాలువాడు."

"నీకుం బిచ్చిపట్టినట్లున్నది. నాకట్టిదురాశ లేదు. అందరానిపండ్లకట్టులుజాపు టేల ?"

"ఇందు దురాశ యేమున్నది ? మేనమామగారు నిన్నుహృదయపూర్వకముగ ప్రేమించుంగదా! అంతియగాక నీయెడల నెలినుకుంగూడ గాఢానురాగము గలదని విశ్వసించెద. నీపైనున్నట్లు లామెకు నాపై మక్కువయుండెనేని, నేనింతకుమున్నె ఆ యెలనాంగను జేపట్టుదగు జతనము సలిపియేయుందును."

"నాపై నామెకు మక్కువ యున్నదో లేదో నే జెప్పంజాలను. ఆమెను బడయనేం బ్రయత్నింప సాహసింపను. రాబర్టు మనోరథమును నిరర్థము గావింప దొరకొనువాండనుకాను."

"ఏమేమి ! మేనమామగారి కార్యదర్శి రాబర్టా ? ఆతడు ఎలిన్‌ను ప్రేమించెనా ?"

"నిశ్చయముగ నాతం డామెను ప్రేమించెను."

"మంచిది. నీవు కానప్పు డతండే ఆమెకు వరుండగుచో, అందులకు

నాయభ్యంతర మేమియునుండదు. ఆర్థికావస్థ అంత బాగుగలేనివాఁడే యయ్యు, అంతఃకరణమున నాతఁ డుదారుఁడు, బుద్ధిమంతుఁడు. అంతియగాక, ఆతఁడు వంశమర్యాదఁగలవాఁడు, విద్యావంతుఁడు. నీకును ఆతనికిని మిక్కిలి సఖ్యము కలదనుకొనెదను. ఏమందువు ?”

“ అవును. అతఁడు నా ప్రాణమిత్రుఁడు.”

“ అట్లైన, ఆతని ప్రణయోదంతము నీకుఁ దెలియనిదై యుండదను కొనెదను.”

“ అట్లు తలపకుము. ఆ విషయమున రాబర్టు మిగుల నప్రమత్తుఁడు. తన ప్రణయకాహిని నాతఁ డెంతటి చెలికానికైనఁ దెలుపువాఁడు కాఁడు. కాని, ఆతని వైఖరిఁ జూచి సర్వోదంతమును నేను గ్రహింపఁ గలిగితిని. ఎలిసు నాతఁడు నిజాసులతో సమముగఁ బ్రేమించును. అచిరములో నాతఁడు పరిణయప్రస్తావనమును వర్జర్సుగారి నికటమున దెచ్చునని యూహించెదను. ఆతని కల్యాణమైన యెడల నే మిగుల నానందింతును ; కాని రాబర్టుయొక్క మనోరథము పూర్ణము కాఁజాలదేమో యని నే భీతిజెందుచుంటిని.”

“ నేనుకూడ నట్లే యోజించుచుంటిని. కాని, ఎలి సాతనియెడ ననురక్తయైయుండె ననుకొనెదను. మేనమామగా రామె సుఖ దుఃఖములఁ బాటింపకుందురా ? అదిగో ! వర్షము కురియ మొదలిడెను.”

“ మొదలిడనిమ్ము, మనము గమ్యస్థానముఁ జేరుకొంటిమి. ఇఁక నెంతవర్షము కురిసిన మనకేమి ?”

వర్జర్సు గృహసమ్ముఖద్వారమును వారలు సమీపించిరి. కోశాధ్యక్షుఁడు కళత్రరహితుఁడాయెను. ఆతని కొకర్తుకయే కూఁతురు కలదు. తల్లిలేని బిడ్డయెడల వర్జర్సు మెంతేని యనురాగ మూని యుండెను. పుత్రికప్రీతి కొఱకై ప్రతిబుధవారమాతఁడు నిజాలయమున విందుజేయు చుండును. కొందఱు ముఖ్యమిత్రులను, సమీపబంధువులనుదక్క ఆతఁడు

విందున కొరకుఁ బిలుచువాఁడు కాఁడు. మేనల్లుడు మేక్సిముకూడ నేఁడు విందున కాహ్వానింపఁబడెను. జూలుస్ రాబర్టులుకూడ ప్రతిబుధవారము విడువక ఆహ్వానితులగుచుందురు. రాబర్టు ఆగృహముందే వసించు చుండెను. తక్కుంగల యతిథులతో నాతఁడు నేఁడు విందునకు విచ్చేసి యుండెను.

విగనరీ మేక్సిములు సమ్ముఖద్వారము గుండా లోపలఁ బ్రవేశించు తఱి "కచేరీ చావడిలో నిపుడు దీపము వెలుఁగుచుండెనేల ? బ్యాంకి యుద్యోగులు రాత్రి పదునొకండు గంటలవఱకు బనిచేయుచుండిరా ?" యని మేక్సిము నెయ్యుని బ్రశ్నించెను.

అపుడు ప్రబలవేగముగ వర్షము కురియుచుండెను. విగనరీ కిటికీ గుండా లోనికి దొంగి జూచి "ఇంత రాత్రివఱకు నెవరును పని చేయరు. అందెవరును లేర" నియెను.

ప్రాంగణమున కాలివైపున వర్జస్సు గృహముకలదు. రాజపథము నకు సమీపమున రెండవ యంతస్థుపైఁ గోశకార్యాలయముండెను. అన్నిగదుల కిటికీలు బలమైన యినుపకమ్ములతో దృఢీకృతములై యుండెను. వాతాయనములన్నియు నపుడు మూయఁబడి యుండెను. కాని, కొండొక కిటికీ తలుపున గల రంధ్రముగుండా వెలుతురు యీవలికిఁ బ్రసరించుచుండెను. మేక్సిమ్ ఆ యాలోకశిఖనే తిలకించుచుండెను.

జూలుస్ : "అదేమియు కాదు. వాకిట కావలివాఁడు పరుండుటకు ముందొకమాఱు నాల్గుమూలలు దిరిగిచూచుచుండెను. ఏమియు భయము లేదు. ఇనుపపెట్టె భద్రముగనే యుండును. ఎవ్వరైన బలముగ దానిఁ దెఱువ గడఁగిన యెడల, వెంటనే పట్టుఁబడి తీరును."

"అవును. మాఱు చెవిచే నవదేని తాళముఁ దీయనుంకించినయెడల యాతఁడు మృతుడగునని మేనమామగారు చెప్పియుండిరి."

"అది యాతని అతిశయోక్తి. చోరుఁడు హతుఁడు కాదు కాని, బోనునఁబడిన మూషికమువలె దక్షణమే పట్టుఁబడిపోవును. తాళముఁ దెఱువనాతఁడుంకించినంతనే, రెండువైపులనుండి రెండినుప హస్తములు చివాలున వాని మణిబంధమును బలముగఁ బట్టివైచునట్లు కడువిచిత్రముగఁ నినుపపెటిక నిర్మింపఁబడెను. అవుడు తప్పించుకొని యవ్వలఁబోవుట దేవునికైన శక్యముకాదు."

"ఓ! అట్లైన నదిమిగుల జిత్రమైన సిందుకమై యుండవలెను. ఇంక లోపలికిఁబోదమురమ్ము. ఇందు దడసి వానజల్లునఁ దడియుటెందులకు!"

ఖాతంజీ ఘంటారజ్జువును బట్టుకొని లాగెను. తోడనే ద్వారము తెఱువఁబడెను. మేక్సిము ముందు లోపలఁ బ్రవేశించెను. లోన నిరువురు పురుషులు నిలువంబడి యుండిరి. తలుపు దెఱచు తరుణముకై వార లెదురు జూచుచుండిరి. కవాటము తెఱువబడినంతనే లోజొచ్చి వారి కభివాదన మొనరింపకయే ద్రుతగమనులై వారలవ్వలికి వెడలిపోయిరి. వారిలో నొకఁడు త్రాటిప్రమాణము మాడ్కి మిగులఁ బొడవైయుండెను. రెండవవాఁడు మధ్యమాకృతి గలిగియుండెను. రెండవవాఁడు మొదటి యాతని వీపుపై మేను జేర్చినడచుచుండెను. ఇర్వురి తలలపైఁ గల పెద్ద టోపి లించుమించుగ వారిముఖములను గప్పివైచెను. ఉభయుల వేషములు డాంబికములై యుండెను. కోశాధ్యక్షుని విందు సభనుండి లేచి వార లరుదెంచియుందురు.

మేక్సిము విందారగింపవచ్చిన అతిథులు వెడలిపోవు సమయమునకు మనము వచ్చి జేరుకొంటిమి. నేఁడు మామగారివలన మనకుఁ జీవాట్లు తప్పవు. వేళకు రానియెడల, ఆతఁడు మిగుల గుపితుఁడగును.

ద్వారపాలకుని గదివైపు దృష్టి సారించి, మేక్సిము మరల నిట్లనెను. "ముదుసలియగు వెసిల్వాంట్ పడకకుర్చీపై లీవిగాఁ బరుండి యెంత హాయిగా నిదురించుచున్నాఁడో చూడుము."

వికనరీ: అది వాని యలవాటు. ఇనుపపెట్టెను గాపాడుటకు వేఱు వెరవు లేని యెడల,...

"నిశ్చయముగ మిగుల మెలకువగొండవలసిన గారణముండును. మంచిది. మేలికమ్ కచేరియందు రాతిరి యుండునుగదా—సొమ్ము దొంగిలింప బడకపోయిన మంగళము."

"మేలికమ్ రాత్రి పండ్రెండు గంటలకు ముందే తిరిగి రాడు. ఆతనిపై నాకంతగ విశ్వాసములేదు.—పట్టి త్రాగుబోతు. సోదరా! నేను లోపలికిబోయి ఆగార మొకమాఱు చూచివత్తును; నీవు పైకి వెడలి పొమ్ము. నేను వెంటనే నీకడకు వత్తును."

"నవువ్వుము. నేం గూడ నీవెంటనే వత్తును. నాకు మాత్రమంత తొందరపని యేమున్నది? గదిం బరీక్షించి, పిదప నిర్వారము కలిసి మామగారియొద్ద కరుగుదము. నీవు కూడ నున్నయెడల, జీవాట్లు వెఱపంతగా నుండదు."

"మంచి దట్లే కానిమ్ము. నడువుము — గదిలోనికిం బోయి చూచి వత్తము.

ఉభయులును కార్యాలయముకవాటమును సమీపించిరి. తోడనే జూలున్ "ఇదేమి! గది తలుపు తెఱచియున్నదేల?" అని యాశ్చర్యాన్వితుండై పల్కెను.

మొదట వారు తొలిగదిలోం బ్రవేశించిరి. దానికిం బ్రక్కనగల యాగారమందే యినుపపెట్టె కలదు. ఆగది తలుపు కూడం దెఱచి యుంటం గాంచి, యిరువురు మిగుల విస్మయము పడిపోయిరి. అడలు గుండెయులందు నిండుకొన వా రాగది జొచ్చిరి.—అం దెవరును లేరు. వ్రాతబల్లపై మాత్ర మొక దీపము వెలుంగుచుండెను.

వికనరీ: ఇంత రాతిరివేళ నిచట నెవరుపనిం జేసి యుండిరి? యజమానియొద్ద తక్క నీగది తాళముచెవి ఇతరులకడ నుండదుగదా!

"అట్లైన నాతఁడే యిచటికివచ్చి యుండును."

"అట్లేల యనుకొందుము ? నేఁడు విందు దినము. ఇంట నతిథులు నేరియుండ, వారల నాతఁడు విడిచివచ్చునా ? ఒకవేళ యజమానుఁడే యిచటికి వచ్చియున్న యెడల, బోవునపుడు దీపమార్పివైచి తలుపు మూసియే యుండును. అట్లొనర్ప కాతఁడవ్వలి కరుగనే యరుగడు. తలుపిటు లుండుట అబ్బురముగఁ దోఁచుచుండెను. ఇనుపపెట్టె యెట్లున్నదో మనమిపుడు చూడవలెను. దానిపై నెవరును జేయివైచి యుండకున్న, నేఁడు శుభదినమని తలంతుము."

మేక్సిమ్ యినుపపెట్టియ పొంతకరిగి, "మిత్రమా ! నీయనుమానము వట్టిదికాలేదు. చోరుఁడు పెట్టెను దెఱువ యత్నించెను చూడు మిదిగో !" అనెను.

"అదేమి ! దొంగ యెట్లు పాఱిపోఁజాలెను ?"

"సోదరా ! దీపము నిటు గొనిరమ్ము. దొంగ నిక్కముగఁ బాఱి పోయెను. కాని, చేతిని దిగవిడిచిపోయెను."

విగనరీ దీపమెత్తి పరీక్షించి, మిగుల నబ్బురమున "ఇదియొక యూడుదానిచేయి !" అనెను.

"సిందుకము యొక్క కొళలనిర్మాణము వ్యర్థము కాలేదు. లోహ బాహువులు దొంగిలింప దొరఁకొనిన కాంత ఛిన్నహస్తమును బట్టి యుండెను !"

మేక్సిము : దొంగ పారిపోయినవు డీక సిందుకముయొక్క కొళల మేమి యున్నది ! ఇట్టి పైశాచిక శాస్త్రి యొనఁగుట కీమాడ్కి యంత్రము నిర్మాణము కావింపఁ బడకుండుటే మంచిది !

"చోరునిఁ బట్టుటకే యీ జంత్రము నిర్మింపఁబడెను కాని ఆతని చేతిని ఛిన్నమొనరించుటకుఁ గాదు. యంత్రబాహువులు చేయినెట్లొడిసి పట్టియుండునో చూతుము."

"నీమాటే నిక్కము. యంత్రమందుఁ జేయి తెగియే యున్నయెడల వెంటనే యదినేలపైఁ బడియే యుండును. దొంగిలింప నరుదెంచిన యాఁడుది పట్టుబడుదునను భీతిచేఁ జేతిమీఁది ముక్కు వను వదలుకొని వాడియైన ఛురికముచే దానిని నఱికి వైచెను."

"కాని, అస్త్రప్రయోగము సల్పినదెవరు?"

"స్వయముగ నాదొంగయాఁడుదియే అట్లొనరించి యుండును."

"అది యసాధ్యము. అట్లుజరిగి యుండదు."

"సాధారణ తస్కరుఁడైనయెడల, నీ వనినట్లు తనంతదానట్లు కావించుకొనఁ జాలకుండును. కాని యీకర మెవర్తికేని సౌందర్యోపేత విలాసినిదని స్పష్టపడుచుండుటలేదా? రమణి కసాధ్యమగు జెయిద మేమియు లేదు. చూడు మీయంగుళముల గఠనమెంత సుందరముగ నున్నదో! నిక్కముగ నీకర మొక గొప్పయింటి యాపైదె యుండును. వ్రేళ్ళకు నుంగరము లుండినట్లు తోచుటలేదా! కత్తివ్రేటువైచిన పిదప నా యువతి తనయంగుళీయకములఁ దీసివైచుకొనెను. ఆలలన చిత్తమం దెట్టి దృఢత యుండెను! ఉంగరము లున్నట్లు వ్రేళ్ళపై నిపుడుకూడ చిహ్నములు స్పష్టముగ జూపట్టుచున్నవి. పట్టుబడుదునను వెఱపుచే చిహ్నములనన్నిఁటిని మాపుజేయ నా తెఱవ యత్నించినట్లుకూడ బోధ పడుచున్నది!"

"కాని, యిట్టి ఘాతుకకృత్యముఁ గావించినపిదప నాతస్కరిణి యెట్లులవ్వలికిఁ బోజాలెను? రక్తస్రావదున్సహావేదనల కతన నాపె యచేతన కాకుండుట నాకు మిగుల నక్కజముగఁ దోఁచుచున్నది. చూడు మిదిగో రుధిరధార!"

మేక్నీము: దీపము క్రిందివైపుగఁ జూపుచు రమ్ము. ఎంతదూరము వఱకు రక్తము కాఱియుండునో చూతము.

యంత్రచాలితుని వలెవున విగనరీ నెయ్యునకు చెప్పినచోప్పున దీవముఁ జూపుచు ముందునకు సాగెను. మేక్సిము విచలితచిత్తుండు కాలేదు. ప్రశాంతచేతస్కుఁడై ఆతఁడు నేలను బరీక్షింపసాగెను.

"రమణి వెంట నొకసహాయకారి యుండెను ?"

"అట్లని నీకెట్లు తెల్లమయ్యె ?" నని విస్మయచేతస్కుఁడై విగనరీ యనెను.

"అట్లని ముందే నేను శంకించితిని. సహకారియే రమణికరమును ఛేదించియుండును. ఎంతసాహసికురాలైనను స్వీయహస్తముచే సీమంతిని తన తనువల్లరిని కత్తిచేఁ ద్రెంపుకొనఁజాలదు. ముఖ్యముగ నొరుని సాయములేనిదే రక్తస్రావమును కట్టుపఱచుట సాధ్యముకాదు. నీవాతి బల్లమీఁదినుండిస్పాంజిఁ దీసి రుధిరస్రావమును వారలు బంధించినైచిరి. వ్రేటువడిన స్థానమున బల్లపై విడిచిన జేబురుమాలుచే వారలు కట్టుగట్టిరి చూడుమింకను నీబల్లపై రక్తచిహ్నములు చూపట్టుచుండెను. గాయమునకుఁ గట్టుగట్టినపిదప సహకారి సంగిణినిదీసికొని అవ్వలి కరిగెను."

"కాని, వారలీభవనముననుండి వెలుపలి కెట్లుపోఁజాలిరి ?"

"ఏయుపాయమున వారీ భవనమును జొచ్చిరో ఆయుపాయముననే వారవ్వలికి దాటిరి. కచేరిగది తాళముచెవి నిశ్చయముగ వారియొద్ద నుండెను. కడుతత్తరమునఁ బలాయన మొనరించినకతన దీపమారిపి కవాటమును బంధింప నాదస్యుద్వయము మఱచెను."

"మనము గేహముఁ జొచ్చుసమయమున వెలుపలికరిగిన నిర్వురు వ్యక్తులే యీపని జేసి యుండరుకదా ?"

"అది యసంభవము. వారలుభయులు పూరుషులే! మన మీనిలయముఁ జేరుటకుఁ జాలసేపటికిముందే వారిందుండి పలాయితులైరి. ఇపుడు వారిని వెతకుట వృథ."

"కాని, ఆ పూటఁగూడ అట్టి స్థితిలో నడచి పోఁజాలి యుండునని తలంతువా ?"

"వారు బడిపోఁడఁబోయి యుందురు. వారలు సాధారణచోరులు కారు. ఈ గృహమందలి యెల్లఅచేష్టలను యలవాటులను—ప్రతి నిమునము వారు నెఱపు కార్యవిధానములను వారు బాగుగ నెఱుంగుదురు. ఇందుల కిసుమంతైన సందియము లేదు ! చౌర్యమానలుపు దినమును, వేళను వారలు ముందే స్థిరమొనరించుకొని వచ్చుటే యందులకు బలమైనబుజువు. నేను మామగారు విందునలుపుచున్నట్లును, పరిచారకు లందఱును బహితొందరగ యుపడుఁబడి యుందురనియు, ద్వారపాలకునకు సహితము ... గేత్రినూటచుట కవకాశముండదనియు గచేరిగది యందు బరుండు నాతఁడు రాత్రి రెండుయామములు గడచుటకు ముందుఁ దిరిగ రానేయు నారలెఱుఁగుదురు !"

"ఏయింటినడుగుము నాతఁడే యెవండేని వారికి సాయము సలిపి యుండునని నే నూహించుచున్నాను. ప్రాయశః చోరులిపుడు కూడ నీగేహమున నుందేని డాఁగియుండును. కొత్తయుద్యోగునికిపుడే యీ యుదంతమంతయు దెలుపుట సముంజసము."

"అట్లొనరించుట యనుచితమని నీవూహించుచుంటివా !"

"అవశ్యముగ నట్లే!"

"కాదు, నేనట్లూహింపను. నీకెట్టులిష్టమో యట్లే చేయుము. కాని, యీఘటనమును గుఱించి మామగారి కించుకైనఁ దెలుపకుండుటే మంచిదని నాతలంపు."

"ఏమనుచుంటివి ? ఈ దుర్ఘటన ... నడచియుండవలెననియా నీ వాసనగు నాలోచన ? ఇపుడు నిన్న కున్న యెడల మఱింత యనర్థము వాటిల్లదా ? నాడు జేసే యీఘటనటులా ఘటింపవచ్చును. ఇనుపపెట్టెను గురించిన పూచీ యంతయు నాపైనున్నట్లు నీవు మఱచి యుందువు."

" అట్టిపూఁచీ నీయదికనుక నే యీయుదంతము నాతనికిఁ దెలుప నిషే ధించుచుంటిని. అన్ని వేళల నాతఁడు న్యాయపథమునఁ జరింపఁడు. ఈయు జాగ్రతకు నీవే పూఁచీపడుమని అతఁడు నిన్ను బాధించినను బాధింప వచ్చును. పవలనక రాతిరియనక యత్నునిమీఁదిక్కి తప్పక నీవాతని ధనాగారమును గాఁపాడవలెనని ఆతఁడాశింపఁదగదు. దోషభార మంతయు నీతలమీఁదనే బడునేమోయని యడలుచుంటిని.

" పడినను బడనిమ్ము. పడునని యిట్టిదుర్ఘటనమును నేను మఱుఁగు పఱుపఁజాలను. అట్లొనరించితినేని చౌర్యము సలిపినమానిని సాహసము హెచ్చుహెచ్చిగిపోవును. "

" పేరిస్ నగరపోలీసులామెను వెదకిపట్టజాలుదురని నీవాసించుచుంటివి కాఁబోలును — అట్టి ప్రత్యాశ వదలుకొమ్ము. వార్తాపత్రికలందీఘట నముగూర్చి దీర్ఘవ్యాసములు వెలువడును. ఏకడఁ జూచినను లోకుల నోళులనుండి ఛిన్నహస్తోదంతము తక్క నన్యవృత్తాంతమేమియు విన రాదు. దేశమందెల్లయెడల నింతింతనరాని యాందోళనము బుట్టును. అపరాధులపుడీ యుల్లరికంతకు నవగతులై తమ తలలఁ దాచుకొను టకుఁ దగు తరుణము నన్వేషించి పూర్ణమనోరథులు కాజాలుదురు ! నామాట నమ్ముము. పోలీసువారా యాఁడుదానినిగాని, ఆమెకుఁ దోడుపడిన వానిని గాని యెట్టులైనఁ బట్టఁజాలుదు రనుట గల్ల."

" వేరి సాయములేనిదే వారలఁ బట్టగలుగుదురంచు నీ వూహించు చుంటివా ? "

" నిశ్చయముగ నేనట్లే యూహించుచున్నాను. కాని, మనమిర్వు రము తక్క మూఁడవవాని చెవిని ఛిన్నహస్తోదంతము పడరాదని యెఱుఁగుము. "

" కాని, యీచేయి—— "

"దాని నిండు దిగవిడువక గొనిపోవుదము. ఇఁక గవాటము మూసి వైచి పెట్టెపొంతకు రమ్ము."

జూలస్ యోకించుక సంశయించెను. కాని నెయ్యాని యాదేశము నాతఁడు త్రోసివైవఁజాలకపోయెను. అంతగ నడలవలసిన గారణము లేదని ఆతఁడు యోజించెను. మేక్సిము బుద్ధిమంతుఁడు. సాహసుఁడు. కోటిపతి మేనల్లుడు. తానొక సామాన్యోద్యోగి. అందుచే విగనరీ యాతఁడు చెప్పిన చొప్పున నాచరింప నిశ్చయించి, కవాటమును బంధించి వైచెను.

"ఇనుపపెట్టె తాళమును దెఱచు నుపాయ మేమో నా కిపుడు తెలుపుము."

"ఆ యుపాయము మిగుల సూక్ష్మమైనది. పెట్టెతాళముపై గల బెద్ద బొత్తాముమీఁద చాలయక్కరము లున్నవి. ఆ యక్కరములనుండి యొక పేరును గూర్పవలయును. మేము నిర్దిష్ట మొనరించుకొనిన సాంకేతిక నామ మొకటి కలదు. అక్షరములను పేర్చి, ఆపేరునుగూర్చి, బీగముతోఁ బెట్టెమూతఁ దెఱవవలెను. పేరు సరికానిచో, యెంత యత్నించినను మూతవిడ నేరదు. పేటికకు రెండు తాళము చెవులుకలవు. ఒకటి నీమేనమామగారి యొద్దనుండును. రెండవది నాకడనున్నది. సిందుకమును మఱింత భద్రపఱచుటకు మేము మఱొక నూతనోపాయమును గనిపెట్టితిమి. తాళము వేయు సమయమునఁ బ్రతిదినము నేనొక యంత్రమును పెట్టెకుఁ జేర్చి యుంతును. తాళముచెవిని జేఁజిక్కించుకొని యెవ్వరైన దానిఁ దెఱువ గమకించిన యెడల, తోడనే ఆతఁడు పట్టుఁబడును. నేఁడు దానికి బ్రత్యక్షప్రమాణముఁ జూచితివి. ఉదయము నసే యరుదెంచి మొట్టమొదట జంత్రమును ద్రిప్పివైచి, పిదప జెవి ద్రిప్పినంతనే మూత విడును."

"మంచిది. ఇపుడొక మాఱు దీపమెత్తిపట్టుకొనుము. నేనొక

మాఱు యినుపపెట్టెను బాగుగఁ బరీక్షించితిని. అక్షరములవలన నేమి గుఱుతింపఁజాలుదునో జూతము. మొదటి వర్ణము 'ఎమ్'; రెండవది 'ఐ'; మూఁడవయక్షరము 'డి'; నాల్గవది 'ఏ'; అయిదవ యక్షరము 'ఎస్'; ఈ వర్ణములైదింటిని జేర్చగా 'మిడాస్' (Midas) యను శబ్ద మేర్పడుచుండెను. మీ రానవాలుగా నెంచుకొనిన పదమిదియేనా?"

"అవును"

"అట్లైన నేఁడే యీ పేటిక మూర్తివైచుము. చోరులు దానిని గ్రహింపగలిగిరి. ఇపు డీక ఛిన్నహస్తమును బరీక్షించెదము. ఇది యొక యాఁడుదానిచేయి యని బోధపడుచున్నది. ఇది యెడమచేయి. నేఁటి నుండి ఆ వాలుఁగంటి వామహస్తశూన్యయై యుండును. సోదరా! ఇఁక దాళము దెఱువుము!!"

విగనరీ మిత్రుని యభిప్రాయానుసారముగ యంత్రములు ద్రిప్పి, సింధుక కవాటమును దెరచివైచెను. తోడనే ఛిన్నహస్తము నేలపై రాలెను!

దానిఁగాంచి, విస్మయపరీతచేతస్కుఁడై మేక్సిము, "నెచ్చెలీ! ఇది మిగులఁ జిత్రముగనున్నది. మిగుల విలువైన కంకణముకూడ నీచేతియందలరారుచుండెను! దీనివలనఁ గ్రొత్తవనిత యేదేని పొడసూపక పోదని నేఁదలఁచినట్లే యాయె" నని మిత్రు నుద్దేశించి పల్కెను.

మణి మాణిక్యఖచితమైన దాని యందలి వుంగరము, తీయుటకు వలను గానటులఁ గడుబిగువై చేతి మొండెమునఁ గానంబడియెను. వివిధ రాగరంజితములైన సందలి యమూల్యవజ్రములు మిగుల సుజ్జ్వలములై ప్రదీపాలోకమున మిరుమిట్లుగొలిపెను. మేక్సి మించుకైన విచలితుఁడుగాక అల్లన నాకరమెత్తి పరీక్షింపసాగెను.

విగనరీ: నాకిది యంతయు స్వప్నమువలెఁ దోఁచుచున్నది.

"ఇందు స్వప్నమేమియులేదు. అంతయు సత్యము. న్యాయాధికారి ముంగల నిలువంబడవలయునను భీతిచేఁ గరమును ద్రుంచుకొని

మెఱుఁగరు. చూచుటకు మామూలు పెట్టెవలెనుండునట్లు కడుచిత్ర ముగ నది నిర్మింపఁబడినది."

"ఈగదిలోనికి వచ్చుట కందఱికి అనుమతి లేదనుకొనెదను."

"అవును. నీవు తలఁచినట్లు అంద ఱీగదిలోనికి రా వీలులేదు. ఒకరి కొకరముతోడై పనినల్పు నేనును, నీమేనమామయు, ముప్వురు గుమస్తాలును, కచేరీ నౌకరగు మాణిఫన్ దక్క అన్యులీయాగారములోఁ బ్రవేశించుటకు వీలులేదు. మాణిపన్ రాత్రులందుఁ గచేరీగదిలోఁ బరుండి యుండును."

"మేనమామగారుచేరఁదీసిన బాలకుఁ డీగదిలోనికివచ్చుచుండునా?"

"అతఁ డిదరికి రానైనరాఁడు. కచేరీగది కవ్వల నుండుమని వాని కాదేశ మొసఁగితిని, బుడుతఁడించుమించుగ దినమంతయు నేదేని మిషఁ గల్పించుకొని పురవీథులఁ గ్రుమ్మరుచుండును. కచేరి పని ముగియువేళ నొకమాఱు మొగముఁజూపి పిదప నందఱియుద్యోగులవలె దానుగూడ బసకుఁ బోవుచుండును."

"అతఁ డీ మేడలో నుండుటలేదా!"

"లేదు? అతఁడును అతని పితామహియు నొకచోట బస యేర్పఱచుకొనిరి. బాలునివయసు పం(డెండు బదమూఁడు యేఁడులు మాత్రముండును. కాని, బుడుతఁడు మిగులఁ జురుకైనవాఁడు."

"నేను వాని నొకమాఱు పరీక్షించి చూతును.

"ఎవరి సహాయముఁ గొనకయే నీవే యీరహస్యమును భేదింప సమకట్టుచుంటివా?—కూడని సాహసమునకు దొడరుచుంటివని నే నడరుచుంటిని. ఈ విషయమున నించుకైన నెఱుంగఁజాలిన యెడల నీమేనమామగారు నాపైఁ దమ క్రోధాగ్ని వెదజల్లక మానరు!"

"నీవంతగ నడరకుము. ఈ విషయమున నాతఁడావంతయేని మెఱుఁ

గజాలఁడు.—ఒకవేళ నెఱుఁగఁజాలినను యెట్టిబాధ్యతకైన నేను నా తల యొడ్డుదును. నీకేమియు భయముదు లేదు. ”

వృద్ధుఁ డీదుర్ఘటనమును నిక్కువముగ గ్రహింపఁజాలుము. ఈరుధిరధారలను ఛిన్నహస్తమును రవముఱంగును జూచినంతనే ఆతనికి గట్టి సందియము పుట్టకుండ నుండునా ? ”

రక్తమును నేనిపుడే గడిగివైచుచుంటిని ! ఇంచుక నేఁటిలో ఛిన్నహస్తమును నీన్ నదిలోఁ బాఱవైచి వత్తును. ద్రావకమందు నుంచియుంచి చేయిని దాఁచఁగలుగు సాహసము నాకులేదు. ఇఁకఁ గంకణము మాటందువా ? దానిని నాయొద్దనే యుంచుకొందును. మఱుఁగు యధికారిణిదర్శన మబ్బునందాక రేఁబవలు బది నాకడనే యుండును. నేనెన్నఁటికాపెను వెతకి పట్టఁజాల నని నీవూహించుచుంటివి కాఁబోలు. సోదరా ! శంకపీడి నిశ్చింతుఁడవై యుండుము. నిక్కముగ నేనాజాణను బట్టి తీరుదును; ఈకంకణము ఫ్రాన్సు దేశములోఁ దయారైనదికాదు. నిర్మాణకౌశల మందే దీనిపరిచయము స్పష్టమగుచున్నది. మఱుఁగు ధరించిన ముదిత నిక్కముగ విదేశిని మనము గుమ్మరుదశమందే చోరాంగనగూడ దిరుగుచుండును ! నాచేతిలోఁ బనియేమియు లేదు ఇఁక నాతస్కరిణి నన్వేషింప నడుముగట్టెదను. నేనెందులకుఁ బనికి మాలిన వాఁడనని మేనమామగారు చీవాట్లు బెట్టుచుందురు. చోరమంతిని పట్టుబడెనేని అన్ని విషయము లాతనికి విప్పి చెప్పుదును. ”

“ చోరాంగనను బట్టుకొనినందున నీ కేమి ప్రయోజనము ? ఈ వూనికయం దానంద మేమైన నున్నదా ? ”

“ అట్లని వేతే యడుగుచుంటివా ? ఇట్టి యానంద మిఁకెందుఁ గలదు ? కఠోరరహస్యమును భేదించుటే యాహ్లాదము! శైశవము నుండియు నపరాధపరిశోధకోద్యోగము నాకుఁ బ్రీతిపదము. కాని తలిదం

"మంచిది ఇట్టి నామములు పెట్టివేయుము. నీకట్టి నాంఛయున్న దని నేనుతర్కింపనేల? సాంకేతికనామములు పెట్టిన ట్లెట్లెరిగి యున్నా తప్ప కారణ మరసినయెడల యేగాలి నీ పీ యూరుని ఘటనోదంత మంతయు నేకరువుపెట్టునో వేమో యని యందలి మంచిదే నిప్పు జాగ్రత పడుచుండవలెనని అట్లంటిని."

"అవును. మంచిదే నన్నే నతిక్రమించుట మంచి" దని, నెయ్యుని వ్యంగమును లెక్కసేయక ఇంక నేమియు బలుకక పలవిూది రక్త మును తుడిచి చిన్నహస్తము నొక వార్తాపత్రికలో జుట్టివైచి వికసరీ నాయని హస్తమునకిచ్చెను. కంకణమును ఛిన్నహస్తపు జుట్టను వదిల వరకు దన యంగీజేబునం దిడుకొని మేక్సిము, "ఇంక నడువుము. మన యిచటికి వచ్చి నట్లెవనికిని దెలియ గూడదు జుమీ. దీప మార్పి వేయు" మని దారిం దీసెను.

చీంకటియందుం దప్పటడుగు లిడుచు మిత్రు లిద్దరు మెల్లగా నా గృహమునుండి అవ్వలి కరిగిరి. రాజపథమున బ్రవేశించగానే మేక్సిము "నిన్న నెచటనుంటివని నేనడుగునపుడు రొక వేళ నన్నె బ్రశ్నించు నెడల మధుసేవయందుం దవిలి యెడ లెఱుగక పడియున్నందున మెల్లగ సురావిపణినుండి నీవు నన్ను బసకు దోడ్కొనిపోవ నచటికి జనినట్లు ఆతని కెఱింగింపు" మని సహచరునకు సాకు జూపెను. అనంతర మా యువకు లిద్దరు బిఱబిఱం దెరువునంటి చనిరి.

౨

మంసియేవర్గు దరిద్రునింట జన్మించెను. కాని, నిజ పరిశ్రమవలన నాతడు మేషపాలకావస్థనుండి ఉన్నతింబొంది క్రమక్రమముగ నైశ్వర్య మూడమును నారోహించెను. ఆతని యేకాత్మజ ఎలిస్ తక్క, వృద్ధ్యాయం దీడ నాతని కేరును లేరు. మేనయల్లుడు మేక్సిము వేఱుగ వసించుచుం

డెను. మాపవలని యడకేమియు లేక ఆతఁడు విచ్చలవిడిగఁ దిరుగుచు బరమోల్లాసమునఁ గాలము బుచ్చుచుండెను. ముదుసలియగు వర్జర్సు ఆతని కెన్నియో బుద్ధులు గఱపెను — కల్వెరచేఁ గఱపించెను. కాని, యువకుఁడు వారి యుపదేశముల నన్నిఁటిని బెడచెవిబెట్టి వైచెను. తండ్రి సంపాదించి విడిచిన అతులైశ్వర్యమున కాతఁడధికారి యాయెను. గుఱ్ఱపు పందెములందును విందులందును నాటకములందును నీరువలె నాతఁడు విత్తము వెచ్చబెట్టగడఁగెను!" జనకునివలెను మాతులవలెను మితవ్యయిగాక విలాసములందుఁ దేలువాఁడయ్యు మేక్సిము పటుసాహసవంతుఁడు — సరళస్వభావుఁడు — సత్యవాది. వంచనము, అనృతము మొదలగు నీచగుణము లాతని చరితమందించుకైనఁ జూపట్టలేదు.

గత ప్రకరణమున వర్ణింపఁబడిన దుర్ఘటనము జరిగిన మరుదివసము ప్రాతమునఁ దండ్రి కూతుఁ లిర్వురు దమ యాగారమున నుపవిష్టులై ప్రసంగించు కొనుచుండిరి.

వారిలో నెవరి ముఖమునందును విశాదచిహ్నము లేశమాత్రమైనఁ గాన్పించుటలేదు — యిర్వురి యాననములు ప్రసన్నములై ప్రముదితములై పవిత్రములై యుండెను. తనకు నలువలను లందును వసుమతి సుఖాలోక విరజితమై మధుర సుధసంసిక్తమై యున్నటు లా నెంతకు ద్యోదకమగు చుండెను. ఆ ననబోఁడి జీవననభమున నెన్నండు గష్ట పయోధరము నూపట్టలేదు. స్వచ్ఛనిర్మల స్రోతము లీల నామె జీవన ప్రవాహమప్రతిహతగతిఁ బ్లావితమగుచుండెను. ఆబాల సునీల యాకార విశ్రాంతి నయనయుగళమునుండి ప్రీతిప్రమోదము లుప్పొంగుచుండెను!

మృణాళసంకాశ ధవళబాహువల్లరులచే జనయిత కంధరసీమను వేష్టన మొనరించి ఆ పల్లవోష్ఠి ఆతని గండస్థలమును ప్రణయపురస్సరముగఁ జుంబన మొనరించెను.

"అమ్మా! కుర్చీలోఁ గూర్చుండుము. నీవింకను చిన్నపిల్లవుగావు. నీకుఁ బందొమ్మిదేండ్లు గడచినవి తల్లీ!"

"బాబయ్యా! నిక్కముగ నే నా విషయము మఱచితిని—ఇంకను నీ తొడలోఁ గూర్చుండఁ బోవుచుంటిని."

"ఎంత వెఱ్ఱిపిల్లవే అమ్మా!"

"జనకా! నేను తలఁచుకొన్న యెడల మిగుల గంభీరను గాఁగలను"

"అమ్మా! అట్లని యెఱుఁగుదును బుద్ధిమంతురాలవగుమ్మా నీకుఁ బరిణయప్రాయము వచ్చినట్లు మఱచితివా?"

ఎలిస్ యీ పర్యాయము జనకుని ప్రశ్నకుత్తర మొసఁగ లేదు. తండ్రి ముంగలగల యాసనముపైఁ గూర్చుని ఫలహారవస్తువులను వరుస వరుసగ బల్లపైఁ జేర్పదొడఁగెను. అనిమేషలోచనుఁడై ముదుసలి తనయ ముఖముపై ప్రీతిదృక్కుల సారింపసాగెను. లజ్జాయూరక్తిమ యాసుందరి వదనవనజముని సుజ్జ్వలమొనరించెను. స్మితముఖుఁడై జనకుఁడు "అమ్మా! ఇపుడు బాగుగ నాలోచింపవలయు. సమయ మాసన్న మాయెను. నీవిఁక విశేషకాలము పెండ్లిలేనిదానవై యుంట దగ"దనియెను.

ముఖమెత్తి యెలిస్ "బాబయ్యా! నిన్ను విడిచి నే నెచటికిని బోఁజాల" ననెను.

"నన్ను విడిచి నీవు చనవలెనని నే నుద్దేశించుట లేదు. పేరిసు నగరమునుండి నిన్నొంటు తావునకుఁ గొనిపోవ నల్లునకు నే ననుమతి యొసఁగుదునా? నా కనుంగు బిడ్డను నాముంగలనుండి కొనిపోవు జామాతను నే నెన్నుకొనను"

"బాబయ్యా! నీ యుద్దేశ మట్టిదని నేను విశ్వసించుచున్నాను"

కుమారి కౌతుకమును గనిపెట్టుటకై వర్జన్ను యిట్లనెను. "తల్లీ! నిన్నుఁ జెండిలి యూడ నెన్నెన్ని చోటులనుండియో యెంద ఱెందఱో వచ్చుచు

న్నారు. రష్యా దేశమునుండి ఒక యువకుఁ డరుదెంచి నిన్ను దన కిమ్మని నిన్ననే వేఁడి యుండెను"

"బాబయ్యా! ఎందులకుఁ బరియాచక మాడెదవు?"

"అమ్మా! ఇందుఁ బరియాచక మేమియు లేదు. నీతో నిక్కమే చెప్పుచుంటిని. కర్నలు జోసెఫ్ చాల ధనికుఁడు. కతిపయదినములకు మున్నే ఆతఁడు పదునేను లక్షల రూకలను మన బేంకులో జమ జేసెను. ఆతఁడు గొప్పవంశమునఁ బుట్టినవాఁడు — పిన్నవయసువాఁడు. రూప మందుఁ గడుసుందరుఁడు: నీపై నాతని మోహదృష్టి పడియెను. నీ కిష్ట పడితి వేని, వెంటనే ఆతఁడు నిన్నుఁ దన యర్ధాంగిగా జేకొనును"

"బాబయ్యా! నీవు పెండ్లికి సమ్మతించిన మొదల నీ బిడ్డను బాగుగఁ గోల్పోయిన వాఁడవగుదువు"

"అమ్మా! నీకిష్టము లేని పెండ్లికి నేనుమాత్ర మెందులకు సమ్మ తింతును? నీ యభీష్టమునకు విరుద్ధముగ నేనే కార్యము సలుపను. నన్ను వీడి నీవు విదేశముల కరుగుట నాయభిమతమా? ఎంతటివాఁడైనను ఒక విదేశీయుని కరముల నా ముద్దుపట్టి నప్పన మొనరింతునా? బేలవై నన్నిట్లు భయపెట్టెదవు?" అని ప్రీతిపురస్సరముగ వృద్ధుఁ డనెను.

ఇంచుక శిరమెత్తి, ప్రమోదగర్భితములగుఁ జూపులఁ దండ్రిపై సారించి "బాబయ్యా! ముందుజన్మమందుఁ గూడ నేను నీకడుపుననే బుట్టుదు" నని తనయ పల్కెను.

"వివాహప్రసంగము సలుప నెవరైన నా ప్రేమోలకు వచ్చునపుడు యీ దివ్యభవనమందే నాకూతురు పల్లీఁడు నెల్లప్పుడు హాయిగఁ గాలము బుచ్చవలయుగాని ఒండుతావలమునకేఁ జనరాదని స్పష్ట ముగఁ దెలిపితైతును. నాయభిప్రయానుసారము వర్తించువానికే నా యాత్మజ నొప్పఁగుదును,"

"జనకా! ఈ సౌధమందుండి గడపుజీవనము నిక్కముగ సుఖోపేత మై యుండును."

"అట్లైన, నీ వివాహమున కేకేమియు నభ్యంతరము లేదుగదా?"

"అతఁడు —

"బోధపడినది. వరుఁడు మనసునకు నచ్చినవాఁడైన సమ్మతించుట నీ యభిమతము. మంచిది — అమ్మా! నీ వెట్టివరునిఁ గోరుకొందువో తెలుపుము. ఈ విషయమున మన యిర్వుర యభిప్రాయములు పరిపకు నేమో చూచెదను. నీ వల్లభుఁడు యువకుఁడై యుండవలెను గదా? — ఏమందువు?"

"అంతపిన్నవయసువాఁడై యుండరాదు"

పాతిక ముప్పదేండ్లకు నడుమ యీడువాఁడై యుండవలెను — నీ యుద్దేశమదియేనా? మంచిది—నా యభిప్రాయము కూడ నదియే! వరుఁడు చూడ సుందరుఁడై యుండవలెను గదా!—ఏమనెదవు?"

"శరీరసౌందర్యము కంటె హృదయసౌందర్య మధికముగ నుండవలెను—అతఁడు బుద్ధిమంతుడును, దయార్ద్రచేతస్కుఁడును, భద్రపూరుషుఁడు నై యుండవలెను! అట్టివాడే నాచిత్తము నాకర్షింపఁజాలును.

ఇంతదనుక మనయిరువుర యభిప్రాయము లొక్కరీతిగ నుండెను. ఇపుడాతని యార్థికావస్థ యెట్టిదై యుండవలెనో యోచింప వలెను."

"అతఁ డమేయ ధనరాసుల కధికారియై యుండవలెనని నేనపేక్షించుటలేదు."

నాయభిప్రాయము కూడ నదియే——కాని, విత్తము నార్జింపఁగల శక్తి ఆతనికుండు టవసరము."

"జనకా! నీభావము నాకుఁ బూర్తిగ స్పష్టమగుట లేదు."

"అమ్మా! ఇందు స్పష్టమగుట కేమున్నది? యువకుఁడు కష్టమును సహింపఁజాలువాఁడై యుండవలెను. నీమాతను నేఁ బెండ్లి గావించు

కొనినప్పుడు నాయొద్ద నొక గ్రుడ్డిగవ్వయైన లేదు. కాపురమునకు వచ్చుతఱి నీజనని చాలసారె గొనివచ్చెను. కాని నే నామెవిత్తమును ముట్టక స్వీయ కృషిమీఁదనే ఆధారపడియుంటిని తన పెనిమిటి శ్రమ నోర్వఁగలవాఁ డంచును గాలక్రమమున స్వప్రయత్నముక తన నైశ్వర్యవంతుఁడు కాఁ జాలునంచును ఆ యమ దలఁచెను. ఆపె యాస యడియాస కాలేదు”

“జనకా! నే నొక పనికి మాలిన సోమరిపోతును ఒకిగాఁ బడయ వాంచించుచుంటినని యోచింతువా?”

“లేదు నారక్తము నీ ప్రతినాడునందుఁ బ్రవహించుచున్నపుడు నీ వట్టి వెఱ్ఱిదానవని యెట్లు యోజింతును? — అమ్మా! నాయధీనమునఁ బనిఁ జేయు నుద్యోగులలో నెనరైన నీ కేలుబట్ట నపేక్షించిన యెడల నీవందులకు సమ్మతింతువా? నీకుఁ బతియగు నా యుద్యోగి మున్ముందు నావ్యాపారమందు భాగస్థుఁడు కాఁగలడు”

“అట్టి యుద్యోగి పత్ని నగుటకంటె నాకధికసుఖమేమియులే” దని ఎలిస్ అస్పష్టస్వరమునఁ బలికెను.

“నాకు నచ్చిన వరుఁ డొకఁడు కానిపించుచున్నాఁడు. అతఁడు విశ్వాసనీయుఁడు — గుణవంతుఁడు. మున్ముందు వృద్ధిలోనికి రాఁగలడు. నిక్కముగ నీవాతని బ్రేమింతువని నానమ్మకము. వాని పేరు జెప్పివైతువా?” యని స్మితముఖుఁడై వృద్ధుఁ డనెను.

“అతఁడు నీ కార్యదర్శియగు రాబర్టు కాఁడా?” అని ప్రమోదమును సంవరణ మొనరించుకొనఁజాలక ఎలిస్ యనెను. కనుబొమ్మలు ముడి వైచి వృద్ధుఁడు “ఏమి నే నాతని విషయముఁ బ్రసంగించు చుంటినని యోచించితివా? అనియెను.

ఎలిస్ ముఖము వివర్ణమైపోయెను. నతవదనయై చూపుడ్కల నేలపై బఱపుచు ఆపె యట్టులే కూర్చుని పోయెను. వర్జర్సు వదనమునఁ గూడ కూర్పు చిహ్నములు పొడసూపెను.

"నేను రాబర్టువిషయమును బ్రసంగించుచుంటిననినీ వెట్లు గ్రహించితివి?"

"అతఁడు నీయధీనమందలి యుద్యోగి కాడా ? ఆయువకుఁడు విశ్వాస భాజనుఁడని నీవీవఱలో నాకుఁ దెలిపియుండలేదా ? వివాహ సమయమున నీవెట్టి నిరుపేదవో - యెట్టి 'పరిశ్రమకుశలుండవో - యెట్టి యభిమానవంతుండవో ఆతఁడు కూడ నిత్తఱి యట్టివాఁడు కాఁడా ?"

"రాబర్టునకు నీ గుణములన్నియుఁ గలవని యంగీకరించెద. కాని అతని నావ్యాపారమందు భాగస్థునిగాఁ జేకొని - నాయల్లునిగా వానిఁ బరిగ్రహింప వాంఛించుచుంటివని నీ వెట్లు గ్రహించితివి ?"

"తనయ భవిష్యసుఖమును గురించి తండ్రి పరిహాసమాడుచుండెనని మాత్రమెట్లు గ్రహింపఁజాలియుండును ?"

"నేను పరిహాసము సలుపుటలేదు"

"హృదయపూర్వకముగ నిక్కమే వచించుచుంటివా ? - అట్లైన నీలక్ష్య మెవరిపైఁ గలదు ?"

"అది మరియొకనిపైఁ గలదు. ఇపుడు నానుడువు నాలింపుము. రాబర్టు యెట్టి యవస్థలోనుండ నాశ్రయ మొసఁగియుంటివో నేనువిస్మరింప లేదు. ఆతని జనకుఁడు ధనాఢ్యుఁడు - మన బేంకుయం దాతఁడు మిక్కిలివిత్తమును జమచేయువాఁడు కాని ఆవ్యక్తి జూదరియై సర్వస్వమును గోల్పోయి పరమపదించెను. ఇంచుకైనను ఆస్తిలేనివాఁడై తండ్రిఁ గోల్పోయిదుస్థితియందున్న రాబర్టును గాంచఁగనే కనికరించి సామాన్యవేతనమున నాతనికి నాయధీనమున నుద్యోగ మొసఁగితిని ఆనందపురస్సరముగ నాయువకుఁ డుద్యోగమును పరిగ్రహించెను. రాబర్టు గొప్ప యింటి బిడ్డ. ఐశ్వర్యమునఁ దులదూఁగువారి యింటఁ బుట్టినవారు శారీరక పరిశ్రమకు విముఖులై యుందురు. కాని రాబర్టు యీకొలఁది కాలములోఁ దనపూర్వసుఖమును మఱచి నడుమువంచి పాటుఁబడుట మొదలిడి నాప్రశంసఁ బడసెను. అనేక విధముల నే నా

తనిఁ బరీక్షించితిని. నిక్కముగ నాతఁడు విశ్వసనీయుఁడు — పరిశ్రమకౌశలుఁడు. కాని యైశ్వర్యవంతునింట జన్మించినవాఁ డగుటచే దీర్ఘకాలము రాబర్టు శ్రమనోర్వఁ జాలఁడు. అందుచే నే నెంతసాయము సల్పినను వాణిజ్యమం దాతఁ డున్నతిఁ బడయఁజాలఁడు.”

“అట్లని యోజించు టనుచితముగాదా ?”

కాదు. రాబర్టు గొప్పవారివంశమున నుద్భవించెను. చిరకాలమాభిజాత్యగర్వ మాతనియందు నిలువఁగూడదు. వర్తకమందలి యభిలాషవంశగతమైనది. — నాయం దట్టి యభిలాష యున్నది. సామాన్యమానవుఁడ నగుట నాయందది దృఢీభూతమైయుండెను. దురంతదుస్సహానర్థాంతదుఃఖదారిద్ర్యములయందు నేను పెరుగఁబడి వచ్చితిని నిదహారము లెఱుఁగక నెండవానలయందును శీతాతపములందును నే నెన్నెని కడగండ్లను గుడిచితిని. కాని రాబర్టు విలాసామోదములందు లాలితుఁడాయెను. ఇపు డాతఁడు విత్తము యొక్క మూల్యము నించుక మాత్రము గ్రహింపఁజాలెను.

“క్రమక్రమముగ నున్నతస్థితినంద నాతఁడు శక్తివంచన లేక సలుపు పరిశ్రమయందు రాబర్టుసద్గుణములు మీకుస్పష్టముగఁ దెల్లమగుట లేదా?”

“తెల్లమగుచునే యున్నవి. కాని మంచిగుణము లున్నంతమాత్రమున మానవుఁడు ధనికుఁడు కాఁజాలఁడు. రాబర్టు యంతఃకరణము మహోత్తరమైనదే!—ఆతనిచరిత్రమున దోషము లేశమైనలేదు. నాయంతఃపురమున నిరాటంకముగ రాకపోకలు సల్పుట కాతనికిఁ బ్రమోదపూర్వకముగా ననుమతి యొసఁగఁజాలుదును. పలువిషయములందు వానిని సంపూర్ణముగ నమ్మఁజాలుదును. కాని, యున్నత వాణిజ్యపరిచాలనమున వానిసామర్థ్యముపై నాధారపడియుండఁజాలను. రాబర్టుసాధుగుణముల నించుకైన శంకింపనివాఁడనయ్యు వానివంశపువారి కేరికి వాణిజ్యబుద్ధి యుండదను విశ్వాసమును నాచిత్తమునుండి మాపుచేయఁజాలను.”

ఎలిస్ యింక నుత్తరమొసంగలేదు. కన్నులనుండి సంతతధారగా స్రవించు బాష్పాంబువుల నామె యడంప నెంతేని యత్నించెను. తనూభవ వాపోవఁగాంచి వర్జన్సు విచలిత చేతస్కుఁడాయెను. ఒకించుక తడసి యాతఁడు "అమ్మా! నేఁడు నీ యాకలి యేమాయెను?— ఇంతవరకేమియు నంటకుంటి వేల? నీయారోగ్యమున కెట్టి భంగము కలుగలేదుగదా?" యనెను.

"లేదు. కాని, నేఁడు నాకాఁకలి వేయుటలేదు."

"జననీ! దోసమంతయు నాయది. పెద్దలిమాట నెత్తకున్న బాగుండెడిది, ఇపు డందుకై నేనంతగాఁ దొట్రుపాటు బడుచుండుట లేదు. తల్లీ! ఇఁక నెన్నఁడీ విషయమును నీమ్రోలఁదలపెట్టను. ఇపుడొకమాట మాత్రము చెప్పి యూరకొందును. సమానవంశజునకు దక్క నొండువంశీయునకు నిన్నొసఁగి పరిణయ మొనరించుటకు నాచిత్తమొల్లదు. మనకంటె నధికులై జన్మించినవారి దెస వ్యామోహదృష్టులను సారించుట మనకుఁదగదు. అట్లొనరించితిమేని మున్ముందు మనకుఁ జేటుకల్గును. నీవు వరించిన యువకుని వీడి మఱొకని నీకుఁ దోడుఁ జేయఁబూనుట నాకుఁ దగదని యెఱుఁగుదు. అమ్మా! ఏమిచేతును? నీయభీష్టమునకు వ్యతిరేకముగా నిత్తఱి యాచరింపక తప్పుటలేదు. ముదసలినైతిని. ప్రపంచమున నెన్నిని వింతలను వంతలనుజూచితిని. ఇపుడు నీవాంఛకు వ్యతిరేకముగఁ దోఁచునదే భవిష్యమున సౌఖ్యప్రదము కావచ్చును. ఈసమయమున నా యంతరాత్మకు వ్యతిరేకముగ నాచరింపఁజాలను. వాణిజ్యమునఁ గుశలుఁడై మున్ముందు నున్నతస్థితి నందఁజాలు జామాతనే నే నెన్నుకొందును. నేను కృషికపుత్రుఁడను. రాబర్టో — అతఁడు మార్క్విస్ తనూభవుఁడు. ఆతని యంతస్తునకు నాయంతస్తునకు మిక్కిలి భేదముకలదు. ఈప్రసంగము నింక నింతటితోఁగట్టిపెట్టుదును. అమ్మా!

ఇఁక సంతోషచిత్తవై యీ యంజూరఫలములఁ దినుము. నీకై ప్రత్యేకముగ వీని నెంతయో దూరమునుండి తెప్పించితిని. "

ఎలిస్‌న కిఁక నోరిబి చాలకపోయెను. ఆమె లోచనములనుండి బాష్పశైవలిని వెల్లివిరియ గమకించెను — ఆ యన్నులమిన్న హృదయమున భేదించి క్రందనమీవలికిఁ బర్వొత్తి రా నుంకించెను. అప్పుడె యాగార కవాటము తెఱువఁబడెను. తోడనే రాబర్టాగదిలోఁ బ్రవేశించెను విశేష హేతువులేనిదే తండ్రికూతుల ప్రసంగమున కాతఁ డంకిలి పెట్ట సాహసించువాఁడు కాడు. ఎలిస్ దెస నొక కటాక్షముఁ బరిపి అతఁడు వర్జుస్సు మోలకరిగెను. ప్రేమాస్పదుఁడగు నా యువకు నొక మాఱు కన్నెత్తి జూచి ఆమె నతముఖమాయెను. "అంతయు నంతమొందెను. ఇఁక నాసలే" దని ఆచూడ్కు యువకునికిఁ దెలిపి యుండును.

యువకుని ముఖమండల మాకస్మికముగ వివర్ణమైపోయెను. మహాహ్లార్తమాత్ర మాతఁడు స్తంభితుని మాడ్కి నిలువఁబడిపోయెను.

ప్రేమశూన్యస్వరమున వృద్ధుఁడు — "ఏమి వార్తలోయి చిన్నవాఁడా ?" యని ప్రశ్నించెను.

ఇతర సమయములందాతఁడు రాబర్టును బ్రీతిపురస్సరముగఁ బేరుఁబెట్టి పిలుచువాఁడు, వ్యంగస్వరమున నాతఁడిట్టుల సంభోదింపగనే చకితుఁడై యేదో ఘటించియుండెనని యువకుఁడు గ్రహించెను!

ఆవేగము నడంచుకొని రాబర్టు "కర్నలు బెౌమఫ్ మీ కోసరమై కచేరిలోనికి వచ్చె" ననెను.

"నే నిపుడు తొందర పనియందుంటిని కొంతతడవు వేచియుండుమని ఆతనికిఁ దెలుపుము."

"అట్లని నే నాతనికిఁ జెప్పియే యుంటిని. కాని మీతో జరూరుగ నేమో ప్రసంగింప నాతఁడు వేగిరపడుటవలన నే దోడనే వచ్చి మీకుఁ గబురుఁ దెలుపుట దప్పని సరియైనది."

రాబర్టుతోఁ బ్రసంగించుట యందు అంతతొందరపడుట యుక్తము గా లేదని గ్రహించి వర్జర్సు మృదుస్వరమున నిట్లనెను. "రాబర్టూ క్షమింపుము. ఈసమయమున నరుదెంచి కర్నలు బెరిషఫ్ నాకు విసుఁగు బుట్టించుట నీదోషముకాదు. నేనిపుడే వచ్చుచుంటినని ఆ పెద్ద మనిషితోఁ జెప్పుము."

ప్రణామమాచరించి యువకుఁడు నిష్క్రమించెను.

వర్జర్సు దుహితలలాటమును బ్రేమపూర్వకముగాఁ జుంబన మొనరించి, "అమ్మా! వివర్ణవదనవై యుండఁబోకుము. ఒకించుక యోచించితి వేని నీజనకుఁడు నీ మంగళమును — నీసుఖమును ఆపేక్షించుచుండె ననియు ఆతని యుద్దేశములందు బ్రతికూలమైన దేమియు లేదనియు గ్రహింపజాలుదు" వనియెను.

ఆవేగముచే ఎలిస్ కంఠము శుష్కమైపోయెను. నిమిషముఁబలుకక నతముఖియై యూపె అందుండి చివాలున నవ్వలికరిగెను.

"పెండిలిమాట యెత్తగనే నేఁడు తనూభవరహస్య ప్రేమోదంతము తెలియవచ్చెను. ఆ వృత్తాంతమున కిత్తరి అవగతుఁడ నగుట మంచిదే యాయెను. ఆరంభమందే తనయ నీస్వప్నమునుండి మేల్కొలుప వల యును. ఈగూఢవిషయము వదపడి యెఱిఁగిన మిగుల శోచనీయ మైన పరిణామము చూపట్టెడిది. ఇపుడే మెలుఁకువ పడుట యుక్తము" అని తనలో వితర్కించుకొని నిజాగారమును వీడి వృద్ధుఁడు కచేరీగదిలోఁ బ్రవేశించెను. ఆగదికిఁ బ్రక్కగల గదిలోనే రాబర్టు పనిచేయును. రెండు యాగారములకు నడుమ నొక యవనిక మాత్రముండెను. రాబర్టు యెడ వర్జర్సునకుఁ జాలనమ్మకముకలదు. కోఠీవ్యాపారమందలి యే గూఢ విషయమైన నాతని వలన బయలుపడదని వృద్ధుని విశ్వాసము.

నిజాసనమునఁ గూరుచుని యువకుఁడు తన పనిఁ జూచుకొనుచుండ వర్జర్సు గదిలోఁ బ్రవేశించెను. కర్నలు బెరిషఫ్ ఆ యాగారమందే అతని

కొఱకై వేచియుండెను. వృద్ధుని జూడగనే అతఁడు యభివాదము సల్పి మహాశయా! భోజన సమయమున మీకుఁ జాల తొందరఁ గలిగించి మిమ్ము రావించి అనుచిత మొనరించితిని. మన్నింపుడు. మీతనయ కుశలమా?" యనెను.

"నాతనయ కుశల మరసినందులకు సంతసించుచుంటిని. నేఁడామె యించుక సుస్తీగానున్నది. ఇపుడెందులకై మహాశయులు విచ్చేసిరో యడుగవచ్చునా?"

"ఇంతకుమున్నే మాదొరతనమువారి యొద్దనుండి అగత్యమైన తంతివార్త యరుదెంచెను. రేపటిదినమందే నేను పేరిసునగరమును వీడి పోవలయును. తమయొద్ద నాసొమ్ము కొంత నిల్వ—"

"సొమ్ముఁదీసికొనఁ దలఁచుచుంటిరా? ముందు వార్తఁబడయక పెద్దమొత్తము నొక మాఱొసఁగుట నియమవిరుద్ధము. కాని తమ విషయము వేఱు. మీవిత్తమంతయు మీకు ముట్టుటకు నేనిపుడే వలయు నేర్పాటుఁ గావింతును."

మహాశయా! నేనిపుడు సొమ్మునకై రాలేదు. దాని నెప్పటట్ల మీయొద్దనే యుండనిండు. మీసిందుకమునఁగల నగలపెట్టెయుఁదు మూల్యవంతములైన పత్రములు కొన్ని గలవు. పేరిసునుండి చను సమయమున నేనా కాకితములను కూఁడా గొనిపోవలయును."

"నేనిపుడే మీపెట్టెను దెప్పించి యిత్తును."

"నేఁడే అవసరములేదు. నేఁ దోడనే అవ్వలికిఁ బోవలయును. రేపు బేంకు తెరవఁగనే వత్తును. అప్పుడు నాకుఁ గొన్ని వేల రూకల యవసరముకూడ నుండును."

"మీయిష్టము—అట్లనేకానిండు. నాయొద్ద మీపేరున నిపుడుపదు నేను లక్షల రూకలు జమనైయున్నవి. అవసరమైనయెడల మీవిత్తము నంతయుఁ గొనిపోవచ్చును. ఇతరవేళలందు నా ఖజానాయందు దినవ్యయ

మఱనకు వలయు విత్తము మాత్రముండును. కాని నేఁటి యుదయమునఁ గొండొక యుద్దేశమున ఫ్రాన్సుదేశము నుండి ముప్పదాఱులక్షల రూకల గొనివచ్చుటచే జాలినంత విత్తము సిందుకమందు నున్నది. మీరు కోరినంతనే యినుపపెట్టెను దెఱచి పైకఁ మొసఁగుదును."

వృద్ధుని నుడువులు ముగియకమున్నే కరమునఁ గొన్నికమ్మలనిడి కొని యజమానుని గదిఁజొచ్చి రాబర్టు వాని నచటి మేజాపై నుంచెను. అను దిన మీ సమయమునఁ గచేరీజాబుల నాతఁ డిట్లు కొని వచ్చుచుండును. రాబర్టు ముఖము నేఁడు వెల్లనై యుండెను. కర్న లాతని ముఖము నుపలక్షించి, మృదుస్వరమున "ఈయువకుఁ డెవరు? ఈతఁ డేలకో మిక్కుటముగ విచలితుఁడై నట్లగపడుచున్నాఁడు" అని వర్జర్సు నుద్దేశించి పలికెను.

వృద్ధుఁ డాప్రశ్న కుత్తర మొసఁగ లేదు. ఇఁక నందు నిలుచుట కేమియుఁ బనిలేనందున బెరిమఫ్దారు, కోశీపతి సెలవుఁ గైకొని అందుండి నిష్క్రమించెను. తోడనే వర్జర్సు రాబర్టును బిలిచి, "ఏమోయీ! నీతోఁ గొంత ప్రసంగింపవలసి యున్న" దనియెను.

కడపటికు రాబర్టు మొలిసుల ప్రణయచరిత్రము నెఱిఁగి, తన మనోనిశ్చయము నాయువకునికిఁ దెలుప వృద్ధుఁడు సంకల్పించుకొనెను.

రాబర్టు — ఏమి మాట్లాడఁ దలఁచితిరో సెలవిండు.

వర్జర్సు — నీవు నాయొద్ద నుద్యోగముఁ జేయ మొదలిడి రెండేండ్లు కావచ్చినదను కొనెదను.

ప్రశ్నకు విస్మితుఁడై యువకుఁడు "చిత్తము. మీరనినట్లు రెండేండ్లు కావచ్చినది" అనియెను.

"ఈ రెండు వత్సరములలో నెన్నఁడైన నీకెట్టి నిరాదరణమునైనఁ జూపియుంటినా?"

"ఎన్నఁడును జూపలేదు. — మీరుచూపిన కృపకు నేను కృతజ్ఞుఁడను."

" ఆకృపకుఁ బ్రత్యుపకృతిగ నీవు నాకుమారితోఁ బ్రణయచర్చ మొదలిడితివా? "

రాబర్టు చకితుఁడాయెను. ఆకస్మికముగఁ దానిట్లు తారొక్కొనఁ బడుదునని ఆతఁడు తలఁచియైన నుండలేదు.

వర్జర్సు — దాపరిక మెందులకు? — వృత్తాంతమంతయు ఎలిస్ నాయెదుటఁ బ్రకాశ మొనరించి వైచెను.

యువకుఁ డాశ్చర్యాన్వితుఁ డై పోయెను. ఆతని నోటినుండి యే నుడువు వెలువడలేదు. ఆత్మసంవరణ మొనరించుకొనఁజాల నను భీతిచేఁ గొండొకవడి మిన్నకుండి ఆతఁడిట్లనెను: "మహాశయా! దాపరిక మొసరించుటకు నేఁగావించిన దుష్కృత్య మేమియు లేదు. తమ మాటలధోరణి యుక్తియుక్తముగా లేదని చెప్పవలసి వచ్చినందు లకు మన్నింపుడు. నేను మీ కూఁతు చిత్తము నాకర్షింపఁ బూను కొనలేదు. ఒక మాననీయుని కుమారివిషయమై, యెవరైన నొక కులవంతునితో నిట్టి యనుచితప్రసంగమునకు దొడరినయెడల, ఆమెను ఆతనిఁ గూడ నవమానపరచినవా రగుదురు."

"ఇంతలోనే కానియుక్రోషముఁ జూపినందునఁ బ్రయోజనములేదు. నెమ్మదిగా నంతయువిప్పి జెప్పుము. నీవు ఎలిస్‌ను బ్రేమించుచుంటివా?"

"నిస్సంకోచముగాఁ బ్రేమించుచుంటిని."

"అట్లని యొప్పుకొనుచుంటివా?"

"ఎందుల కొప్పుకొనను?"

"ఎలిస్ కూడ నిన్నుఁ బ్రేమించుచుండెనని నమ్మియుంటివా?"

ఎలిస్ కూడ నన్నుఁ బ్రేమించుచుండెనో లేదో మీరెఱుఁగరా? వృత్తాంతమంతయు నాపై చెప్పియుండెనని యింతకు మున్నే కదా తాము సెలవిచ్చియుండిరి!"

ప్రశ్న కుత్తర మొసగక వర్జర్సు యిట్లనెను. "ఇన్నినాళ్ళనుండి యు నీ వీ విషయము నా కేల దెలిపితివి కావు? దీని నెఱుగుటకు నాకు సంపూర్ణాధికారము కలదు. — మంచిది — యిఁక గతమును గుఱించి యోజింపఁ దలఁచుకొనలేను. ప్రస్తుతకర్తవ్యమేమో తెలుపుచుంటిని. నీదుర్వ్యాపార మిఁక విశేషదూరము, సాగిపోకుండ దోడనే యురికట్టి వై చెదను!"

వివర్ణమైన రాబర్టు ముఖప్రతిమ, వర్జర్సు నిశ్చితము ప్రకాశము కాఁగానే మఱింత మలినమైపోయెను. అయినను విచలితచేతస్కుఁడుగాక వృద్ధుఁడు చేయుబూనిన దేమో యెఱుఁగనాతఁడు ప్రతీక్షించియుండెను.

వర్జర్సు — మొదటినుండి నేను జాగరూకుండనై యుండవలసినది. నాపుత్రిక సుందరి — యౌవనద్యుతులతో నిపుడు శోభిల్లుచున్నది. ఆమెకుఁగల యైశ్వర్యముపై మక్కువపడి, ఆమెయెడల మృషాప్రణయ మూనియుంటివని నేననుచుండుటలేదు. నాముద్దుపట్టియెడ నీకునిక్కంపు టనురాగమే ఉండి యుండవచ్చును. కాని, నీయభీష్టము సిద్ధించుట నాయభిమతము గాదు. నాకొమరిత నీకుఁ బత్ని కాఁగలుగుట కల్ల. నీవర్తనమున నేమో దోసమున్నదని నేనీకళ్యాణమును బ్రతిఘటించుట లేదు. నాయనమ్మతికి గారణమును ఎలిస్సకు బోధించి చెప్పితిని. ఆమె గ్రహించినది. సౌభాగ్యము గాని పరిణయమునొక్క పరిణామ మె ట్లరిష్టభూయిష్టమై యుండునో ఆమె గ్రహింపఁజాలెను! సమానస్థితియం దున్న స్త్రీపురుషులకుఁ బెండిలి యైనయెడల, వారిదాంపత్య యజ్ఞ్యము సుఖోపేతమై యుండును. నేనొక వణిజుఁడను మాత్రమే! — నా కుమారి మార్క్విస్ బిరుదుఁ గలవాని కిల్లాలు కాఁబూనుట వట్టి యవివేకము!

"ఉన్నతవంశమున నేను జన్మించినందులకా మీ రిక్కార్యమున కభ్యంతర పెట్టుచుంటిరి? — శూన్యమైన బిరుదమును నేను పరిత్య జించి వైచితినిగదా!"

"నా యనసమ్మతికి ముఖ్యహేతువది కాదు. అనివార్యముగ నా జామాతకు వలయు గుణమొకటి నీయందు లేదు. నీవు వాణిజ్యబుద్ధి యున్న యువకుఁడవుగావు. అన్యసద్గుణములు నీయందెన్ని యున్నను యీ లోపము స్పష్టముగఁ గానిపించుచున్నది! వాణిజ్యమందలి యభిలాష పూనికవలనఁ జేకూరదు. — వంశగతమై యుండి, అది యుగ్గుపాలతోఁ బెరుగును. అట్టి యభిలాషయున్నఁగాని నాయీ వ్యాపారము కొనసాగనేరదు. నేను ముదుసలినైతిని. మరణించుటకు మున్ను, నాయల్లుఁడు స్వతంత్రముగ వ్యాపారము నెరపుటఁజూడ నువ్విళ్లు లూరుచుంటిని. అతులైశ్వర్యములతోఁ దులదూగు నాతఁడే నా కన్నియకు వరుఁడు కావలెనని నే నపేక్షించుటలేదు. వణిగ్వృత్తి యందు వలయు విత్తము నుపార్జించు శక్తిమాత్ర మాతని కుండినఁ జాలునని యోజించుచుంటిని. నిస్సంకోచముగ నా యభిప్రాయమును వ్యక్తీకరించినందులకు మన్నింపుము — కోపింపకుము. నాపుత్రికిఁ గూడ నే నీవిధమున నే చెప్పియుంటిని. ఇపుడు నీకు నేనేమి యుపకారముఁ జేయవలసియుండునో తెలుపుము. నాకు సాధ్యమైన తెఱఁగున దాని నొనరించి తీరుదును. ఇఁక ముం దీ విందుండుట కష్టకరమగును. ప్రస్తుతము రెండేండ్లు మీ రిర్వురు వేఱువేఱుగ వసింపవలె నని నే నుద్దేశించుచుంటిని. నావాణిజ్య మిపుడు వృద్ధినందుచున్నది. ఈజిప్టుదేశమందుఁగూడ నాకచేరికి శాఖకలదు. అచటఁగూడ నా వ్యాపారము జరుగుచున్నది. నాకుఁ బ్రతినిధిగ నీవచటికిఁ జనుము. బుద్ధిమంతుఁడవు గానఁ గొంతకాలములో వృద్ధిలోనికి రాఁజాలుదువు. ఏమి? నీవందులకు సమ్మతింతువా?"

రాబర్టు లేచి నిలువంబడి, "మహాశయా! నావృద్ధికోసరమై తా మిట్లు చింతితులగుచున్నందులకు హృదయపూర్వకముగ వందనము లాచరించుచున్నాను. మీకృపకు సర్వదా కృతజ్ఞుడనై యుందును.

తాము కావించిన ప్రస్తావము ప్రలోభనీయమైనది. ఇందు నా యంగీకారముఁ దెలుపుటకుమున్నొకమాఱు యోజింపవలయును" అని యెను—

"మంచిది. బాగుగ యోచించియే నీ యుద్దేశ మెఱిగింపుము. నీయెడఁ బేర్మిఁగలిగి, నిన్ను వృద్ధిలోనికిఁగొనివచ్చుటకు సంసిద్ధుఁడనై యున్నాను. దేశమందుఁ బేరుఁగలవాఁడవై, నీవు సుఖంబుగ నుండఁ జాలుటకు వలయు జతనము సల్పుదును. అనవరతము, నీకనుంగు నెయ్యుఁడనై యుందును. నేఁడు నీ జీవనాంబరమునఁ దోఁచిన పయోద మప్రశాంతము నిలువనేరదు."

"ఉత్తరము రే పొసఁగెదను. నేఁడు నేఁజేయవలసిన దేమైన నున్నదా?"

"లేదు. ఇపుడు నీ యిచ్చవచ్చిన చోటునకుఁ బోవచ్చును."

యువకుఁ డభివాదన మొనరించి, అవ్వలి కరుగగనే వృద్ధుఁ డిట్లు వితర్కింపదొడగెను.

"యువకుని మనోరథము వితథమై యిపు డాతఁడు స్థానచ్యుతుఁ డగుచున్నందులకు విచారము కలుగుచున్నది. కాని, యిట్లు నిశ్చయింప దప్పినదికాదు. ఇపుడు హృదయమును వేధించు నెగులు క్రమక్రమముగ నంతరింపజాలును. తనయ భావిదశను గూర్చి యింతగ తలపక తప్పదు. అచిరములో రాబర్టు నీ తావునుండి తొలగించుట అనివార్యము. ఇట్లని కుమారికిఁ దెలుపఁ జెల్లదు. పరిణయ ప్రసంగ మాపెకిప్పటి ప్రమోదకరమై యుండదు. కొంతకాలము అతివాహితమైన యనంతర మామెను విగసరీ కొసఁగి వివాహ మొనరింతును. మానవు నున్నతి నొందింపఁజాలు గుణములన్నియు నా యువకునకుఁ గలవు. అను దినము నాతని నావహ్వానించుచున్న యెడల, నిరువురకును సౌహార్ద ముదయించును."

నై గాఢవిచారిత హృదయుఁడై, రాబర్టు తన కచేరిగదినుండి అవ్వలికి జనెను. అతని సుఖస్వప్నములన్నియు నకాత్తుగ నంతరించిపోయెను. ఏ రమణిమూర్తి నాతఁడు హృదయమందిరమున నెలకొల్పి అశ్రాంతము పూజసేయువాఁడో, ఏసీమంతిని తక్కఁ బ్రపంచమున నాతని కన్యులు లేరో, ఆమె నేఁడాతనికి దూరమగుచుండెను. ఇహజీవనమున నామహిళమిళన మసంభవము. కన్నవాని యీయకోలు లేనిదే, ఆ యువకునితో నచ్చెలి కేలుఁ బట్టజాలదు. తండ్రి యనుజ్ఞకు లోనై యున్న నామె యెన్నఁడాతని యడుగుదాటి వర్తింపసాహసింపదు. వర్జన్సు ప్రసంగమువలనఁ దండ్రికూఁతు లిర్వురు కలిసి యోచించియే తనను నిర్వాసితుఁ జేయ నిశ్చయించినట్లు రాబర్టు యూహించెను. పాపమిఁక నా యువకునకు బ్రతుకునందు నాశయే లేక పోయెను. క్రోధదుఃఖము లొక్కమాఱుగ నాతనిహృదయ కరండము నావరించుకొనియెను. ఎడదయందు నిండుకొనిన వేదనము నందే యణంచి సగర్వమున శిరమెత్తి ఆతఁ డావలి కరిగెను.

ఆతని హృదయఫలకమున నాటుకొనిన నిశితశూలము జూలున్ వినగరీతక్క నొరు లెరును బరికింపలేరు. ఆతఁడువిశ్వసనీయుఁడైన నెయ్యురియని గ్రహించి, రాబర్టాయువకుని హృదయపూర్వకముగఁ బ్రేమించుచుండెను. నేఁటి దుర్వార్త నాతఁడు నెయ్యుని కెఱిగింపక యూరకుండ నేరకపోయెను. తన యాగారము వీడి చని, చెచ్చెర రాబర్టు నెచ్చెలి యున్న గదిఁ జొచ్చెను.

"సోదరా! నీతో నొకమాటఁ జెప్పవలసియున్నది. వెంటనే వెలుపలికి రమ్ము."

ఇనుప పెట్టెకుఁ బిఱబిఱ దాళమువైచి, ఏమి! ఏమి! జరిగెను?" అని వినగరీ యనెను.

"నే నిందుండి పోవుచుంటిని. అందుచే జెప్పి పోవ వచ్చితిని."

"ఏమి! ఇందుండి చనుచుంటివా? వర్గర్సుగారు నిన్ను ఈజిప్టుదేశమున కంపుచుండవచ్చును. ఆ తావున కొక ప్రతినిధి కావలయునని ఈమధ్యనే అతఁడు కచేరిలోఁ జెప్పియుండెను."

"నేను ఈజిప్టుదేశమునకుఁ బోఁదలఁచుకొనలేదు."

"అట్లైన నెందరిగెదవు?"

"అది నేఁ జెప్పజాలను."

"ఏ మట్లనుచుంటివి? నీ వెందరిగెదవో నీ వెఱుఁగవా?"

"ఇచటి పనితోఁగల సంబంధమును పూర్తిగ వదలుకొంటిని."

"ఏమి? నీవు పదచ్యుతుఁడవైతివా?"

"లేదు నాయంతట నేను ఉద్యోగమును వదలివైచుచుంటిని."

"ఎందువలననో చెప్పుము — ఏమిజరిగినది?"

"అంతయు వినఁగోరుదువేని, అవ్వలికి రమ్ము. ఇచట నేమియుఁ దెలుపను; ఆ కుఱ్ఱవాఁడు మనమాటలను వినుచున్నాఁడు."

"ఎవరు? జర్జిటా? కిటికీగుండా గాలివడగను జూచుచు, అతఁడు తన్ను దాను మఱచియుండెను. మనమాట లాతని చెవులను సోకవు—పోనీ, నడువుము. వెలుపలికే పోదము. రహస్యవిషయము మవ్వలఁ జెప్పుకొనుటే మంచిది. కాని, అయిదు నిముసములకంటె నధికసమయము నాకులేదు."

ఉభయులును ప్రాంగణమందలి యొక నిర్జనప్రదేశమున కరిగిరి.

రాబర్టు: సోదరా! ఎలిన్‌ను నేను ప్రేమించుచున్నట్లు నీవుతక్క నొరు లెవ్వరును శంకించియైన నుండలేదు.

జూలుస్:, (ప్రఫుల్లవదనుఁడై) అవును. ఆమెకూడ నిన్ను ప్రేమించెను. మీ యిర్వురకు మిలనమవుగాక యని మనఃపూర్వకముగ వాంఛించుచుంటిని.

"ఒకరినొకరము ప్రేమించియుంటిమి — కాని యిప్పుడది వట్టిభ్రమ యని రూఢి యాయెను."

"అదేమి? అట్లనుచుంటివి? ఒకరినొకరము పీడమని మీ రిర్వురు వాగ్దాన మొనరించుకొంటిరిగదా!"

"అవునది నిక్కమే. నాకర్ధాంగియగుట కామె శపథపూర్వముగ నంగీకరించెను. నేను వట్టి నిర్భాగ్యయువకుండను దానం జేసి ఆ కిశోరి ప్రతిజ్ఞపై నాధారపడియుంటిని. జనకుని వేడికోలున నా యాశ దాని శపథ మేనట్టేటనో గలసిపోయెను!"

"ఆపెను నీవు కలిసికొంటివా!"

"లేదు. కాని, ఆయువతి తండ్రిద్రమోల మా గూఢవృత్తాంతము నంతయు నేకరువుబెట్టివైచెను. మా యిర్వురి ప్రణయోద్యోగమును వర్జర్సు ప్రతిఘటించెను. తన యభ్యంతరమునకుఁ దన కూఁతురు సమ్మతించెనని అతఁడు నిస్సంకోచముగ వ్రాసెను."

"ఆమె యట్లు సమ్మతించెనని నేను విశ్వసింపను — వృద్ధుఁడు కారణ మేమని చెప్పెను?"

"నే నెట్టి శ్రమ జీవికిఁగాని, వణిజునకుఁగాని బుట్టకుండుట ప్రథమ హేతుకమఁట. ఉచ్ఛ వ్యాపారము నడపుటకు వలయు శక్తిగాని, గుణముగాని నాయందు లేకుండుట ద్వితీయ కారణమఁట! తన యధీనమందలి యుద్యోగులలో నొకని నల్లునిగా జేకొన వర్జర్సు వాంఛించుచుండెను. ఆ యల్లుఁడు వ్యాపారమందుఁ బుట్టి, వ్యాపారమందుఁ బెఱిఁగి, సాటిలేని వణిజుఁడు కాఁజాలువాడై యుండవలెనఁట."

"ఆతని కొమరిత యీ నిబంధమునకు సమ్మతించెనా?"

"నిశ్చయముగ సమ్మతించెను. తన యంగీకారమును ఎలిన్ నిస్సంకోచముగఁ దండ్రిద్రమోల వ్యక్తీకరింపనియెడల, ముదుసలి నామముంగల నీ వనసను యేల జడుపును? చాలసేపు తన వికృతశృతిని వినిపించి వినయసౌజన్యములుట్టిపడు వృద్ధుఁడు ఈజిప్టుసీమయందలి కార్యభారమును నా యీదలపై నిడనమకట్టెను."

"వృద్ధుని యభిప్రాయ మొకవేళ మంచిదియేమై యుండవచ్చును. ఈజిప్టుభూమికిఁ జని వాణిజ్యమును నీవు నేర్చుకొని రావలెనని అతఁ డుద్దేశించియుండును. లేకున్న నాతఁడు నిన్నుఁ బరీక్షింప నుద్యో గించియుండును. కావున నీ వీనూతన కార్యభారమును దలఁబూనుట సమంజసము. నేనే యిట్లు కోరఁబడియున్న యెడల బ్రయోజనయుత మగు నీ బరువును నిక్కముగ నాపైఁ బూనుకొనువాఁడను!"

"ప్రియమిత్రమా! నా యవస్థయందే నీ వున్నచో, నీవుకూడ నా కైవడినే కార్య మాచరించువాడవు! వర్జర్సువదనమునుగాని అతని దుహితయాననముఁగాని యిఁక నెన్నడు గన్నెత్తి చూడనని యొట్టు పెట్టుకొనువాఁడవు! కంఠమున నుసులు లున్నంతకాలము యీ పాడు ఫ్రాన్సును దిరిగిచూడనని విరక్తిచే నెందేని చనువాఁడవు! నే నిత్తఱి అమెరికాదేశమునకో ఆస్ట్రేలియాసీమకో జపాను విష యమునకో యేదేని యన్యరాష్ట్రమునకు వెడలిపోదును. ఈ జీవన మున నీ భూమికిఁ దిరిగి రాను. ఏరమణి నన్ను మోసగించెనో నాకు సహింపరాని యవమానము నేవనిత కలుఁగఁజేసెనో ఆమె నోటినుండి వెలువడు నుడువులు నా — వీనులఁ బడుట నే నిఁక సహింపజాలను!"

"వర్జర్సు తనయ నొసంగ నన్నందులకు నీవు ధనమానయశముల నన్నిఁటిని బరిత్యజించి యెందో అడఁగియుండఁదలతువా? సోదరా! ఇది వట్టి యవివేకముకాని యొండుగాదు. ముదుసలి పిదప నొకవేళ తన యభిప్రాయమును మార్చుకొనవచ్చును. ఇట్టి యభ్యంతరము కలుఁగునని నీ వీవఱలోనే గ్రహింపవలసినది."

"ఎలీస్ తనప్రతిజ్ఞను భంగ మొనరించునని నేఁ గలనైనఁ దలఁపలేను. ఆమె దృఢస్వాంతయనియు నిశ్వాసనీయయనియు నమ్మియుంటిని. కాని పొరపడితిని యిపుడు గ్రహింపజాలితిని. దైవతమును నేను ధిక్కరింపను. కాని యామెనిని చూపిన పరిభవమును నే నిఁక సహింపఁజాలను."

విషాదచేతస్కుఁడై విగనరీ అంతయు వినుచు నిట్లనెను. "ప్రియ మిత్రమా! ఇప్పుడు నీ చిత్తమంతయు విచలితమై యున్నది. నీ కిపు డేమియుఁ జెప్పు టుచితముగాదు. నా కిక నిందు నిలచుటకు సమయము లేదు. ఇనుపపెట్టె యందుఁ జాల రూకలు జమయై యున్నవి. ఇపు డా సొమ్మును సరిజూడవలయును. ఈ విషయమును మరల రేపు యోచింతము."

"రేపు నే నిందుండను."

"ఇంతలోనే నీవు పోజాలు టెట్లు — వలయు నేర్పాటు లేనిదే హఠాత్తుగఁ బయనమగు టెట్లు సాధ్యము!"

"నేను తగు నేర్పాటును గావించుకొనియే యుంటిని."

"కాని పైకమేది? ఈ దీర్ఘ ప్రయాణమునకుఁ జాల విత్తమవసరముండును. అంతసొమ్ము నీయొద్ద నున్నదా?"

"ప్రోగుఁజేసుకొను టెంతసేపు?"

"విశేష విత్తము నీ వీవరలోఁ బ్రోగుజేసుకొని యుండలేదు. నా పైకమేదో నీకిచ్చివేయుటకు సంసిద్ధుఁడనై యున్నాను. కాని అది కూడ యిపుడు నాయొద్ద లేదు."

"నీ ప్రేమకు మిగుల సంతసించితిని. నీ పైకమును గైకొనుటకు నిస్సంకోచముగా నియ్యకొనియుందును. కాని నాకు దాని యవసరమేమియు లేదు. స్వీయసీమనుండి చనుతఱి, కడపటితూరి నిన్నుఁ జూచి పోవలెనని వాంఛించుచుంటిని. నేఁటి సంధ్యానంతరమున నిన్నుఁ గలిసికొందును. నీ వెచట నుందువో తెలుపుము."

"మేక్సిమును నేఁ డాహ్వానించియుంటిని. ఆతఁ డాఱుగంటలవేళ వచ్చును. అతనిప్రోల మన మే విషయమును గుఱించియైనఁ బ్రసంగించుకొనరాదు."

"అవునది యక్కఱలేదు. భోజనానంతరమున నీవు కచేరికిఁ దిరిగివత్తువా!"

మిత్రుని ప్రశ్నకు విస్మితుఁడై విగనరీ యిట్లనెను. “రామ. దిన మంతయుఁ బనిచేసియున్న పిదప నీకుఁ గచేరికి రావలయునక్కఱ యుండదు. పరిశ్రమానంతరమున నల్లమునకు విశ్రాంతి ప్రమోదము లొసఁగ నే దేని నాటకముఁ జూడఁ బోఁదలచుచుంటిని. నీదరికి రేపటి యుదయము వత్తును.”

“ఒకవేళ నీవు వన్నపుడు కలిసికొనఁజాలకపోదువు. వర్జర్సు యాలయమున నేనీక నొక నిముసమైన నిలువ నిచ్ఛగింపను.”

“నేను రేపకడనే లేచివత్తును. అంత పెందలకడ నీవెచటి కరుగుదువు?”

“చూడుము గాని లెమ్ము. నాకుఁ గల వ్యవధి మిగుల స్వల్పము. ఒకవేళ మన మిర్వుర మింక కలిసికొనఁ జాలకపోయినను అశ్రాంతము నిన్ను నాహృదయ పీఠమున నిడుకొని యుందుననియు మన చెలిమి యవిచ్ఛిన్నమై అనవరత ముండుననియు నమ్ముము. నీవు కూడ నీ చెలిమికాని విస్మృతింపకుము.”

“నీ వెచటి కరుగుదువు? ఏదేని ఘాతుక—”

“నీ విట్లు వెఱువ నక్కఱలేదు. నే నాత్మహత్యఁ గావింపను. ఆత్మ హత్య కాపురుష కార్యము. అట్టి చెడుచెయిద మొనరించుటకు నేను కాపురుషుఁడను గాని మొఱకువాఁడను గాని కాను. నే నెందరుగుదునో యేమిచేతునో పదపడి నీకుఁ దెలియపఱతును. నేనిపు డింకఁ బోదును. ఈనిలయము వీడి అవ్వలఁబడుటకై తొందర పడుచుంటిని!

“ఎలిసును గలిసికొనకయే నీవు చనుచుంటివి — నీవింత తొందర పడఁజెల్లదు. నీ వొకవేళ మోసగింపఁబడితివేమో యని యోచించు చుంటిని. నీయెడ నాపె యనురాగ మనిచలితమై యవ్యాజమై యున్న దనియే నేను నమ్ముచుంటిని.”

“అట్టైన నాపె తన మనసునందలి భావమును భీతు లేక తెల్పి

పియేయుండును. అట్లు తెలుపుట కీవరలో నవకాశము చిక్కకున్న నీకనైన నాపె తెలుపవచ్చును. కాని అట్టి యాశ నిరాశ యని నాదృఢవిశ్వాసము. ఆయువతి యెన్నఁడుగాని జనకుని యభిమతము నకు వ్యతిరేకముగ నాచరింపదు. తన మనసునకు నచ్చిన వానినే వృద్ధుఁడు అల్లునిగఁ జేకొనును. భావిజామాతకు వాణిజ్యమునఁ గౌశలమున్నఁ జాలునఁట. సాధారణ వంశజుఁడైన జాలునఁట— అర్థరహితుఁడైనను అభ్యంతరము లేదఁట."

"తన నోటితోఁ దానిట్లు తెలిపియుండెనా?"

"తెలిపెను. ఏమనెనో ఆతఁడు చేసితీరును. ఇఁక సోదరా! నాకు సెలవిమ్ము."

విగనరీ మిత్రుని కిఁక నంకిలిఁ బెట్టలేదు. రాబర్టు వెడలిపోయెను. ఖాతంజీ కిఁక పని సలుపవలెనను నిచ్ఛ లేకపోయెను. రాబర్టుయొద్ద నేఁడతఁ డనేక నూతన విషయములను వినియుండెను. ఆఱుగంట లప్పుడు వత్తుపని మేక్సిము కబురు దెలిపియుండెను. నాఁటి ఘటనముఁ దలఁచుకొనుచు జూలస్ యినుపపెట్టెయందు రూకలనుబేర్చి యుంచెను. "మఱునాఁడు కచేరి వేళ కాగానే కర్నలు బెరిమఫ్నకు ఆతని నగల పెట్టియును కొంత పైకమును యీయవలె" నని వర్జర్పు వచ్చి విగనరీ కెఱిగించి పోయెను. ఇతర యుద్యోగు లొక్కరొక్కరు గచేరి నుండి వెడలిపోయిరి.

కడు జాగ్రత్తతో నినుపపెట్టెకుఁ దాళమువైచి కోటును ధరించుకొని విగనరీ వెలుపలికిఁ జూచు తఱి మేక్సిము కచేరీ గదిలోఁ బ్రవేశించెను. అపుడు కూడ ఆఫీసునందున్న గుట్టి వానిఁజూచి "నీ వింకను యుండే పడి మ్రగ్గుచుంటివా? పో! అవ్వలికి పో! ఇచట నేమి చేయు చున్నావు?" అని మేక్సి మనియెను.

బాలకుఁడైన జర్జెటు ద్రుతవేగమున నవ్వలికిఁ బోయెను. ఆఱు

గంటలు గడచిన పిదపఁ గూడ బాలకుఁడు కచేరిలో నక్కియుండుటఁ జూచి విగనరీ విస్మితుఁడాయెను.

"నీతో మాట్లాడవలసియున్న" దని మేక్సిము విగనరీ నుద్దేశించి పల్కెను.

"క్రొత్తసంగతి యేమైనఁ దెలియవచ్చెనా యేమి?

"వీధిలోనికి నడువుము — అంతయుఁ దెలుపుదును. ఇచట నేమి చెప్పుటకు నాకు సాహసము చిక్కుటలేదు. ఎవరో మఱుఁగునుండి మననుడువులను వినుచున్నట్లు అనుమానించు చుంటిని."

ఉభయులు రాజపథమునఁ బ్రవేశించిరి.

మేక్సిము: నీకడనుండి చని నేను సీన్‌నది వైపుగఁ జనితిని. వంతెనఁ జేరువరకు నన్నెవరును అనుసరింపలేదు. కాని తిరిగివచ్చుతఱి నాకుఁ దెలియకుండ నెవరో నావెంట నంటి వచ్చుచున్నట్లు గ్రహించితిని. మఱుగునుండి అనుసరించి వచ్చు నావ్యక్తిని మోసఁ బుచ్చుటకై తోడనే ఒకబండి నెక్కి సాగివచ్చితిని."

నీ వెంట నంటి వచ్చినవా రెవరు?"

"ఎవరో ఒకపురుషుఁడు. అతనిముఖమును నేను చూడఁజాలకపోతిని. కాని ఆమానిసి రాకడనంతయు లక్ష్యింపఁగలిఁగితిని. వంతెన ప్రక్కగల యినుపకమ్ములపై వంగి నీటియం దాతఁడేదో పరీక్షింప గడఁగెను. ఆతని కన్నులఁ బడకుండనే ప్రక్కనుండి నేను బిఱబిఱ నడచివచ్చితిని. నదీగర్భమున ఛిన్నహస్తమును బాఱవైచియే నే నట్లు వెడలివచ్చితిని. చాల నే పాతఁడు కమ్ముల నంటియే నిలువంబడియుండెను. పదంపడి ఆపూరుషుండు బిఱాన మరల నావెన్నంటి రా దొడఁగెను."

"ఆతని యుద్దేశమేమై యుండును?"

"నదియందు నేను మొండిచేయిని బడవేయుట నాతఁడు చూచి

యుండెను. నే నెవరినో యెఱుఁగుటకే ఆతఁడు నా వెంటఁబడెను. ఈవిషయము మాటుఁడ నేఁటి పత్రికయం దొక వార్త వెలువడెను. ఈ వెలుతురులో నిలువంబడుము. వార్తను జదువుదు వినుము. “ నేఁడు సీన్ నదిలోఁ జేపలు పట్టు సమయమున నొక జాలరి కొక ఛిన్నహస్తము లభించెను. కేలు యెవర్తుకేని రమణిదని స్పష్టమగుచున్నది. ఆరమణిని వెతుక పోలీసులు నియమానుసారముగఁ దమ యత్నముల నారంభించిరి. ఆపెను గుఱించిన వార్త నెవ్వరైనఁ దెలుపఁగలరని యోజించి ప్రజలు పల్వురు లక్ష్యించు లాగున రక్షక భటులా ఛిన్నాంగమును ద్రావకమందు ముంచి, ఒక బహిరంగ ప్రదేశమున నుంచిరి. ”

“ పోలీసువా రీవిషయమున నిసుమంతైన నెఱుఁగఁజాలకుండుటకై మన మెంతేని జాగ్రతపడితిమి. కాని తుదకు మన మడలినట్లే యైపోయెను! ”

“ నే నప్పుడే నీకుఁ జెప్పి యుంటిని. నామాట నీవు పెడచెవిఁ బెట్టి వైచితివి! ”

“ ఇప్పుడు మునిఁగిపోయినదేమి? భయ మెందులకు? ఈయద్భుత విషయమును గుఱించి కొన్ని దినములు లోకులు విడ్డూరముగఁ జెప్పుకొందురు. పిదప నంతయు సర్దుకొనును. ఏమియు వెఱపులేదు. ”

“ ఒకవేళ నెవ్వరైన ఛిన్నహస్తమును జూచి పోల్పఁ గలిగిన నేమగును? ”

“ నీకుఁ బిచ్చిపట్టినదా యేమి? చేతిపై హక్కు జూపుచు బట్టుపడుటకై చోరకాంత ముందునకు వచ్చునా? ఈవిషయ మిటుండ నీ మేనమామగారి మనసునకే సందేహము తట్టి యుండ లేదుగద? ”

“ లేదు. తనయాహ్వానమును మన్నించి నిన్న రాతిరి నేనేలవిందు

నక్కై రాలేదని ఆతఁడు ప్రశ్నించెను. నీవు బోధించినట్లు నేనాతనికి జవాబొసఁగితిని. నాసమాధానమును మొదునలి నమ్మినట్లైచెను. ఇవు డాతఁడు నిజవిషయమును గుఱించిన తొందరయందుండుటచే నన్ను దిక్కుడనకు చిత్తమును ద్రిప్పుట కాతనికి నించుకైన వ్యవధిలేకుండెను.

"ఆతొందర విషయమేమి?" అని మేక్సిము విస్మయాన్వితుఁడై ప్రశ్నించెను.

"రాబర్టు తన తనయను ప్రేమించెననియు నెలిస్‌కూడ నాతని యెడ ననురక్తయై యుండెననియు వృద్ధుడెఱుఁగజాలి కినుంగడు కుపితుఁడాయెను. తండ్రి కూఁతుల కేమిప్రసంగము జరిగియుండెనో నేఁజెప్పఁజాలను. కాని రాబర్టుమాత్రము తన యొూదోన్నేకమునకు నుద్వాసనమిచ్చెను."

"ఏమి! నే నీయుదంతమును విశ్వసింపలేకున్నాను."

"రాబర్టు తనంతకుఁ బానీవృత్తాంతమును సాంతముగఁ జెప్పియుండెను. తన కొమరిత నాతనికొసఁగి పెండిలిసలుపుట కియ్యకొనని వృద్ధుఁడు స్పష్టముగ వానికిఁ దెలిపివైచిరట. కాని రాబర్టు నింకొక విధముగా సంతసపెట్ట నీజిప్తుదేశమందు దన ప్రతినిధిస్థానము నలంకరింప నీమేనమామ ఆతనివేఁడెను. ?

"రాబర్టు అందుల కంగీకరించెనా?

"అంగీకరించుటా? నీవు రాబర్టు నెఱుఁగవా? ఆత్మగౌరవము నాతఁడు మిగుల మిన్నగ నెంచుచుండును. అట్టి యభిమానిని నేనెంనును జూచియుండలేదు. ఆఁకలివేడిమిచే మాడి మాడి ఆతఁడు మఃడియు గడఁగునుగాని యెవ్వానిముందును దీనాననుఁడై నిలువంబడఁడు. యెవరికి గాని ఆ యువకుఁడు తన స్వాతంత్ర్యము నమ్ముకొనఁడు. ఇవు డాతఁడు తన సర్వస్వమును బరిత్యజించివైచి వెడలిపోవుచుండెను"

"ఎచటికి?"

"ఎందుఁజనవలెనో ఆతఁ డింకను స్థిరమొనరింపలేదు. కాని, రాబర్టింక నీదేశమున నిల్వఁడనుట నిక్కము. తనయొద్ద విత్తమున్నదని ఆతఁడనుచుండెను. కాన అట్లని నేనెంతగ నమ్మఁజాలకపోవుచున్నాను."

"రాబర్టు సాహసము ప్రశంసనీయము. స్వాతంత్ర్యప్రియులను నేను హృదయపూర్వకముగఁ బ్రేమింతును. వృద్ధుని ప్రస్తావము నుపేక్షించి ఆతఁడు మంచిపనియే గావించెను. వానికి శక్తిసామర్థ్య ప్రతిభలున్నవి; కాలక్రమమున నాతఁ డున్నతి నందఁగలఁడు. పెండిలికోసరమై ఆతఁ డంతగా చింతింపనక్కఱలేదు ఐశ్వర్యసంపన్నయైన సుందరి యొకర్తుక తనకర్థాంగి కాఁగలుఁగుచోఁ 'ధన్యుఁడనైతి' నని ఆతఁ డూహించును. రాబర్టు స్వీయవిర్వాసనమును జిరనిష్క్రమణమును నీ కనుకూలమై యుండవచ్చును."

"నెయ్యునివంచించి, ఆతఁడు వలచిన వనితను నాప్రేమవాగురమునఁ బడవైచుకొనవలెనను నాసనాకులేదు. అట్టి యాసయున్నను, అది శిథిలమగును గాని పూర్ణము కాఁజాలదు!"

"హాతాశుండవు కాకుము. ఒకించుక తడిసితివేని సఫలకాముఁడ వగుటకు నీకు మంచితరుణము నీజతన మేమియు లేనిదే లభించును. రాబర్టు వెడలిపోయినను నీవు వెడలిపోలేదుగదా! ఎలిస్ పాలికేఁ దఱచుగావచ్చుచుఁ బోవుచునుంటివేని గతమును విస్మృతించి నీ నిర్మల చరిత్రమునెఱిఁగి నీయెడల నాసుందరి నిక్కముగ ననురక్తకాఁగలదు ఆపెయింకను విశేషానుభవముఁగల బాలిక గాదు. తరుణయౌవన ప్రథమ ప్రణయమున మిక్కిలి మైక ముండుట నిక్కమే. కాని అయౌవనవతి తరళస్వభావ; కాలక్రమమున నాపె నీకెనలేని యనురాగము జూపుచుంట నీవేచూతువు."

మేక్సిమునుడువులను వినగనే విగనరీ హృదయమున నొక గభీరరేఖ యంకితమాయెను! అన్యమనస్కుఁడై, ఆతఁడేమో యోజింపదొడఁ

గెను. మేక్సిము వెల్కుల నాతఁడు వేగము హృదయంగమముఁ గావించు కొనఁజాలక పోయెను పదంపడి నెయ్యురిఁగూడి జూలున్ నాటక మందిర మున కరిగినను గుశీలవుల మాటలేమియు నాతని చెవిఁ జొరలేదు. రాత్రి రెండుజాములైనపిదప ఆతఁడింటికి మరలివచ్చెను. తోడనే విగనరీ భృత్యుఁ డొకఁడు ఒకజాబు నాతని కరములందిడెను. పత్రముపై గల విలాసమును విలోకించినంతనే అది రాబర్టు చేవ్రాత యని యాతఁడు గ్రహించెను.

"ఇఁక మనమిర్వురము కలిసికొనఁజాలము. నేఁటినిశియందే నేనిం దుండి చనుచుంటిని. తెల్లవారకమున్నె బహుదూరము సాగిపోఁజా లుదును. నేనెందరిగినను నీకుఁ గబురుఁదెలుపుచునే యుందును. నా మానసికావస్థను గ్రహించి నన్ను క్షమింపుము." అని యాకమ్మయందు లిఖింపఁబడి యుండెను

జూలున్ విగనరీ పత్రమును పలుపర్యాయములు పఠించెను. ఒక యవర్ణనీయభావావేగమాతనిహృదయకుహరము నావరించుకొనియెను!

3

వర్జర్సు బేంకు ప్రతిదినము పదిగంటలప్పుడు దెఱువఁబడును. ఒకనిమున మైన నటునిటు యగుటకు వలనుగాదు. జూలున్ విగనరీ అనుదినము నిరూపిత సమయమునకుఁ జాల సేపటికి మున్నె వచ్చి గచేరి యందు హాజరగును. నాఁడు మఱింతముందుగా నాతఁడు ఆఫీసునకు వచ్చి చేరుకొనెను. రాత్రియంతయు నాతనికి సరిగ నిదురపట్టలేదు. నానా కారణములచేఁ జిత్తమంతయు విచలితమగుటచే, ఇంటియొద్దఁ దోఁచక వేళకాకుండనే ఆతఁ డాఫీసులోనికివచ్చి కూర్చుండెను. సరిగ పదిగంట లకు కర్నలు బెరిమఫ్ బేంకుయొద్దకు వచ్చెను. వెలుపలి గుమ్మముయొద్ద జవానును నొక్కనిమాత్రముజూచి, ఒకించుక యుచ్చెరువుపడి "ఏమి

బాలకా! ఇంకను నెవరును రాలేదా? గుమాస్తాలెన్నిగంటలకు వత్తు” రని అతఁడు వాని బ్రశ్నించెను.

“ఇవుడే అందఱు వచ్చిపడుదురు. ఒకఁడవుడేవచ్చి ఆఫీసుగదిలోఁ గూర్చుని యుండెననుకొనెదను. తలుపుఁ దట్టుడు.”

కర్నలుబెరిమఫ్ కవాటముకడనిలిచి దానిని దట్టెను, ఎవరును ఉత్తరమొసఁగలేదు. అందుచే నాపెద్దమనిషి సత్తువుకొలఁది తలుపును గ్రుద్ద సాగెను. తలుపుప్రక్క నొకఁడువచ్చి నిలువంబడెను. ఆతని ముఖ మండలమంతయు వివర్ణమైయుండెను.

“నేను కర్నలుబెరిమపును నేఁడు పదిగంటలకు వత్తునని మీకు వర్జస్సుగారు—”

“అవును. అట్లనివారు తెలిపియుండిరి — మీకు రూకలీయవలసి యుండునని యెఱిఁగించిరి — కాని తామింక కొంతసేపు వేచియుండ వలెను.” విగసరీ కంఠస్వరము కంపితమాయెను.

జూలుస్ వాలకమును విలోకించి కర్నలచ్చెరువొంది “అయ్యా! ఆలాయుంటిరేల? — రూకలొపఁగ వర్జస్సుగా రాజ్ఞ యొసఁగినవు డీఁక వారికై తడయు టెందులకు?’ అని యాతనిఁ బ్రశ్నించెను.

“ఇనుపపెట్టె తలుపు తెఱువఁబడియుండెను. నిన్న సాయంకాలము నాచేతులతో నేను దాని తాళమువైచితిని. రాత్రియెవరును రాలేదు. రూకలనింకను నేను లెక్కించి చూడనైన లేదు. పైకము దొంగిలింపఁ బడినదేమోయని యడలుచుంటివి!”

“రూకలను లెక్కించి చూడుడు. నేను చాలసేపు వేచియుండఁ జాలను.”

“వర్జస్సుగారికిఁ గబురుఁ దెలుపవలయును. జరిగిన దుర్ఘటనము సామాన్యమైనది గాదు! అందుచే నీవు డెవనినిగాని అతఁడు సమ్ముఖ మందు లేనిదే నేను కావింపజాలను.”

అట్లైన వర్జర్సుగారికి వేగమే కబురుఁ దెలుపుడు. నాకు నిలుచుటకు విశేష వ్యవధి లేదు. త్వరలో మీరు నన్నుఁ బంపి వేయవలెను."

"జగ్గెట్!" అని విగనరీ పిలిచెను.

బాలకుఁడు సమీపమందే యుండెను. "హుజూర్ హాజరగుచుంటి" నని అతఁడు సర్వాన వచ్చెను.

"వెలుపలి ద్వారము మూసివేయుము. నిలిచియున్న ప్రకారము కచేరికి రావలయునని యాజమానితోఁ జెప్పిరమ్ము. నిముసమైన నాలసింపరాదనుము. అడుగులో రావలెననుము."

"చిత్తము."

"పిదప నీవు వెలుపలకిఁబోయి నిలువంబడి, నేఁడు పదునొకండు గంటలకు ముందుగ చేరి తెలుపఁబడదని వచ్చు నుద్యోగులకుఁ దెలుపుము."

"ఏలనని వారడిగిన నేమనవలయును?"

"నీయిష్టము-ఏమిచెప్పినను చెప్పుము."

బాలకుఁడు కవాటమును బంధించి, యజమానికిఁ గబురుఁదెలుపఁ బరువెత్తెను.

"అయ్యా? ఇంత యడలెందుకు?" అని కర్నలు విగనరీని ప్రశ్నించెను.

"ఒకవేళ చౌర్యమే జరిగియున్నను అట్లని పేరిసునగరమునఁ జాటింపఁజెల్లదు!"

ఎల్లఱకీవిషయము తెలిసినయెడల, వర్జర్సుగారికి దుష్కీర్తిఘటిల్లునని తాము యోజించుచుంటి రనుకొనియెదను-మూఁడు నాలుఁగువేల రూకలు హరింపబడినయెడల ఆనష్టమాతని కొక లెక్కలోనిదై యుండదు."

"మీరననది నిక్కమే. కాని సిందూకమున నిన్న సుమారుమున్నది

లక్షల రూకలు జమయైయున్నవి. అందుచే అడలుచుంటిని.”

“ముప్పదిలక్షలా? అవును మఱచితిని. అట్లని నిన్న వర్జర్సుగారు తెలిపియుండిరి. ఆహా! పైకమంతయు హరింపఁబడినయెడల మిగుల భయమొందవలసినదే? సొమ్మంతయు బోయినదందురా?”

“అదింకను సరిగఁ జెప్పజాలను. విత్తమంతయుఁ బోలేదని తలంతును. యజమాని రాఁగనే రూకలు లెక్కించి జూచుకొనెదను.”

వర్జర్సు ఆముహూర్తమందే గదియందుఁ బ్రవేశించెను.

“కర్నలుగారూ! ప్రణామము. మాఖాతంజీ వెంటనే రమ్మని నాకుఁ గబురంపెను—ఏమిజరిగెను?”

“మిగుల జెడువార్త!” యని విగనరీ యనెను.

“ఇనుపపెట్టె విషయము కాదుకదా! — నమూవుము. చూాతము. కర్నలుగారూ! తాముకూడ దయచేయుఁడు.”

ముప్వురును ఆగారమందుఁ బ్రవేశించిరి.

“నేను కచేరిలోనికివచ్చి చూచుసరికి ఇనుపపెట్టె సరిగ నిట్లున్నది. ఏవస్తువుమీఁదను నేనింకను జేయివేయలేదు.” అని విగనరీ యనెను.

“ఏమివిపరీతము! ఒక తాళముచెవి నీయొద్దనున్నది. మఱొకటి నాకడనున్నది. మనమిర్వురము తక్క అన్యులిపొంత బీగములేదు. ఇనుపపెట్టెయెట్లు తెఱువఁబడెను?”

“నా తాళముచెవి నాయొద్దనే యున్నది—ఇదిగో చూడుము.”

“చూడుమిదిగో! నాబీగముకూడ నాకడనే యున్నది.”

“కాని, సిందుక కవాటమునఁగూట మఱొక తాళము చెవి కాని పించుచున్న” దని కర్నలు పలికెను.

వర్జర్సు — అవును. అదిగో!—ఏమి యాశ్చర్యఘటనము!!— కాని మొహరుల ప్రోవు సరిగనే యున్నది. అట్లైన చోరుఁడు హరిం చినదేమి? విగనరీ! నోట్లకట్ట యెచటనున్నది?”

"ఇదిగో! ఇచటనే యున్నది" అని విగనరీ నోట్లకట్టను జూపెను.

"మొత్తము ఇనుపపెట్టెయందు నిన్న నెంతవిత్తమున్నది?"

"ముప్పదిలక్షల అరువదియాఱువేల యెనుబదితొమ్మిదిరూకలు!"

"లెక్కించి చూడుము."

లెక్కించిన పిదప "నోట్లు అన్నియు సరిగనే యున్నవి" అని విగనరీ యనెను.

"దైవము కాచెను ఈమొత్తమంతయు దొంగిలింపఁ బడినయెడల నా కెంతేని యనర్థము వాటిల్లియుండును. ఇపుడు రూకలసంఖ్యను లెక్కించిచూడుము."

విగనరీ లెక్కఁబెట్టి, "రూకలన్నియు నున్నవి. కాని—" అని ఊరకొనెను.

"కాని యేమి?—"

"ఏఁబదివేల రూకలనోట్లును నేటియుదయముఁ జెల్లింపవలెనని, ఆ మొత్తపు నోట్లను కట్టఁగట్టి పెట్టెలో నొకమూలఁ బెట్టితివి. ఆకట్ట కానుపించుట లేదు.

బెరిమఫ్ — విడ్డూరపు చోరుఁడువలె నున్నాఁడు — ఇంత విత్తముండ నాతఁడు సామాన్యమొత్తముతో సంతుష్టుఁడై పోయెను!

వర్జర్స్ — నిక్కముగ నిది మిగుల నబ్బురముగ నున్నది!— పోనిండు. ఈనష్టమంతగా బరిగణింపఁ దగినదికాదు. కర్నలుగారూ! ఇపుడు తాము తమపైకమును గొనిపోవచ్చును. మీ సమయస్ఫూర్తి అల్పము. మీ కెంతవిత్త మవసరమో మాఖాతంజీకిఁ దెల్పుచు — ఆతఁడొసఁగును. మఱియు నెడల నగలపెట్టియనుగూడ—"

"నగలపెట్టియా — అని విస్మయాన్వితుఁడై విగనరీ యనెను.

"అవును. సిందూకమునుండి గాని నీవలికిఁదీయుము."

"ఏది?—పెట్టెకనుపించుటలేదే!" అని విగనరీ కంపితస్వరమున బల్కెను.

"కనపింపక పోవు టేమి! కాసుల రాసులవీడి సామాన్యపునగల పెట్టె నెవరెత్తుకొని పోదురు? బాగుగా వెదకి చూడుము"

"ఎవ రెత్తుకొని పోదురో చెప్పజాలము. కాని, మహాశయా! నగల పెట్టెమాత్రము కానుపించుట లేదు."

కర్నలు — ఇప్పటికి సంగతియేమో బోధపడియెను.

వర్జర్సు — ఏమనుచుంటిరి? — విప్పి తెలుపుడు!

కర్నలు ముఖమండలము వివర్ణమై పోయెను. ఆతని హృదయ మావేగపూర్ణమైపోయెను. అతికష్టమున నాతఁడాత్మసంవరణ మొనరించుకొని "మీరేల జాగ్రత్తపడితిరిగారు?—కాని యిపుడాచింత వ్యర్థ. ఇప్పుడు నా వేడికోలు—" అని యేమో యనుచుండఁ "పెట్టెయం దెంత మొత్తపు నగలసంఖ్య కలదో తెలిపినయెడల, దాని నొసఁగివైతును. తా మెంత మూల్యముఁ గోరుదురో యిచ్చివైతు" నని వర్జర్సు పలికెను.

"మీ యుదారోక్తులకు నంతసించితిని కాని, నేఁ గోలుపోయిన ద్రవ్యముయొక్క మూల్యముఁ దా మొసఁగలేరు. మిగుల విలువగల పత్రములందుఁ గలవు."

"నే నిపుడే పోలీసుల కీవార్తఁ దెలుపుచుంటిని. చోరుఁడు నిశ్చయముగఁ బట్టువడును. ఆ దుర్మతి తనకడఁగల్గ పత్రముల నెవరి కేని అమ్మివేయ యత్నించును. పోలీసులపుడు వాని నవలీలగఁ బట్టుకొనఁ జాలుదురు."

"మహాశయా! మీ యుదారత ప్రశంసనీయ మైనది — కాని మీ రెంత యత్నించినను, నాకాకితములు లభించుటకల్ల. నాకు వలయు నంత విత్త మున్నది. ఈ నష్టమును ప్రముదితచిత్తుఁడనై సహింపఁ జాలుదును. మీకడనుండి నేఁగోరున దేమియు లేదు. అట్లు కోరుటకు నాయుల్ల మియ్యకొనదు. మన యీచిక్కునందు బోలీసుల నాహ్వానింపకుండుడని మాత్రము మిమ్ము వేఁడుచున్నాను."

"అట్లనుచుంటిరేల ? చోరుఁడొకఁడు తమ యమూల్య పత్రములఁ గొని పలాయన మొనరింపఁ వానిఁబట్టి బంధింపఁ బూనుకొనక గాళ్లుబా సాచుకొని కూరుచుండుదునా ?"

"చోరుని బట్టవలెననుట నిక్కమే ! కాని పేరునగరమందు — ఒక్క పేరునగరమే యననేల, ఐరోపాఖండ మంతటను యీ విషయమును మాఱు మ్రోయించుటేల ? పోలీసువారికిఁ గబురుఁ దెలిపిన యెడల నేను వాఙ్మూలమొసఁగవలసియుండును. పదపడి జరుగువిచారణమున నీ యుదంతమంతయు మాదొరతనము వారికి విదితమగును. అట్లగుట నాసమ్మతముగాదు. దొంగనుబట్ట నేనొక్కండనే యత్నింతును. నా జతనమున దాము సాయపడిన యెడల గార్యమవలీలగ సానుకూలము కాఁజాలును ! ఇరువురముఁ గలిసి హర్తనుబట్ట నహర్నిశములు శక్తివంచన లేక ప్రయత్నింతము."

"మంచి దట్లే కానిమ్ము కాని, యిపుడు మన మొనరింపవలయు బూన్కి యేమి ?"

"మొట్టమొదట నీచోరుని యుద్దేశమేమో మనమెఱుఁగు టవసరము. మన మెఱిఁగియున్న వారిలో నీఘటమున నెవరికిఁ గొంతజోక్యముండెనో—ఎవరి స్వార్థమిందు నిమిడితమై యుండెనో మనము కన్గొనవలయును. చోరుఁడు సామాన్యుఁడైనయెడల, అర్థహారణమే వాని ప్రధానోద్యోగమైనయెడల, నాపెట్టెను గైకొనక అమ్ముచ్చు మా ధనరాశినే అపహరించుకొనిపోయి యుండును !"

"దొంగ నావిత్తమునుండిగూడ నేఁబదివేల రూకల నపహరించి యుండెనుగదా !"

ఆపైకమొక లెక్కలోనిదిగాదు. ఏదేని యన్యరాష్ట్రమునకుఁ బాఱి చనుటకు వలయు వెచ్చము చోరునికడ నుండకపోవచ్చును — అందుచేఁ బ్రయాణవ్యయమునకు వలయు మొత్తమునే అతఁడు దొంగి

లించి యుండెను! అన్యసీమఁ జేరియే ఆతఁ డాపత్రములతోఁ దాను జరుపఁదలఁచిన కార్యమును కావించును!"

"అవును. ఇందలి గూఢమును నేనిపుడు గ్రహింపఁజాలితిని."

కర్నలు — నాకుఁ బల్వురు శత్రువులు కలరు. ప్రోరతనమువారి కార్యము నాదలఁబూని, దానిని నిర్వహించుట కుత్తరవాదినై యుండు నాతనికి శత్రువులు పెక్కులుందురు! మాసీమనేలువారి కొండొకగూఢ దౌత్యభారమునుగొని నేనిచటికి వచ్చితిని. నాకు నెంతేని యరిష్టము నాపాదింపఁదలంచియే చోరుఁ డీపనిఁ గావించియుండెనని యోజించుచుంటిని! — పోనిం డావిషయ మటుంచుఁడు. నా పత్రములు మీయొద్ద దాచఁబడియున్నట్లు మీరుకాక యిఁ కెవ్వరైన నెఱుఁగుదురా?"

వర్జర్సు — మాఖాతంజీ మీ సమ్ముఖమున నున్న సీతఁడును, — మా కార్యదర్శి, నిన్న మీరు చూచిన యువకుఁడును — వీరిద్వరును నెఱుఁగుదురు. ఇఁకెవరును నెఱుఁగరు

"మీకార్యదర్శియా! — సరిగ జ్ఞప్తికి వచ్చినది! నిన్న మనము సిందుకమును గుఱించి ప్రసంగించుచుండ గదిలోఁ జొచ్చిన యువకుఁడు కాఁడా? ఆతని ముఖ మప్పుడు కడు మలినమై యున్నదికాదా?

"అవును. ఇత్తఱి ఆతని నాకార్యాలయమున నుండనీయనని నే స్పష్టముగఁ దెలిపియుంటిని."

"అట్లైన నాతఁ డిపు డిచటఁ బనిచేయుటలేదా?"

"ఈతావున నా బేంకుతో నాతఁ డింకను తన సంబంధమును వదలుకొనలేదు. కాని మూఁడునాల్గు దినములలో నాతఁ డిందుండి చనును."

"ఆతని పేరేమి?"

"రాబర్టు!"

"రాబర్టా! కతిపయసంవత్సరములకుమున్ను సెంట్ పీటర్సుబర్గునందు

పేరిస్ దూతల విభాగమందే దీ నామధేయము రాజోద్యోగి యొక డుండెను కదా?"

"ఆతఁడీ యువకుని జనకుఁడు. తన సర్వస్వమును గోల్పోయి, ఆతఁడు పరమపదించెను. రష్యాయందా వ్యక్తికిఁ బల్వురు నెయ్యులు కలరని తలంచెద."

"యువకునితో నాకుఁ బరిచయముఁ గావింతురా?"

"తప్పక గావింతును. నేఁ డొక్కమాత్రైన నాతఁడు నాకుఁ గాన పింపలేదు. ప్రాయశః ఆతఁ డింటిలోనే యుండును. విగనరీ! నీవొక మాఱుపోయి రాబర్టును పిలుచుకొనిరమ్ము."

"ఆతఁ డిపు డింటిలో నుండ డనుకొనెదను. 'పేరిస్ నగరమును విడిచిపోవుచుంటి' నని నిన్న నాతఁడు జాబుమూలమున నాకుదెలిపెను."

"అది కల్ల. ఇంతత్వరలో నాతఁ డెందులకు వెడలిపోవును? చూడుము నీ నెయ్యుఁ డింకను తన గదిలో నుండును."

విగనరీ — (కొంచము సేపు తడసి) "పదిన్నరగంట లై పోయినది. ఇంతసేపు కచేరి మూసి యుంచినయెడల లోకుల మనముల నొకవేళ—"

"అవును సందియము కలుఁగవచ్చును. కాని పదునొకండు గంటలవఱకు బేంకు మూయఁబడి యుండునెడల విశేషము చెపున దేమియు నుండదు. నీ విపుడు పోయి రాబర్టును జూచిరమ్ము."

విగనరీ నిష్క్రమించెను.

కర్నలు — ఈయువకుఁడు విశ్వాసపాత్రుఁడేనా?

"నా సర్వస్వము నీతని చేతుల విడి నిశ్చింతుఁడనై యుండజాలు దును. ఇతఁడు నిక్కముగ విశ్వసనీయుఁడు. ముందొకప్పు డీతని నా వ్యాపారమందు భాగస్థునిగా జైకొందును."

"పదుగురం దాతఁ డెట్లు మెలఁగును?"

"తఱచుగ నాతఁడు ఎవరితోను గూడి సంచరింపఁడు! తన పని

యేదో తాఁ జూచుకొనుచు ఆతఁడు కాలముఁ బుచ్చును. యువకుని నైతిక చరిత్రము మిగుల సుందరము, పవిత్రమునైనది."

విగనరీ మరలివచ్చి, "రాబర్టు కానుపించలే" దని పల్కెను.

"ఆతఁ డొకవేళ నేపనిమీఁదనైన నవ్వలి కరిగియుండును. వేగిరమే తిరిగి రాఁగలఁడు."

"తా మట్లు తలపకుడు. ఆతఁ డిఁకఁ దిరిగిరాడు. రాబర్టు పేరిను నగరమును విడిచిపోయెను. నిన్నటిదినమురాత్రి పదునొకండున్నర గంటల సమయమున నాతఁడు వెడలిపోయెను. ద్వారపాలకుఁ డాతఁడు పోవుటఁ జూచియుండెను. ఆతని దుస్తులు మొదలగు వస్తువులన్నియు నెచ్చటి వచ్చటఁ దాఱుమాఱుగఁ బడియున్నవి!"

బెరిమఫ్ — ఆతఁడు పలాయన మొనరించునట్లు తోఁచుచుండెను.

"పోకిరి! మోసగాడు! నా కొంప ముంచి పాఱిపోయినాఁడు. కాని ఆతఁ డింకను విశేషదూరము పలాయన మొనరింపఁజాలఁడు. తంతిద్వారా నలువలనులకు రక్షకభటుల నంపి ఆ దుర్మతి కిపుడే యురదండముల వేయించెదను!"

"తొందరపడకుడు. ఒకించుక తాళుడు శాంతింపుడు. ఈవిషయ మం దావంతైనఁ బోలీసులకుఁ దెల్లము కానీయకుడు. అది యట్లుండ మీ కార్యదర్శియే అపరాధి యనుటకు వలయు ప్రమాణ మేది? వొసఁగు నలిపిన పలుఁగు యీతడని మన మాతనిదెస దర్జని యెట్టులు నిర్దేశింపఁజాలుదుము? అనేక దుర్న్యాయములు మనము చిక్కులిపోరపడుచుండు" మని ప్రశాంతభావమున కర్నలు పల్కెను.

చౌర్యము జరిగినంతనే ఆతఁడు పాఱి చనెనని వినుచుంటిరిగదా? ఆతనియెడ సందియము కలుగుచుండుటలేదా?"

"ఆ సందియము నిపుడు నిశ్చయ మొనరించు టవసరము. ఈవిషయమున మీ భాతంబ్ జేమేమి యెఱుఁగును?"

విగనరీ — నిన్న రాతిరి నేను సింహకోశమును మూయునప్పు డందలి విత్తమంతయు సరిగ నుండెను. నిశీథసమయమునఁ గావలివాఁ డొక్కఁడు ఆఫీసునకు నవ్వలఁ బరుండియుండును. కాని నిన్నఁ దెల్లవాఱుసమయమున నాల్గుగంటల కాతఁ డింటినుండి వచ్చియుండును."

వర్జర్సు — (కుపితుఁడై) — రాత్రి పండ్రెండు గంటలకు ముందే వచ్చి మేలికమ్ కచేరిని జేరుకొనలేదా? ఏమి నిర్లక్ష్యము! ఏమి నిర్భయము! ఇపుడే యావలుగాకిని పనినుండి తొలగించివైతును. ఇరువదేండ్లనుండి ఆతఁడు నా యాధీనమునఁ బనిచేయుచుండెను. వాని పనియందు నేనింతకు మున్నెట్టి లోటును జూచియుండలేదు. కాని ఆతని యీనిర్లక్ష్యము క్షమింపరానిది. విగనరీ! ఇట్లని నీవైన నాకుఁ దెలుపక మంచిపని గావించితివి గావోయి!"

కర్నలు — (విగనరీని జూపి) — ఈతఁడు మిగుల విశ్వాసపాత్రుఁడని యనుచుంటిరిగదా? అందుచే నీచౌర్య మీతఁడు కచేరికి రాని క్రితమో లేక ఆఫీసునందలి యుద్యోగు లందఱు వెడలిపోయినపిదపనో జరిగియుండును!

వర్జర్సు — సాయంకాల మాఱుగంటలకును రాత్రి పండ్రెండు గంటలకును నడుమ నీపని జరిగియుండెను. పాపిష్ఠుఁడగు రాబర్ట్సు రాత్రి పదునొకండున్నర గంటలప్పుడు వెడలిపోయెను!

"అట్లని మన మనుమానించుచుంటి మంతియే! అందులకు ఋజువులేదు. ఈగదిఁ జొచ్చుట కన్యపథ మేమైన నున్నదా?"

"ఉన్నది. కావలివాని బీగమును దొంగిలించి యుండకపోయిన మొదల మఱియొక తాళముచెవిని సంగ్రహించి ఆతఁడు నిలయద్వారమును దెఱచి యుండును."

"కాని యినుపపెట్టెచెవి ఆతని కెందులభించి యుండును?"

వర్జర్సు తాళముచెవిని గరమునఁ గైకొని పరీక్షించెను. "ఇది

క్రొత్తగఁ దయారై ఎవరేని శిల్పనైపుణ్యమును వ్యక్తీకరించుచుం డెను! మాదిరి తాళిలేనిదే యిట్టిబీగమును దయారుచేయుట సాధ్యముగా" దని ఆతఁ డనియెను.

బెరిమఫ్ — మీ బీగమును బట్టియో మీ ఖాతంజీ బీగమును బట్టియో యిది నిర్మింపఁబడి యుండును.

మిత్రుని దోషనివారణ మొనరింప విగనరీ ఏదేని యుపాయము రోయుచు దొరనుతువులవిని "నే నెన్నఁడు నా బీగమును రాబర్టునకు నొసంగియుండలేదు." అనియెను.

"నేను గూడ నెన్నఁడు నొసఁగియుండలేను. కాని అపుడపుడు నాతాళము చెవిని నా మేజాపై విడుచుచుందును. అట్లువీడినపుడు పలుపర్యాయము లాతఁడు దానిఁ జూచియుండును."

"కాని తాళముచెవిని దీసికొని పోకున్నయెడల నిట్టిదానిని దయారుచేయుట సాధ్యము కాదు. అందుచే నీ బీగముయొక్క మర్మమేమో తెల్లము కాకుండెను! ఈవిషయముటుండ ఇనుపపెట్టెను దెఱచుట కేమైన సాంకేతికాక్షరము లున్నవా?"

"ఉన్నవి. విగనరీ! నీవా సంకేతమును గుఱించి యెన్నఁడును రాబర్టుతోఁ జెప్పియుండలేదా?"

"లేదు, ప్రస్తుతమున నేనా యానవాలు పేరును మార్చివైచితిని అట్లని యెవరును యెఱుఁగరు."

"నేనుకూడ నెఱుగను. నాకుఁ దెలుపక వేరేల మార్చితివి?"

"అపుడంతగా యోచింపనైతిని."

"ఆదేమి - పేరు? అయిదక్కరములు వరుసగ నుండెడివి" అని వర్జన్సు ఇనుపపెట్టెను దెఱచిచూచి తనకన్నియు పేరునుగాంచి "ఈపేరును నీ వేల పెట్టుకొంటివని విగనరీ నడిగెను.

"అది చెప్పజాలను. ఆకస్మికముగ నీపేరు నామనసునకుఁ దట్టెను.

అందుచే దానిని పేర్కొంటిని. ”

“ పేరును మార్చినపిదప రాబర్టు గదిలోనికి వచ్చి యుండెనా ? ”

“ లేదు. నిన్న రాత్రియే దీనిని మార్చియుంటిని. నిన్నప్రొద్దున నతఁడు ఒకయుత్తరమును గొని యీ గదిలోనికి వచ్చెను ; కాని, అతఁడు సిందుకప్రాంతమునకు బోలే దనుకొనెదను. ”

“ అనుకొనుటేమి ? నిశ్చితముగఁ జెప్పఁజాలవా ? ఇనుపపేటిక యొక్క యుక్కుచేయి దొంగను బట్టజాలక పోయెను. లోహహస్తమును రాబర్టెఱింగి యుండును. అందులకు సంశయ మేమియు లేదు. చౌర్య మొనరించిన దాతఁడు కానిచో, దొంగనేనైనఁ గావలయును, లేక నీవైనఁ గావలయును. ”

విగసగీయిఁక బ్రతివాద మొనరింప సాహసింపలేదు. సందేహము రాబర్టుపైఁ బడకపోయిన యెడల నిక్కముగ నాతనిపైఁ బడును !

ఈచిక్కునుండి దప్పించుకొనుట కొక తెరువు యున్నది. ఛిన్నహస్త విషయమును ప్రకాశ మొనరించి వైచినయెడల నోరులలక్ష్య మినుప పేటికపైఁ బడినదని తెల్లమగును. అందుచే రాబర్టుయొక్క నిర్దోషత్వము ఋజువుకాఁగలదు. రాబర్టాదిన మంతయు దన కచేరిగది లోనేయుండెను. ఆతనిపైఁబడిన సందియ మాకారణముననైనఁ దొలఁగజాలదు. ఏలనన జౌర్యమును నిజహస్తములతో సలిపియుండక పోయినను ఆతఁ డితరులచేత దానిని జేయించియుండును ! ఇప్పు డంతయు నిజమెట్లుఁగు టెట్లు సాధ్యము ? మేక్సిమ్‌తోఁ గలిసి ముందుగ నూహింపనిదే ఏమియు నొనరించుట కాతనికిఁ దోపకుండెను.

కర్నలుం — రాబర్టే అపరాధి యని యిపుడు నాకు నమ్మకము కలుగుచుండెను. అతనినిపుడు వెతకి పట్టవలయును. ఈవిషయమును నేను పోలీసుల కెఱిగింపఁ దలఁచుకొనలేదు. నాకు అర్థబలమును అంగబలమును వలయునంత గలదు. పోలీసులకంటె నధిక సామర్థ్యముతో -

నే నీకార్యమును గొనసాగింపఁజాలుదును. రాబర్టు తఱచుగ నేయే తావులకుఁ బోవునో తెలుపఁజాలుదువా?"

"నాయొంటనుండుతఱి అతఁడెందును అరుగువాఁడుకాఁడు. ఎల్లపు డాతఁడింటి కుంటే యుండువాఁడు. 'మావా' రనుకొనుట కాతని కెవరు లేరు. అతని కెట్టిన వృత్తియు లేదు. తండ్రి విడిచిన మేడ యొకటి మాత్ర మాతనికుండెను!"

"ఆదెచటనుండెను?"

"బ్రిటన్నీలో కాని, ఆతఁడచటికిఁ బోయియుండఁడు. రాత్రిబండిలో నాతఁడు పేరిసునుండి చని, ఏదేని నౌకనెక్కి, అమెరికా పోయి యుండును."

"రష్యాకేగ్గు ఏదేశమున కరిగినను, నేనాతని వెతకి పట్టితీసుదును."

"మీయాత్మ నిర్భరత ప్రశంసనీయము — కాని మీ రాతనిఁ బట్టఁజాల రేమో యని సందియపడుచుంటిని. రాష్ట్రశాసన కఠోర దంష్ట్రల కాతని గురిఁజేయ నేను దొరఁకొనను. చాలాకాల మాతఁడు మాపంచనంటి యుండెను. ఎట్టికట్టిడియైనను, ఆతఁ డెట్టిచెట్టకును లోనుగావలయునని నిచ్చగాను లేను. ఇఁక మీయిష్ట మెట్టులో య ట్లాచరింపుడు. భారమంతయు మీపై నొగ్గివైచితిని."

"మంచిది. లోకులంకెట్టి యాందోళనము కలుగకుండ జూతును. కృతకృత్యుఁడనగ నంతదనుక మిమ్ము నేను మరలదర్శింపను. ఇపుడు ముప్పదివేల రూకల నాకొసఁగుడు"

"వినవరీ! ఈవిషయ మింతకైనఁ బ్రకాశము కాఁగూడదు జుమీ! ఇపుడు కర్నలుగారికి పైకమిమ్ము."

వర్జర్సు యిఁకనందు నిలువక బిఱాన నాగారమునువీడి తనయ యున్న యెడ కరిగెను. ఎలిస్ నిజాగారమునఁ గూరుచుని యేదియో లిఖించుచుండెను. ఆమె యాననమునఁ బాండురచ్ఛాయయుద్యోతక మగు

చుండెను. నయనము లెఱ్ఱవారి యుండెను.”

“అమ్మా వగచుచుంటివా? ఏలనో చెప్పుము తల్లీ!” అని ప్రణయకోమల స్వరమున ముద్దుపట్టి నడిగెను.

నిన్నటినుండియు నా చిత్త ముడికిపోవుచుండెను. ఏమి యొనరించుటకు నాకుఁ దోఁపకుండెను. ఏపనియందును నా మనసు జొరుచుండుటలేదు. నీమూలముననే నాకీ దుఃఖము ప్రాపించెను.”

వృద్ధుఁడు చకితుఁడాయెను. మనోభావమును నందని తన ప్రేమాల వెలిబుచ్చుటకు నించుకైన సంకోచింపనందుల కాతఁడు విస్మితుఁడాయెను. తా నిపుడు చెప్పబోవు విషయమును వినినంతనే ఆ లతాంగిస్వాంత మెట్లు సంతసించునో ఆతఁ డించుక గ్రహించెను.

వర్జర్సు — అమ్మా! నీకు సదుపదేశ మొసఁగినందులకై నాపైఁ గినిసితివి! ఈ పరిణయము జరిగియే యున్నయెడల నీ జీవనమున నశాంతిబీజమును నాటినవాఁడ నగుదును. అట్టి దోషి కర్ధాంగివి గాగోరు టెంత యవివేకమో నీవే యెఱుఁగజాలుదువు.

ఎలిస్ ఏమియు నుత్తర మొసఁగలేదు. సగమువఱకు లిఖింపఁబడి మేజాపైఁ బడియున్న జాబుపై ముదుసలిదృష్టి పడియెను. “ఉత్తర మెవరికి వ్రాయుచుంటివి!” వని తోడనే తనూభవ నాతఁ డడిగెను.

“రాబర్టునకు!” అని యువతి జవా బొసఁగెను. ఆపె యుత్తరమం దెట్టి సంకోచముగాని బిడియముగాని పొడగట్టలేదు:

“ఏమి! నీవా యువకునకు జాబు వ్రాయుచుంటివా? నిస్సంకోచముగ నీజనకుని ప్రేమాల నిట్లు వచించుటకు నీకు బిడియము కలుఁగలేదా?”

“సంకోచముగాని, బిడియముగాని యెందులకు? జనకా! ఇఁక నీప్రేమాల దాచుటేల? నేనాతని బరిణయ మాడుదునని శపథ మొనరించియుంటిని. ఆప్రతిజ్ఞను నేను భంగ మొనరింపను. నావాగ్దత్త వల్లభునకు నిస్సంకోచముగఁ గమ్మ లిఖించిన దోషమేమి?

"నా యనుమతి లేకుండ నీ వాతనికి వధువు వగుటకు సమ్మతించి శపథముగూడ సలిపియుంటివా? నా యాయకోలుఁ బడయకుండ నీ వాతనిఁ బెండిలిఁ గావించుకొనఁజాలుదువా? నీవు యున్మాదినివైపోతివి! నీవయసున జనకుని యంగీకారముఁ బొందక ఎవర్తెయు బరిణయ మాచరించుకొనరాదను శాసన మున్నటుల నీ వెఱుఁగవు. ఈ కల్యాణమునకు నేను సమ్మతింపను తెలిసినదా?"

"మంచిది! నిరభ్యంతరముగ దాని నొనర్చించుకొనఁ జాలునందాక వేచియుందును."

క్రోధముచే ముదుసలి యానన మారక్తమై పోయెను! "ఏమి! — ఇంతవఱకుఁ బెచ్చిల్లితివా? శాసనానుసారము వలయు వయసు వచ్చిన పిదప నీ వాతనిఁ బెండిలిఁ గావించుకొన నిశ్చయించితివా? నేనన నా మాటయన నీ కంత నిర్లక్ష్యమా? మంచిది? అట్లైనఁ దగిన భోగమునే యనుభవింతువుగాని లెమ్ము! నీ ప్రణయియాన్వదుఁ డేమి యొనరించెనో యెఱుఁగుదువా? ఆ కట్టడిద్రుచ్ఛదనమునకుఁ దలపడియెను!"

"అది వట్టి మిథ్య!"

"మిథ్యకాదు, నిక్కముగ రాబర్టు చౌర్య మొనరించియుండెను. నా సదనమునుండి ఒందు యెడకుఁ జనుమని నే నాతనికి నిన్న స్పష్టముగఁ జెప్పివైచితిని? విదేశమున వాని కుద్యోగ మిాయ సమకట్టితిని. కాని అతఁడు దానిని గ్రహింపలేదు."

"అట్లు గ్రహింపక ఆ యువకుఁడు తన గౌరవము నిలుపుకొనెను."

"ముందు నేఁ దెలుపఁదలఁచినదానిని తెలుపనిమ్ము. పదపడి నీ వాతని పక్షమున న్యాయవాదివై తర్క వితర్కముల సలుపుము. నా సాయముఁ గొనుట కంగీకరింపక నాతఁడు నా ముందునుండి చనియెను. తదనంతర మతఁడు నాకుఁ గానుపింపలేదు. కాని నిశీథమున మరలివచ్చి మాఱుతాళముతో నా యినుపపెట్టెను దెఱచి నాకుఁ

జెందిన ఏఁబదివేల రూకలను బెరిమఫదొరకుఁ జెందిన నగల పెట్టి యను జంకఁ బెట్టుకొని ఆతఁడు పాఱిపోయెను ! ”

“ ఏమనుచుంటివి ! రాబర్టు హర్తయని యోజించుచుంటివా ? ఈ దుర్దాంతాపరాధమును ఆ యుదారునిపై నారోపింప సాహసించితిరా ? ఇట్టి దురంతరమున కొడిగట్టుటకు మున్నొకమా ఱాతని సమక్షమునకుఁ బిలిపింపుము — తాను నిరపరాధియని అవలీలగ నాతఁడు ఋజువుఁ గావించుకొనఁగలఁడు ! ”

“ ఇఁక ఋజువేమి ! ఆతఁడు పలాయన మొనరించెను. చోరుని వలె నదృశ్యుఁ డాయెను ! ఇప్పటి కాతఁడు ప్రాన్సుసీమను దాటి యుండును. నా విత్తము హరింపఁబడినను అట్టి పాపంకుఁడు అట్టి దుర్మతి నా మ్రోలనుండి చనినందులకు ‘బ్రదుకు జీవుడా ! ’ యను కొనుచుంటిని. ఆ ప్రముచ్చిఁక నెన్నఁడీ దేశమునకు మరలిరాడు. ఒక వేళ నా చెనటి మరలి యరుదెంచు నెడల అతనిఁ బెండిలి గావించు కొనుము. నేనెట్టి యడ్డుఁ బెట్టను. అతనిఁబట్టి బంది గావింపను.

“ ఏమి వెడలిపోయెనా ? ఏల పోయెను ! చెప్పకుండనే పోయెనా ! ఒకమాఱు నా మ్రోల కరుదెంచి చెప్పి పోలేదేల ? హా ! ప్రాణసఖా ! ప్రాణసఖా ! ” యని నైరాశ్యపీడిత హృదయయై గద్గదకంఠరయై పల్కి చేష్టలు దక్కినదానివలె నా చేడియ జనకుని యెడదపైఁ జివాలునఁ గూలెను !

## ౪

ప్రథమమున మనకుఁ బరిచితులైన మిత్రులిర్వురు కతిపయదినములు గడచినపిదప నొకనాఁడు పేరిసునగరమున కొకవంకఁ గల ‘రు దేలా చాసీడెయెస్టి’ అను తావు వైపుగ జనుచుండిరి.

“ఎచటికిఁ దీసికొనిపోవుచుంటివి ? ” అని వినగరీ నెయ్యునిఁబ్రశ్నించెను.

"ఆ ప్రదేశమునకు నీ వెన్నఁడును చనియుండలేదు. అచటఁ జిత్రముఁ జూడఁ జాలుదువు?"

"చిత్రముఁ జూచుటకు నా కవకాశములేదు. ఈ సమయమున నా చిత్తము ప్రమోదమునకుఁ జోటిచ్చునా?"

"అవునది నిక్కమే! ఛిన్నహస్తము! నగలపెట్టె — ఏఁబదివేల రూకలు! మూఁడును గలిసి ఒక్కమాఱుగ నీ యుల్లమును గలచి వైచుచుండెను! అయినను, నెచ్చెలీ! నీకీయుడుకును యాంతరంగిక యాతనము నెందులకు? ఆతఁడు నిన్ను సందేహించి యుండ లేదు గదా! ఛిన్నహస్తమునకును దన సింధుకమునకును నేదియైన సంబంధమున్న ట్లాతఁ డెఱుఁగడు?"

"ఆయుదంతమును నీవు నన్నుఁ బ్రకాశ మొనరింప నీయనందులకే, నేడు నా చిత్తమంతయుఁ జింతాకులమై పోవుచుండెను? ఛిన్నహస్త వృత్తాంతమును వినియున్న యెడల వృద్ధుఁడు రాబర్టును శంకింపకనే యుండును?"

"ఈ పని రాబర్టు కావించినదనియే నాగట్టి నమ్మకము. అట్లు కానిచో నాతఁడేల ముచ్చుమాడ్కి బలాయన మొనరించును! విశ్లేషించి సాధారణ చోరుఁడైన యెడల పైకమంతయు దొంగిలించి యుండును! రాబర్టునకు విత్తముకావలసియుండెను. వలయునంత మొత్తమును మాత్రముగొని ఆతఁడరిగెను. అవసరముఁ జూచుకొని అర్ధము ననంతరము తిరిగి యిచ్చివేయవచ్చునని ఆతఁడు తలఁచెనని యను కొందము. కాని నగలపెట్టియ నాతఁడు హరించుటేల? ఆపేటిక యందెవరుకరయేని రమణికిఁ జెందిన గూఢపదార్థము లుండియుండును. రమణీ రాబర్టు లిర్వురు గలిసి యీ చెడుచెయిదము సలిపియుందురు? మొట్టమొదట దానే ప్రయత్నించి చేతినిఁ గోల్పోయి పదంపడి ఆమెలనాఁగ రాబర్టు సాయముఁ బడసియుండును! రాబర్టు ఇంతకు

మున్నే పదచ్యుతుఁడాయెనుగదా! నిజపరిభవమునకు ప్రణయిని ప్రబోధముతోడై యుండును! పెట్టె దెరచుటకు వలయు సంకేతము కూడ నాతనికిఁ దెలిసియే యుండును. సంగిణి వస్తువుల సంగిణీకిచ్చి వైచి అమెరికా పయనమునకై జాలినంత యర్థమాతఁడు గొనియుండు నని నే ననుమానించుచుంటిని!"

"ఇది యంతయు వట్టి యనుమానము మాత్రమే! ఇం దినుమం తైన నిక్కము లేదు. రాబర్టున కెన్నఁడు మఱొక ప్రణయిని యొవర్తె కయు లేదు."

"అట్లని నీ వెట్లెఱుఁగుదువు?"

"నీ మేనమామ కూఁతు నాతఁడు ప్రేమించియుండెను."

"అది సరియగు ప్రమాణము కాదు. ఆచిన్నదానితో నాతనికిఁబరి చయము గలిఁగి రెండువత్సరములు మాత్ర మాయెను! అంతకు మున్నాతఁడు మఱియొక మానినీమణిని బ్రేమించియుండును. ఆ వధూ టిపైఁగల వలపు ఇపుడుకూడ నిలిచియుండును."

"ఇది వట్టి యనుమానము మాత్రమే! పూర్వప్రణయినిమాట ననుసరించి, నిజమానసంభ్రమములకు నీరు వదలుకొనుట కాతఁ డంత మూర్ఖుడా? రాబర్టు నిర్దోషియనియే నా యభిప్రాయము."

"నీ వనినది నిక్కమేయై యుండును. కర్నలు బెరిషఫ్ రేపువర్జర్సు గారియొద్దకు వచ్చునా? నే నాతని నొకపర్యాయము దర్శింపఁ దలఁచుచుంటిని."

"దొంగతనము జరిగిన మఱునాఁడే ఆదొర వెడలిపోయెను."

"ఎచటికి?"

"అది నే నెఱుఁగను. కాని ఆతఁడు రాబర్టును వెతకి పట్టుకొను టకే పోయి యుండునని యనుకొనెదను."

"అట్లైన నాతఁ డపరాధపరిశోధనము సలుపుచుండును! ఆతని

యుద్యోగమే అదియని నమ్ముచుంటిని. గూఢదూతయై ఏదేని ముఖ్య కార్యమునకై ఆతఁ డరుదెంచి యుండెనని మొదటినుండియు నను మానించుచుంటిని. ఇటీవలనే నేను పత్త్రేదారు వృత్తి నవలంభించినను కర్నలుకంటె ముందుగ నేనే హర్తను బట్టంజాలుదునని విశ్వసించు చుంటిని. రాబర్టును వెతకి పట్టుకొనుట నా పనిగాదు. ఖండకరముకు వెన్కవీడి పాఱిదనిన రమణిని వెతకి కన్గొందును. దొంగ యెవరో అపుడు తెల్లమగును."

"నీవా చోరాంగనను వెతకి పట్టఁజాలితివేని నిక్కముగ రాబర్టున కెంతేని యుపకారముఁ గావించిన వాఁడవగుదువు."

"అట్లే కావచ్చును— కాని నీ యాసలన్నియు నడుగంటును. ఎలిస్ ప్రాత నెచ్చెలినే చేఁబట్టును. ఏమైనను నేడు నాజతనమును వీడను. రాబర్టు నిర్దోషియని బుజువగుచో దశదిశల నేనే ముందుగ నావిష యమును జాటించివైతును. ఒకవేళ నాతడు చేయిలేని చేడియకు సాయమునలిపిన చెలిమికాడని తెల్లమగుచో ఆతని కనిష్టయు, నీకు మంగళముఁ గల్గును!"

"ఆ రమణి మురువు నేమి చేసితివి?"

"నీవైన యెడల దానిని జేతి మొండెముతో సీన్ నదియందుఁ బాఱవైచి యుందువు! కాని నేనట్లొనరింపలేదు. నాకుఁ బరిచితుఁడైన ఒక నగలమ్మువానికి ఆనగను జూపితిని. కొలఁది దినములకు మున్నొక సౌందర్యతిలక మరమతు గావించుకొనుటకై ఆ భూషనను దనయంగడికిఁ గొనివచ్చెనని ఆ వణిజుఁడు చెప్పెను. వారముదినము లైన పిదప వచ్చి ఆనారి తన నగను దాను కొని చనియెనఁట. పేరిసు నగరమునఁగల భద్రమహిళల నెల్లఱ నాతఁడెఱుఁగును. ఎవర్తుకనైన నాతఁ డవలీలగ గురుతింపఁగలడు. కాని యీకాంత నతఁ డెన్నడుఁ జూచి యుండలేదఁట. ఇటీవలనే నాయింతి పేరిసునగరమున కరు

దెంచియుండును. నగచేశ రీతికూడ నీ సీమదికాదు. అది విదేశాలం కారమని స్పష్టపడుచున్నది. "

ఆ యలంకారము నీ యొద్దనే యున్నదా ? "

" నా యొద్దనే యున్నది. ఇంటనుంచిన దొంగిలింపఁ బడునను బీతునఁ గంకణముగ దానిని ధరించితిని. "

" ఎవ్వరైనఁ జూచితిరా ? "

" నేఁ జూపింపక పోయిన యెడల నెవరుగాని దాని నెందుకు జూతురు ? ఒకవేళ నది యొరుల గన్నులఁబడినను అది నా ప్రణయిని ప్రణయ పారితోషికమని వారు తలంతురు. "

" మంచిది. దానిమాటటుంచుము — ఇపుడు నన్నెచ్చటికిఁ దీసికొని పోవుచుంటివో చెప్పుము. "

" చేతికిఁ గంకణ మెందులకు గట్టుకొంటినో యెఱుఁగుదువా ? "

" ఎఱుఁగను "

" యలంకారమున కధికారిణియైన రమణిని వెదకుటకై నాటక శాలలందును నృత్యసభలందును గ్రుమ్మరుదును. "

" నీవు నిక్కముగ నున్మాదుఁడవైతివి. వారము దినములకుఁ బూర్వము చేయి తెగిపడిన చేడియ ఇపుడు నాటకశాలలకుఁ గాని నృత్య సభలకు గాని పోఁజాలునా ? ఇపు డాచోరాంగన మంచమును బట్టి యుండును, లేక మరణించి యుండును. "

" నృత్యక్రీడా ప్రాంగణమున నామెను నిక్కముగఁ జూడఁగలనను నాసతో నేఁ బోవుచుండుటలేదు.

" సోదరా ! నేనా తావునకు రానొల్లను "

" నిన్ను బలవంతముగ నెచటికిఁ గొనిపోను. నీకిష్టమున్న నే రమ్ము. అయినను, ఇంత యడలున నన్ననుసరించి రాకుము. ఇంటికిఁ దిరిగి పొమ్ము నీవిట్టి ప్రదేశములకు వచ్చుచుంటివని వర్ణర్సుగారికిఁ దెలిసిన

యెడల, నాతని యెడను నీయెడ దురభిప్రాయ ముదయించును. నీనిశ భ్రమణోదంతము ఎలిస్ వినులఁబడక మానదు. అందుచే నీపై నామెకు రోఁతపుట్టును— కావున నీవిపుడు క్రీడాంగణమునకు రాకుము. నీవిపు డాయువతిని గుఱించియే ఏమో యోచించుచుంటివని గ్రహించితిని. చింతఁదక్కుము. మీ యిర్వురకు మిళనము గాక యని హృదయపూర్వకముగ వాంఛించుచుంటిని. ఇఁక నింటికి మరలుము."

"నృత్యసభయందు నీ వేమిచేతువో చెప్పుము. ఎటులఁగ మిగులఁ గౌతూహల పడుచుంటిని."

"అచటి కెందరేని సుందరాంగన లరుదెంచుచుందురు. వారి యందఱికి మురువుఁ జూపుదును. దీనినిజూచి వారలు విస్మయపడక మానరు. ఈ యలంకార మెవర్తుక జేతినుండెడిదో ప్రసంగవశమునఁ దెలియవచ్చును."

"నీవు చెప్పినది బోధపడినది. కాని యిందువలనఁ గార్యము సానుకూలమగునని నాకు నమ్మకములేదు. అదృష్టమున్న యెడల ఆరమణి నెచ్చెలులలో నెవతియేని నీకుఁ గానంబడవచ్చును. కాని అచటికరిగినంతనే నీకా యదృష్టము పట్టునను నిశ్చయమేమి ?"

"మొదటిమాటే నే నాకాంతను గన్గొనఁజాలుదునని తలచుట లేదు. ప్రయత్నము సలుపగా సలుపగా గనుగొనవచ్చును. ఒకరొక్కరుగఁ బల్లూరు కంకణమును జూచినంతనే కతిపయదినములలోఁ బారిసునగర మందొక యాందోళనము పుట్టును. వజ్రఖచితమైన మురువును నేఁ జేధరించితినని ప్రజలు అబ్బురముగఁ జెప్పుకొందురు. అలంకార మెవర్తుకదో ఆపెజెవిఁగూడ నీవార్త పడఁగలదు. అపు డెవర్తుకయేనిదూతిక కంకణమును గౌశలముగ నాకరమునుండి గొనిచనుటకై నాగ్రామాల కరుదెంచును. ఏమిజరుగనున్నను ఈ విషయమున నిసుమంతైన మేనమామగారికిని ఎలిసునకును దెలియకుండు

నట్లు మనము జాగ్రత పడవలయును. కాని చౌర్యమందు రాబర్టునకు సంబంధములేదని తెల్లమగునెడల, అతని నిర్దోషత్వమును నాల్గువలనులఁ జాటుదును."

"దైవకృపచే నట్లొనరింపఁజాలుదువుగాక! ఏమేమి జరుగుచున్నది నాకుఁ దెలుపుచుండుము. నీవు పైఁబూనిన కార్యము మిగుల విపజ్జనకమైనదని తలఁచుచుంటిని."

"సోదరా! నేను పసిబాలుఁడనుగాను — అడలనేల? ఇఁక గదలి పోవుదును. శీఘ్రముగనే నిన్ను మరల గలిసికొందును."

మిత్రునొకమారు ప్రేమమొయిగ కౌగిలించుకొని విగనరీ వెడలిపోయెను.

నృత్యక్రీడా ప్రాంగనాభిముఖముగ మేక్సిము కదలిపోయెను. ప్రాంగణము జుట్టును బండ్లు లెక్కకు మించియుండెను. పరిసర ప్రదేశమంతయు జనసంకులమై యుండెను. జనమును ద్రోసికొని మేక్సిము లోపల బ్రవేశించెను. అత్తఱి వెన్కనుండి కదువడిగవచ్చి ఆతని బాహుమూలము నెవరో బట్టుకొనిరి. చివాలున నాతఁడు వెన్కకుఁ దిరిగిచూచుసరి కొకబాలకుఁడు ద్రుతగతిఁ బ్రక్కఁగల తెరవు గుండా పర్విడి నిమిసములో నంతర్హితుఁడాయెను. జరిగినదేమో కడుం గడు తుచ్ఛమయ్యు, "అప్రమత్తుఁడనై నడువనిచో గంకణము చోంగిలింపఁబడును. ఎవరోదానికై పొంచియుండి" రని గ్రహించి మేక్సిము జాగరూకుఁడాయెను.

అతఁడు మెల్లమెల్లగ ముందునకుఁ జనసాగెను. క్రీడాభూమి యంతయు జనవితానమున కాలవాలమై యుండెను. ప్రతిమానిసి ముఖమును ఆలోకించుచు మధురనృత్యనిస్వనము వినంబడు తావున కరిగి మేక్సిము నిలువంబడెను. తోడనే పరిచితలైన మూవురు రమణులాతనికిఁ గన్పట్టిరి. వారితో మగవాఁడెవఁడునులేడు. మేక్సిము వారి ముంగల కరిగి నిలువంబడెను.

ఒక యువతి — ఈమధ్య మీదర్శనము కలుగుచుండుట లేదేల ?

మేక్సిము — నేనిపు డొకసుందరి యెడఁ బ్రణయాసక్తుఁడనై యుంటిని. అన్యాంగనలతో నెయ్యమున నుండుట నిషిద్ధము !

"ఏమి! మీరు ప్రేమజాలమునఁ జిక్కుకొంటిరా ?"

"అందుఁ జిక్కుకొనుట లేదు. ఓ! అదెట్టి ప్రగాఢప్రేమ !!"

మూడవరమణి : ఈ పెద్దమనిషి యనినది నిక్కమే ! ప్రణయిని ప్రణయము ఈతని చేతిపై నెట్లు విరాజిల్లుచున్నదో చూడుడు !

కుర్చీ చేయిపై నిజకరమునుజూపి మేక్సిము నిలిచినందున కంకణము స్పష్టముగ గానంబడుచుండెను.

మొదటికాంత — ఆహా ! ఎంతయందమైన కంకణము ! కంకణపు సొంపుఁ జూడఁగనే కాంత రూపురేఖలు ఒకమాఱుగ బయలుపడి పోవుచున్నవి !

రెండవయాపె — వజ్రఖచితమయ్యు మురువు మలినమై నిన్న మూడాసి పాఱవైచిన ప్రాతగాజువలె నుండెను.

మూడవయాపె — కొంతమంది విలాసినులు అందము చందము నెఱుఁగరు.

మొదటియాపె — మీ వలపులాడికి — నీ ప్రియురాలికి వయసు ముదిరియుండును. మాముత్తవ్వ కిటువంటి కంకణమే ఒకటి యుండెడిది ! అది తన పుట్టినింట వారొసఁగిన యరణమని ఆముదుసలిది యనుచుండెడిది !!

కాంతల వ్యంగప్రసంగమున కించుక కనలి మేక్సిము " మీ తెల్వి యంతయు నొక్కనిమిషములోనే తెల్లమాయెను—ఆమహిళ విదేశిని. స్త్రీధనమునకు వారినురాక్తై ఆపెఎన్నని పూర్వాలంకారములను బడయఁగలైను.

" ఈ మురువులజతను నేనెచటనో జూచియుంటిని "

"నిజమే. ఎవర్తుకచేతియందుఁ జూచియుంటివి ?"

"ఆమెపేరు బాగుగ జ్ఞప్తికివచ్చుటలేదు — మూఁడునాల్గు దినములలో జ్ఞప్తికి వచ్చును. నేనేమో చెప్పుచుంటినని యోచింపకుడు. అచిరములో మీ ప్రణయినిపేరుఁ దెలుపుదును!"

రమణిపల్కు తెఱఁగునుబట్టి ఆమె వచించిన దసత్యమైయుండదని యోజించి మేక్సిమామె నింకను ఏమో ప్రశ్నింపఁబోవుచుండ నింతలో హంగేరీసీమవాసియగు నొకచికిత్సకుఁ డరుదెంచి వారల ముంగల నిలిచెను. రూపమున నాతఁడు వైద్యునికై వడి చూపట్టలేదు. విపులశ్మశ్రుభారముచే నాతని ముఖమండల మాచ్ఛన్నమై యుండెను! సైనికుని చాడ్పున నాతఁడు వసనములఁ దాల్చియుండెను. కాని అతఁడు వెజ్జుయనుటకు సందియములేదు. జర్మను, పోలెండు విశ్వవిద్యాలయములందు శిక్షఁబడసి, అనంతర మాతఁడు వైద్యవృత్తి నవలంబించెను. విశేషవిత్తము నార్జించి, యిప్పుడాతఁడు తనవృత్తిని మానివైచెను. కాని యెవ్వరైన సాయము వేఁడిన యెడల దానినాతఁ డొసఁగకమానడు. రోగికి వలయుసేవఁ జేయును గాని మందునకై ఆతండొక గవ్వయైనను గైకొనడు. రమణులతోఁ బ్రసంగించు నవసరమున దగుదుఁనని వైద్యుఁడెదుటఁ దయూరైనందున మేక్సిమున కరికాలిమంట దలకెక్కెను! అయిన నాతఁడు శాంతమూని ఆశ్రోత్రమానిసిని దేఱిచూడసాగెను.

నిముసములో నిరువురకుఁ బరిచయము కలిగెను. ఈనుడువు గడిచినపిదప, "ఆవైపునకురండు. ఒక యద్భుతదృశ్యమునుజూడఁ జాలుదురు!" అని వైద్యుఁడనెను.

ఆకస్మికముగఁ జికిత్సకుఁడు చూపిన చనువు మేక్సిమున్ను విస్మితుఁ గావించివైచెను! వైద్యునితోఁ బోవుట కాతని కించుకైన నిష్టము లేదు; కాని ఒకించుక యోచించి "పోయిననేమి! — అదృశ్యమేమో

చూచి కాంతలకడకు వేగిరమే మరలి రావచ్చు” నని యాతఁడు యోజించెను.

మేక్సిము — అయ్యా! ఆయద్భుతదృశ్యమేమి?

వైద్యుఁడు — మీకొక యపూర్వ సుందరిని జూపుదును! ఆయంద కత్తెను జూచి తీరవలెను! ఆ దిక్కుగ నొక్కమాఱు దృక్పాద మొనరించినయెడల నానుడువు లనృతములు కావని మీరు గ్రహింపఁ జాలుదురు.

ఉభయులును కొంతదూర మరిగినంతనే “ఇంచే నిలువఁబడుము. సుందరి యిపుడే యిచటికి వచ్చును. ఆకాంత ఎట్టియసమాన రూపవతియో చూచీ చూడకుండగనే మీకు బోధపడు” నని వైద్యుఁడనెను.

చికిత్సకుఁడనిన యట్లు నిలిచి క్రీడాంగణాభి ముఖముగ మేక్సిము తన దృష్టులఁ బఱపసాగెను. దూరమున నీహార ప్రాంగణమున నొక పూఁబోడి కడువయ్యారముగ నాట్యమాడుచుండెను. ఆసీమం తిని యపూర్వ నృత్యనైపుణ్యముఁ జూచుటకై లోకులు పల్వురందు గుమిగూడ దొడఁగిరి! ఆకస్మికముగ నాపురంధ్రీశమంతకము మేక్సిము పొంతనుండి శరవేగమున నృత్యగామినియై చనెను. సౌదామిని చాడ్పున చనిన అచానవను యువకుఁ డొకమాఱు కన్నెత్తి చూచెను! ఆ ఆయువతి యనన్యసామాన్య లావణ్యవతి! ఆమె నయనము లాయుత ములై ఆకర్ణవిశ్రాంతములై చంచలములై నల్లకలువల లీలనుండెను! యువకుని దెస నామదిరాక్షి యొక్కమాఱు తన యపాంగము మరల్చెను! ఆహా! అదెట్టి మోహాభరితమైనది! యువకుని విస్మయ మంతము కాకమున్నే ఆపల్లవోష్ఠి బహుదూర మరిగి పోయెను!

“ఇపు డేమందురు? ఆసుగువ యందకత్తెగాదా?” యని వైద్యుఁడగు విలనస్ పల్కెను.

“కాకేమి? మీరనిన ట్టిట్టిసుందరిని నే నెన్నఁడును జూచీ యుండ

లేదు. ఈమె యీసీమ సీమంతిని గాదను కొనెదను. ఇచటి యువతి యైన యెడల నొకప్పుడు గాకున్న నింకొకప్పుడైన నీమెను జూచి యుందును. ఆహా! ఎట్టి యందంపు కన్నులు! ఎట్టి యపూర్వాంగ సౌష్టవము! ఎట్టి యద్భుతసౌందర్యము! మరల నాయింతి యిం దుండి యిపుడే చనుననుకొనెదను." వైద్యుఁడు మందహాస మొన రించి "అట్లైన తాము సుందరికై వేచియుండుడు. నేఁబోయెదను. ఫలహార శాలయందు మరలఁ గలిసికొందురా?" అని యనెను.

"అట్లే కలిసికొందును. అయ్యా! ఈమె యేదేశపు కాంతయో యెఱుఁగుదురా? పేరిసు వాసిని కాదని మాత్ర మెఱుఁగుదును."

"ఆమె ఏదేశీయురాలో నేఁ గూడ సరిగఁ జెప్పఁ జాలను. కాని రూపమును బాగుగఁ బరీక్షింప ఆయువతి మాసీమ పరిసరమున వసించు దానివలెనో దోఁచుచుండెను. ఏలనన, 'పేస్త' నగరమున నే నిట్టి రమణులఁ బల్వురఁ జూచియుంటిని."

మంచిది. ఈసుందరి యెచటి యామెయో నేఁ గన్గొందును. ఈమెతోఁ గొంత సేపు ప్రసంగించి తీరవలెను."

వైద్యుఁడు వెడలిపోయెను.

రమణి సౌందర్యమునఁ బూర్తిగ ముగ్ధుఁడై యువకుఁడు తనరాక యుద్దేశమును మఱచిపోయెను. విగనరీ అపుడం దుండిన యెడల, నెయ్యుని యాత్మవిస్మృతికి మిగుల నబ్బురపడియుండును. నిలిచిన తావునందే కదలక మెదలక సుందరికై యువకుడు కడు నాతురుఁడై వేచియుండెను. ఆకస్మికముగ వెన్కనుండి "మేక్సిముగారూ! ప్రణామ!" మని ఎవరో యనిరి.

వెన్కకుఁ దిరిగి తన మామగారి నౌకరగు జర్జెటును జూచి మిగుల విస్మయపడి "నీవిచట నేమి చేయుచుంటివి?" అని మేక్సిమాతనిఁ బ్రశ్నించెను.

“ నేను ప్రతిదినము సంధ్యానంతరమున నిచటికి వచ్చుచుంటి ” నని బాలకుఁ డుత్తర మొసంగెను.

“ ఈ యల్పవయసునందే నీవిట్టి ప్రదేశములందుఁ గ్రుమ్మరు చుంటివా ! మంచిది ! ఒకపర్యాయము నీసంగతి విగనరికిఁ దెల్పు దును. అతఁడు నీకుఁ దగు దండన మొసఁగును ! ”

“ మహాశయా ! నాకు దండన మెందులకు ? నేఁ జేసిన తప్పేమి ? నా పితామహికొఱకె అనుదినము నే నిచటికి వచ్చుచుందును. — బాబయ్యగారూ ! నమ్ముఁడు, నమ్మకపోండు — మేము మిగుల నిరు పేదలము — మాముసలమ్మ వట్టి నిరీహ ! నేఁ దక్క నిఁ కామె కెవ రును దిక్కులేదు. ప్రతిదినము రాత్రివేళ నే నిచట మూఁడునాల్గు ఫ్రేంకులను సంపాదించుకొనుచుందును. మీ మేనమామగారు నెల కిరువదియైదు నాణెములను మాత్రము నాకిచ్చు చున్నారు. పైగా నేమైన సంపాదించుకొనక పోయిన యెడల, మాపొట్టలు నిండుటెట్లో మీరే చెప్పండి బాబయ్యా ! ”

“ మంచిది. ఇఁక నీజీతము హెచ్చింపు డని నీయజమానితోఁ జెప్పుదును. ”

“ ఆహా ! అలాగునన్నైన మాబామ్మ యెంత పొంగిపోవును ! ”

“ మంచి దిఁకఁ బొమ్ము. నీకు నే నీతావున గానుపించిన ట్లెవ రికిని దెలుపకుఁజుమీ ! ”

“ చిత్తము. అయ్యా ! మీకోసరమై నీట మున్గుటకుఁ గాని అగ్నిని దుముకుటకు గాని ఎవ్వరైన వలయుచో నన్నుఁ బిల్వుడు ! మీయాదేశము శిరసావహించెదను. మీకోసరమై ప్రాణముల నర్పించుటకు సిద్ధముగనున్నాను ! ”

భక్తిపూరితహృదయుఁడై జక్లైటు మేక్సిమున కభివాదన మొన రించి వెడలిపోయెను. యువకుఁడు మరల సుందరివైపుగ దృక్కులఁ

జలిపెను. ప్రాంగణమున నొకవైపున నిలువంబడి ఆమె నృత్యభూషల విప్పుకొనుచుండెను. ప్రసంగించుట కదె మంచితరుణమని యువకుఁడు యోచించెను. తోడవ్రులవీడి సుందరి అవ్వలికరుగ నుద్యమింప ముం దున కరుదెంచి మృదుస్వరమున మేక్సిము, "సుందరీ! నేనొకనితోఁ బందెము వైచితిని. ఇంచుక దోడ్పడెదవా!" యనెను. ఒంకిచుకైన నచ్చెరువొందక ఆయించుఁబోఁడి యువకుని గట్టెదుట నిలిచి "ఏమి పందె?" మని ప్రశ్నించెను.

"నృత్యకృత్యమున నీనేర్పునుజూచి నానెయ్యుఁడొకఁడు హాలండో, రష్యాయో, స్వీడెనో, నీదేశమై యుండుననియు నుత్తరసీమ సీమంతినీ లలామల కిట్టి సుందరనయనము లుండవనియు నాతఁ డనెను"

"నీమిత్రుఁడు పొరపడియెను."

"నేఁగూడ నట్లే యంటిని. దక్షిణదేశమున నృత్యమందుఁ గొంత లిట్టి నైపుణ్యముఁ బడయుటఁ జూడమనియు, అందుచే నీవుత్తరదేశ వాసినివనియు వచించితిని. పదిరూకలను పందెమందు గెల్చితిని"

సుందరి మందహాస మొనరించి, "అయ్యో! అట్లని తలఁచుచు సంతోషింపకుఁడు. మీరు యోడిపోతిరి! నేను ఫ్రాన్సుదేశపుయువతిని."

"యువతీరత్నమా! అట్లైన నీపేరు సాల్లిటీలేక రోజేలీ యయి యుండును కాదా?"

"కాదు. నాపేరు జస్టిన్!"

"నీవు పరిహాసించుచుంటివి."

"మీరే నన్ను బరిహాసించుచున్నారు — మీ మాట కుత్తర మొసఁగుటే నాది తప్పైనది."

"ఇందుఁ దప్పేమున్నది? నేను గూడని ప్రశ్న వైచియుంటినా! నీవెంతో యందకత్తెవని నే ననిన నది దప్పైపోవునా?"

"అందుఁ దప్పేమియు లేదు. ప్రశంసయన నాకు మిగుల నిష్టము.

కాని మహాశయా! ఇఁక హద్దు మీరకుము. నే నిఁక మా యింటికిఁ బోదును."

"కాంతా! నడువుము. నేను కూడ నీతో వచ్చుచుంటిని."

"అందులకు నే ననుమతి నొసఁగను."

"అబ్బే! ఆలాగున ననకుము. నీవెంట రావలెనని నా కెంతో కోరికగా నున్నది."

"పెద్ద మనుష్యులని యోచించి మీతోఁ బ్రసంగించితిని. నన్నొక్కర్తుకనే మా యింటికిఁ బోనిండు. ఊరక మీరు నాకు విసుఁగు బుట్టింపరని నమ్మెద."

"కాంతా! నాకు నీవంతగాఁ జెప్ప నవసరము లేదు — ఏలనన, నీ వేమి చెప్పినను వట్టి వృథ! నీకిష్టమున్నను, లేకపోయినను, నేను నీవెంట వచ్చితీరుదును. ఇలుజొచ్చి నీవు తలుపు మూసివైచుకొన్నను, నేను వెలుపలఁ బడియుందును."

చిరునగవు మోమునఁ దోప నాలేమ యిట్లనెను. "ఎంత చెప్పినను ననేమిరా యనుచుంటిరి: మీ మొండిపట్టును జూడ మీ యిష్టానుసార మాచరింపక తప్పదని తోఁచుచున్నది — కాని, మహానుభావా! నేను నడచిపోదును. మీతోఁ గలసి బండిలోఁ బోను. ఇంకొక మరతుగలదు. మాయింటికిఁ గొంచెము దూరమునుండి మీరు తిరిగిపోవలెను. నేను సమ్మతింపనిదే మీరు నా మందిరమునఁ బ్రవేశింపఁ జాలరు."

"సరే. అట్లే కానిమ్ము — ఇఁక నడువు" మని యువకుఁడు ప్రేమమోయి ఆపెదెసఁ జేయిఁజాపెను. ఇంచుకైన శంకింపక ఆలతాంగి యువకుని జేయిఁబట్టుకొని నడువసాగెను.

నృత్యప్రాంగణమునుండి వెలుపలికివచ్చి, "నడచిపోవలెనని యే నిశ్చయించితివేని, మీయింటిత్రోవ యెఱుఁగని వాఁడగాన జీఁకటియందు

నాకరమును విడువక నడువవలెనుసుమీ!" అనిచిరునగవునగుచు యువకుఁడనెను.

లేనవ్వాననమునఁ దోప నాలేమ "మంచి" దనెను.

అపుడు యామిని రెండుయామము లాయెను! ఆకసము జాబిల్లి వెలుఁగున నవ్వుచుండెను. ఈతెరువును, ఆతెరువునుదాటి వారిరువురు చాలదూరము సాగిపోయిరి. రాజపథము జనరహితమై యుండెను. కావున వారల ప్రేమసల్లాప మేరిచెవులయందును బడుట లేదు. ఇంతదనుక మేక్సిము తన్మయుఁడై ప్రసంగించుచుండెను. నగరమును వీడి చాలదూర మరుగుసరికి ఆతనికి స్మృతిగలిగెను. తోడనే ఆతఁడు తన తీక్ష్ణదృక్కులు నలువలనులకుఁ బఱపెను. నిందుజవ్వనమున నున్న నా స్త్రీపురుషుల యేకాంతక్షణము పరిభ్రమణ పరిణామ మేమై యుండును? పోవంబోవ వారలకొక పెద్దవంతెన కానుపించెను. ఇర్వురాయెట్టెడఁ జొచ్చి కొంతదూరము సాగిపోయిరి. యువకుఁడొకతూరి నాల్గుతట్టులకు దృష్టిసారించెను. సేతుపార్శ్వమునఁగల యినుపకమ్ములపై వఁగి ముప్పురు పురుషులేమో పరీక్షించుచుండిరి.

మేక్సిము — చీఁకటిచుం దిట్టివారినిఁజూడ నీకు నడలుబుట్టుచుండుటలేదా? ఒకర్తుకవు ఇంత నిశివేళ నీతెరువునుండి రాఁజాలుచుందువా?"

"నేనెపుడును నడచి వచ్చెడిదానఁగాను. బండిమీఁదనే మాయింటికరుగుచుందును. రాత్రులం దీతావు నిక్కముగ నిర్జనమై, నిరంతర నిబిడాంధకారమగ్నమై యుండును! కాని నేను పిఁకిదాననుగాను."

"నీ యిల్లెచట?"

"రుజొంగ్రాయుందు. ఇంకను ఆతావు చాలదూరమం దున్నది. నావెంటనంటి మాయింటికి రావలెనని యాతురపడితిని గాన దగుశాస్తి యొనఁగుటకై అట్లని మీకుముందే నే దెలిపియుండలేదు."

"సుందరీ! ఇట్టిశాస్త్రీకదుంగడు మధురమైనది! నీగేహము మఱింత దూరమందుండవలెనని యే వాంఛించుచుంటిని!"

"ఓ! కోటునకు లోపల మీరు కవచమును ధరించితిరా యేమి? నాచేతినేమో గ్రుచ్చుకొనుచుండెను."

మేక్సి మింతవఱకు కంకణముమాట మఱచిపోయెను. యువతి ప్రశ్నించినతీఱుగూడ మిగుల విచిత్రముగ నుండెను. అకాత్తుగ నడిగిన ప్రశ్నకు నేమిగాని సర్దిజెప్పుట కాతనికిఁ దోఁచలేదు — అయినను ఆకామినీమ్రోల నిజము నడచుట కాతనికి నేకారణము కానంబడలేదు! "అది కవచము కాదు. కంకణ" మని యాతఁడు త్తర మొసఁగెను.

"ఇది ప్రేమచిహ్నమా యేమి? — మీకిట్టి పిచ్చి వేడుకఁజూపిన మదవతి యెవరు?"

ప్రశ్నకుత్తర మొసఁగక, "సుందరీ! నీసంపూర్ణ నామధేయము నాకుఁ దెలిపితివిగాదేల?" అని యువకుఁడామె నడిగెను.

"కొంత దెలిపియుంటినిగాదా? మీరో, మీ పేరును దెలుపనేలేదు. ముందుగ దానిని మీరెఱిఁగింపవలెను."

"నీ సంక్షేప నామము జస్టిన్‌యైనట్లు నాసంక్షేపాభిధేయము మేక్సిమ్!"

"ఓ? తెలిసినది. నాపదవినివినక, మీపదవినిదెలుప నిచ్ఛగించుటలేదు — అంటియేనా? నాసంపూర్ణనామము జస్టిన్ సార్జెంట్! మీపూర్ణనామధేయ మేమో యిపుడు తెలుపుడు."

"మేక్సిమ్ చర్జర్సు! వయసు యిరువది యైదేండ్లు. ఒకించుపైతృకసంపత్తి కలదు; ఇంకను పెండ్లికాలేదు. చరిత్రము పవిత్రమైనది — చాలునా యీ యుదంతము? నీముందు నే నేమియు నడఁపదలఁచుకొనలేదు."

"కాని వలయువృత్తాంతము నంతయుఁ దెలిపితిరిగారు. మీ ప్రణయిని యెవర్తుక పాలినుండి కంకణముఁ బడసితిరో ఆమె పేరేమో వివిపించితిరిగారు!"

నాకుఁ బ్రణయిని యెవర్తుకయు లేదు — నేనింకను యేయువతితోను స్థిరసంబంధముఁ గలుగఁజేసికొనలేదు."

"మంచిది సుందరా! ఇపుడు మీకంకణమును నేఁగోరుచో, దానిని నాకొసగుఁదురా?"

తన కాయమందలి ప్రతి రుధిరనాళమునందు నెవరో తుషార శీతలాంబువును వోసినట్లు యువకునకుఁ దోఁచెను! కంకణము కరమునుండి జారిపోయినయెడల, ఛిన్నహస్త రమణి నిఁక వెతకఁజాలుట యసాధ్యము. చోరాంగనఁ బట్టవలెనను నాస నాతఁడు విడువఁజాలకుండెను. మ్రోలనున్న సౌందర్యతిలకపై అతని కించుక సందియము కలిఁగెను!

యువకుని భావాంతరము నుపలక్షించి ఆకాంత యిట్లనెను. "నేను మిమ్ము నింబరీక్షఁ జేయుచుంటి నంతియే. నగ మిగుల వెలఁగలదియై యుండును. ఒక సామాన్యమానిని కోసరమై ఒక యపూర్వ భూషణమును ఒక యమూల్యాలంకారమును విడిచిపెట్టుటకు మీ మనసొప్పునా యని నేనుండే గ్రహించి యుండవలసినది."

"చాలు! చాలు!! అట్లు యోచించుచుంటివేల?" కంకణము నాపూర్వుల స్మృతిచిహ్నము గా కున్నయెడల —" అని యువకుఁడు సత్వర యుత్తరమొసఁగుచుండ నానారి ఆతనిమాట కడ్డువచ్చి "ఇఁక నూరకుండుడు. ఈపాటిదానికై మీరునాకు సమాధాన మొసఁగనక్కఱలేదు. నన్ననుసరించి మాగృహమునకు రావలెనని యపేక్షించితిరి. నడన సమీపమునకు మాత్రము వచ్చుటకు సమ్మతించితిని — మీరుకూడ నందుల కంగీకరించితిరి. కాని పదపడి నేఁటి యామిని

మానిలయమున మిమ్మాహ్వానింప వలెనని నేననుకొం — పోనిండు దానికేమి? మాయింటివఱకు మీరారా కిచ్చుకొనుచుంటిని. ఒకర్తు కను యీగంభీర నిశీథమునఁ గాల్నడకను వచ్చుటకు నేను సంశయించియే యుందును. ఎన్నఁడు నిలువీకి నే నిట్టిరేయి నిట్లునడిచి యుండ లేదు. ఈ మార్గమిట్లు నిర్మానుష్యమై — భయదమై యుండునని నే నూంఁదెలుఁగను. "

"నీవు పిరికిదానవు కావుగదా? ఇంత యుసలెందులకు? నిన్ను నడిత్రోవయందు వీడి నేఁ జనువాఁడనుగాను. భయమునకుఁ గారణ మేమియుఁ గానిపించుటలేదు."

"మీరు నవ్వకుందురుగాక! ఎవరో చీఁకటియందు మనల నను సరించి వచ్చుచున్నట్లు నాకనుమానము తట్టుచుండెను."

యువకుఁడు వెన్కకుఁదిరిగి జూచెను. కాని యెవరును గానిపింప లేదు. "ఏమైన విపాద మాపాదించునెడల నీప్రాణమునకు నాప్రాణ మడ్డువేయుదును. బాగుగ సమీపమునకువచ్చి నాస్కంధమును గట్టిగఁ బట్టుకొని నడువుము." అని యాతఁ డుత్సాహపూర్వకముగఁ బల్కెను.

"మీఅభయమునకు వందనములు — మీరు సమీపమందుండ నాకిఁక నడలేల? — అయితే నెచ్చలీ! మీ కంకణము నాచేతికిఁ బట్టునా!"

"కంకణము మాట నీవు మఱువఁజాలనట్లు తోఁచుచున్నదే! — దీని నిక్కంపు వృత్తాంతమును వింటివేని నీవు నాపై నెట్టి నెపమును వేయవు?"

"చాలు! చాలు! మీచెలిమి ప్రగాఢమైనదే! మీ కడ నే నింకేమియు వినదలఁచుకొనలేదు"

"సుందరీ! మరల మనల మిద్దరము గలసికొందుమో లేమో యెఱుఁగము. నా జీవన చరితము నతి సంక్షేపముగఁ దెలుపుదును

వినుము. అయినను నిముషములలో సంపూర్ణము ముగించివైతును."

"ఇత్తటి వినుటకు సంక్షేపవృత్తాంతమే బాగుగనుండును. — ఆహా! పథమంత నెంతయంధకారముగనున్నది!—విను వినుడు!— వెన్కబదముల యలికిడి యొల్లు వినబడుచున్నదో! నడువుడు! నడువుడు! వేగిరమే యడుగువేయుడు! త్వరలో నిలుజేరుదుము!" ముప్వుడు పురుషులుం కడువేగముగ వారి ననుసరింపసాగిరి! ఆదూరమున నంధకారములోం బదముల యలికిడి స్పష్టముగ వినంబడదొడంగెను. త్రోవ పూర్తిగ నపరిచితమైనది — గమ్యస్థానమెందో తెల్లముగాకుండెను. ఇంతదూరము నడచివచ్చి మరలుట కష్టము — దుస్తరము! తెరువున నెందుం జూచినను బండియేమియుం గానుపించుట లేదు. ఆయామందాసితో వచ్చుట మంచిపని కాదని యువకుండు లోలోనం జింతింపసాగెను! వెన్వెంట విషాదముం గొనివచ్చు నా రమణి నీక నెన్నడు జూడందలంపరాదని మేక్సి మనుకొనియెను. కాని ఆ ననంబోడి ప్రఫుల్లవదన మాతని హృదయమున నంకితమై పోయెను!

ఒకించుక దవ్వరిగిన పిదప సుందరి "అమ్మయ్యా! ఇప్పటికి నిరాపదప్రదేశమును జేరుకొంటిమి. ఈ త్రోవకుం బ్రక్క నున్నదే మా నిలయము. ఇంత దూరము పాటము సిడవలె నావెంట నంటి వచ్చినందులకు మీకు వందనములు. నిక్కముగ నేనెంతో యడలితిని. ఇంక సెలవు" అనియెను.

"నేం గూడ నీమందిరమునకు రావలదా?"

"వలదు!"

"ఏల వలదు?"

"ఇపుడు వచ్చిన ముప్పు వాటిల్లును!"

"నడువుము. మీయింటి గుమ్మముపఱకైన వత్తును."

ఒకించుక తడసి యువతి "నాకై మీరింత యలసి సొలసి యరుదెంచినందులకీ పాటి వేడుకోలును మన్నింపకుండు టనుచితము. మా కవాటము కడకు రండు" అనెను.

యువకుఁడు సుందరి ననుగమించెను. ఒక క్రొత్త మేడముంగల నిలిచి, ఆకాంత వెలుపలి తలుపు తాళము దెఱచెను.

"ప్రేయసీ! నిన్నుఁ జూచు రావలెనన్న ఈ గుమ్మము గుండా లోనికి రావలెనా?"

"నన్నుఁ జూడరండని మిమ్ము నేను వేడియుండలేదే!"

"వేఁడి యుండకపోవుట నిక్కమే? కాని రేపు రాత్రి నే నొకవేళ వచ్చునెడల నన్ను నీగుమ్మమునుండి దోలివైతువా!"

"దోలివైతునని నేఁ జెప్పుట లేదు. కాని రేపటి యుదయమందే నేను పేరిస్ నగరమును వీడి పోవుచుంటిని?"

"మరల రాని తలంపుతోనా?"

"కాదు. పదినేను దినములైన పిదప మరల వత్తును."

"మంచిది. అంత దనుక నీరాకకై వేచియుందును."

"అంత దనుక తడసినంతనే మీరు నన్ను నుఱచిపోదురు. మఱువకున్నను మీరు నన్ను మరలఁ గలిసికొన యత్నింపకుడు."

"ఈయొక్క విషయమున నేను నీయిష్టానుసారము వర్తింపను."

"వర్తింపక పోయిన యెడల గష్టము పాలగుదురు. ఒకవేళ నొక్కరే రాఁగోరుదురేని పదునేను దినములైన పిదప రండు. ఇఁక సెలవు!"

ఇట్లని కడు తత్తరమున నా తెఱవ అవ్వలిగుమ్మమునకుఁ దాళము వైచి నిమేషములో విద్యుత్తములీల గాఢతమసమున నదృశ్యయాయెను.

ఇంకఁ జేయునదేమియు లేక మేక్సి మందే నిలువంబడియుండి, ఆ సుందరి సౌధమును బాగుగఁ బరీక్షింపఁసాగెను. మేక్సిము మేడను

దేటిచూచుటచే అకస్మాత్తుగఁ బదముల యలికిడి మరల నాతని చెవులఁ బడియెను! వెనుదిరిగిచూచి వంతెనపై దాఁ జూచిన మూవురు పురుషులే తనవెనుక నరుదెంచుచుండుటాతఁడు గుర్తించెను. ఆ మూవురుగాక మఱియొక్కరుండు మేడయావరణ చుట్టుఁగల గోడదాపు నుండి అల్లనల్లనఁ దనవంకకు వచ్చుటాతఁడు గాంచెను!

యువకుని గుండియ లడలుచే నిండుకొనియెను. ఆతనికడ నే యాయుధము లేదు. తెగువునం దెవ్వరును లేరు. నల్వురచే నొకమాఱు చుట్టుముట్టఁబడినయెడల వట్టిచేతులతో నొక్కరుండు వారితోఁ బోరవలెను. ఆయర్ధరాత్రమున నెవరి సాహాయ్యముఁగాని పొందఁజాలుట యసంభవము. ఏదియో దుండగమునకుఁ దలపడనెంచియే వారలట్లు తఱుముకొని వచ్చుచుండిరని ఆతఁడు ముందే గ్రహించి యుండెను.

"సుందరి కౌశలముచే నన్నిచటికిఁ గొనివచ్చియుండునా? ఇందేమో దౌరాత్మ్య మున్నది — నవ్వి యూరకొనఁదగు విషయము కాదు. కొండవిఱిగి తలపైఁ బడినను కంకణము విడువక బట్టియుండవలెను. కాని — ఇది విభ్రమవలె నున్నది! వారలింక తఱుముకొని వచ్చుట లేదు. కాని గోడదాపునుండి వచ్చునాతఁ డీవంకకు మెల్లగ బ్రాకుచుండెను. ఆతని యుద్దేశ మేమో గనుపెట్టవలెను" అని యువకుఁడు తలంచెను.

మీక్సిము హృదయమున సాహసము లేకపోలేదు. అతఁడేల భిత్తిక దాపునుండి యరుదెంచుచుండెనో యెఱుఁగ నాతఁడు ముందునకు నడచెను. యువకుఁడు రెండు మూడడుగుల వైచినంతనే చీకటిలో మెల్లని స్వరమున నెవరో "మేక్సిముగారూ! నిలువుడు! నేను." అనిరి.

ఆశ్చర్యాన్వితుఁడై మేక్సిము "ఎవరు నీవు?" అనెను. ఎవరును ఉత్తర మొసఁగ లేదు. మఱుముహూర్త మందే గోడప్రాంతమునుండి ఛాయామూర్తి ఆతనిప్రోల కరుదెంచి నిలిచెను! యువకుఁడా యాకా

రమును గుఱుతించి విస్మయముతో, ఎవరు! — జర్జైటా! నీ విచటి కిపుడేల వచ్చితివి."

జర్జైట్ —(మెల్లని స్వరమున) — "గట్టిగ మాట్లాడకుడు. వారు మీ పోకడ నంతయుఁ గనుపెట్టిరి. నేను వారి గుసగుసలను వింటిని. వారు బందిపోటులు! వారి పాడువాలకములను జూడఁగనే గుర్తింపఁ జాలితిని."

"నన్ను మట్టుపెట్టుటయే వారియుద్దేశ్యమైనయెడల ఇంతవఱకు నూరకుండిరేల?"

"ఈదావునఁ బలువురు వసించుచుందురు. త్రోవయందలి యల్లరి విని అనేకులు పరుగెత్తుకొని రాఁగలరు కాని ఆముందుదారి పొంత కొంపలెక్కుడు లేవు. మీరాదిక్కుఁ జేరినంతనే మీపైఁబడ నా దస్యులు గమకించుచుండిరి! అందుచే నిప్పుడట్టులే నిలిచియుండిరి!"

"ఇపుడు చేయవలసిన దేమి? మఱియొక త్రోవఁబట్టినను వారు మరల నావెంటఁ బడక మానరు."

"కాని నేను మీచెంతనున్నంతసేపు ఆ చెనటులు మిమ్మేమియుఁ జేయఁజాలరు."

నీవంటి కసుగాయకు వెఱచి ఆకటికి వార లూరకుందురా?"

"మీరనినట్లు నేను కసుగాయనే యగుదును. కాని విషాదమందు జేతులు ముడుచుకొని యుండువాఁడనుగాను. ఒక్కపరుగునఁ బోయి సమీపమునఁగల కాఫీ హోటెలునుండి పదుగుర నొక్కనిముసములోఁ దోడ్తేరఁ జాలుదును. రాత్రి రెండుగంటలవఱకు హోటలు తెఱచియే యుండును. అచట నే నెఱిగినవా రనేకులు కలరు. ఇచటి యిరుగు పొరుగువారందఱు నాకుఁ బరిచితులే! మా యిల్లు సమీపమందే యున్నది."

"అట్లైన నీ మేడ ఎవరిదో నీ వెఱుఁగుదువా?"

"ఎఱుఁగను. కాని రేపు చీఁకటితోడనే వాకపుజేసి మీకుఁ దెలుపుదును, ఇంక నడువుదము పోదము."

"నడువుము. ఆదురాత్ము లేమిఃచేయఁగలరో చూతము"

బాలకుఁడు త్రోవఁదీసెను. సుందరి సౌధముదెస మేక్సిము మఱొక మాఱు విలోకించెను. మేడయంతయు దట్టమైన జీఁకటిచే గప్పఁబడి యుండెను. మిణుగురుమదు వెలుతురైన నందుఁ జూపట్టలేదు."

"బందెపోటులు మనల ననుసరించి వెన్వెత్తుకొని వచ్చుచుండిరి" అని జర్జెట్ మెల్లని స్వరమునఁ బల్కెను. మేక్సిము దస్యుల దుండగమున కెంతయు విస్మితుఁడై "వారలు పైఁబడఁదగు నదను జూచుచుండిరి కాబోలు" ననెను.

జర్జెట్: నేఁ గూడ నట్లే యనుకొనెదను. కాని మన మొకించుక సాగిపోజాలితిమేని ఆపదనుండి దాఁటిపోఁగలుగుదుము. కొంచెము దూరములోనే మా నాయనమ్మ గుడిసె యున్నది."

"నీ వచట నుందువా?"

"చిత్తము. మీరు మాయింటిలోఁ గొంచెము నేవు వేచియున్న యెడల నింతలో నేనొకబండి బిలుచుకొనివత్తును."

"నేను వెంటనంటి వచ్చిన సుందరిని నీ వెఱుగుదువా?"

"నేనామెను బాగుగఁ జూడఁలేదు. ఆపె నెఱుగుదు ననుకొనెదను. మీరు నేతువుదాఁటఁగనే మూవురు పూరుషులు మీ వెంట నంటి వచ్చుటఁ జూచితిని. వారి జాడఁ జూడఁగనే నా కెంతేని యబ్బురము, ననుమానము గలిఁగెను! తోడనే వారి వెంట నంటి సాగి వచ్చితిని. ఒకించుక దూరము చనినంతనే వారిలో నొకఁడు తక్కుంగల వారి నుద్దేశించి "ఒంటిగ నుంటఁజూచి యొక్కుమ్మడిని వానిఁ జుట్టి వేయవలె నని యనుట వింటిని."

"అట్లైన ముందే నీవేల నన్ను జాగరూకుఁ గావించితివిగావు?"

" అట్లొనర్పవలెనని యనుకొంటిని. కాని మీ వెంట నాడుది యుంటఁజూచి అట్లొనర్ప సాహసింప లేకపోతిని. అంతియగాక ఆయాడుది మీ వెంట నున్నంతసేపు వారు మీకాయము నంటరని నే గ్రహించియుంటిని. ఇపుడు కడు వేగముగ నడుగులు వేయుఁడు! ఆ దుండగులు వచ్చిపడిరి!

ఇరువురు కాలు కొలది బరువెత్తసాగిరి!!

" వింటివా వారి యడుగుల జప్పుడు? — ఆకూళలం కూడ పర్వెత్తు కొని వచ్చుచుండిరి." అని పర్వుచుండే మేక్సిము బాలకునితోఁబల్కెను.

" అట్లని నేను ముందే చెప్పియుంటిని — కాని బాబయ్యా! ఇఁక భయములేదు. అవిగో చూడుడు. రెండు దీపములు వెలుఁగు చున్నవి — అవి నిశ్చయముగ నేదిమో బండివియై యుండును. శకటము ఖాళీదై యుండును — ఏమోయీ బండివాఁడా బండిఁ గట్టెదవా? అద్దె గాక ఐదునాణెముల బహుమానము నిత్తును!"

బండి మానిసి బండి మరల్చెను. కడు తత్తరమున జర్జెటు బండి తలుపు తెఱచెను. మేక్సిము చివాలున నందులోనికి నుఱికి "నీవు కూడ రమ్ము!" అని బాలకు నుద్దేశించి పల్కెను.

" బాబయ్యా! ఇఁక భయము లేదు. వారు మరలి పోవు చున్నారు. ఇఁక లాభములేదని కాళ్ళకు బుద్ధిఁ జెప్పుచున్నారు!"

" బాలకా! ధన్యవాద మొసగుచుంటిని! నీ యుపకారమును నే నెన్నటికినిమఱువను! నేఁటి భీమణఘటన మెల్లపుడు జ్ఞప్తియందుండును!"

బండి యొడయఁడు బండిని బోనిచ్చెను.

X

పూర్వప్రకరణమున వర్ణింపఁబడిన యద్భుతఘటనము జరిగిన మఱు నాఁటి సాయంకాలము కొత్త యధ్యక్షుని నిలయమున విందొనర్చె

యాహ్వానింపబడిన యతిథులు చేరుకొనిరి. ఇతర వేళలందు రాబర్టు విందునకై వచ్చుచుండువాఁడు. కాని యీ పర్యాయ మాతని పరిచితవదన మందుఁ జూపట్టలేదు. ఆస్థానమునఁ దనవారు యానందము కూడ నాయువకునితో వంతక్రితమైనట్లు తోఁచెను. జూలుస్ విగనరీ విందు మందిరమునయుండెను. కాని హతభాగ్యుఁడైన నెవ్వాలి తలఁపు అతని చిత్తమును బీడించుచుండెను. ఎలిస్ యున్న యెడకుఁ బ్రక్కనే ఆతని ధ్యానము నిర్గిష్టమాయెను.

వర్జస్సు మనసుకూడ నేఁడు బాగుగలేదు. కూఁతు కూర్చిన తలఁపులెన్నియో ఆతనిస్వాంతము నావరించుకొనియెను. తాను తెలుపకున్నను నిక్కముగఁ దన కార్యవర్శి అత్తటిలేనందుల కా వృద్ధుఁడు మిగులఁ బరితపించుచున్నట్లు ఆతని ముఖలక్షణములు తెలుపక దెలుపుచున్నవి. ఇంటఁగల వారందఱికి రాబర్టు ప్రియపాత్రుఁడై యుండెను. ఆ యువకుని యాకస్మిక యంతర్ధాన మెల్లఱ నిరుత్సాహులఁ గావించివైచెను. రాబర్టు అపరాధియని గట్టిగనమ్మిన ముదుసలి హృదయము కూడ నవు డనుకంపముతో నిండిపోయెను. దానంజేసి కర్నలుబెరిమన్ పిడికిలియుండా నిరీహాయువకుఁడు పడకుండ నుండుగాకయని వర్జర్సు దైవమును బ్రార్థించుచుండెను.

విగనరీ ఒక ప్రక్కనిలువంబడి యుండెను. తేనీరు పాత్రఁగైకొని ఎలిస్ తానున్నయెడ కరుదెంచుటఁ జూడఁగనే ఆయువకుని యొడలు గగుర్పొడిచెను. యువతి ఆతని సమీపించి మెల్లని స్వరమున "రాబర్టు మీకైనను జాబు వ్రాయలేదా!" అని యాతనిఁ బ్రశ్నించెను.

వివర్ణముఖుడై విగనరీ, "లేదు. అతడు వెడలిపోయిన, పిదపనింకను ఏయుత్తరమును రాలేదు. పోవునాఁ డపరాహ్ణసమయమున మాత్రము కొలఁదిమాత్రపు పంక్తులనువ్రాసి ఒకచిన్ని కమ్మనాతఁడు నాయెడ కంపె" ననెను.

"తా నెందుఁ బోవుచుండెనో మీ కాతఁ డవుడు వ్రాసియుండెనా?"

"లేదు కాని ఎచటి కరిగినను నాకు దప్పక జాబు వ్రాయుదునని ఆతఁడు వాగ్దాన మొనరించెను."

"మీ కట్టిప్రకార మాతఁడు లేఖ వ్రాయలేదా? అట్లైన నాతఁడు ప్రాణములతో లేఁడా యేమి?"

"అట్లనుచుంటి వేల? ఉసురులతో నుండక పోవుటేమి? ఆత్మహత్యకు దలఁపడనని ఆతఁడు వచించెను. ఆతఁడు కాపురుషుఁడు కాడు.

"ఆత్మహత్యమాట ఆతఁ డెత్తియుండెనా యేమి?"

"లేదు. కాని ఆతఁడు పూర్తిగ హతాశుఁడై పోయెను. నీ తండ్రి కిని ఆతనికిని జరిగిన ప్రసంగమున—"

"నాకును ఆతనికిని పరిణయము కాఁజాలదని జనకుఁడు వచించి నట్లు మీ కాతఁడు తెలిపియుండెనా? నావిషయమున నాతఁ డేమైన మీతోఁ జెప్పియుండెనా?

"నీ జనకుని యుద్దేశమునకు నీవు సమ్మతి యొసగితివని రాబర్టు విశ్వసించె" నని విగనరీ ఇంచుక సంకోచమునఁ బల్కెను.

"నే నాతనిఁ బ్రేమింపలేదనియు నేఁగావించిన శపథము మఱచితి ననియు ఆతఁడు విశ్వసించి యుండెననుకొనెదను. అందువలననే కాఁబోలు ఆతఁడు నన్నొక మాఱైనజూడక ఇందుండి వెడలిపోయెను."

అంగీకార సూచకముగ విగనరీ తలయూపెను.

ఎలిస్ హృదయమంతయు నావేగముతో నిండిపోయెను. "రాబర్టు అపరాధియని మీరుతలతురా?" అని యామె కడునాతురమున విగ నరీని బ్రశ్నించెను.

"నేనట్లెన్నటికిని దలఁపను. రాబర్టు ద్రుచ్చుగాడు. ఈభీషణ ఘటనము రహస్యజాలమున నాచ్ఛన్నమై యున్నది. మున్ముం దీరహ

స్యము భేదింపఁబడక మానదు. నిక్కంపు చోరుఁడు పట్టుపడినపుడు సత్యము ప్రకాశము కాక మానదు."

"నేనా చోరుని వెతకి పట్టుకొందును. మీరు నాకుఁదోడ్పడుదురా!"

"నీవేమి చేయుమనిన దాని సానందపూర్వకముగఁ గావింతును. నాయనుంగు జెలిమికాదు నిర్దోషియని బుజువుఁజేయుటకంటెఁ బ్రమోద భూయిష్టమగు కర్జమేది?"

"అయ్యా! హృదయ పూర్వకముగ మీకు నా కృతజ్ఞతఁ దెలుపుచుంటిని. ఈవిషయమై నేను మఱొకలాగున యోజించుగానను గాను. కాని నేఁటి మీ సుపువులవలన నా భ్రాంతియంతయు నంతమాయెను. నేటినుండి మీతో బ్రగాఢమైత్రిఁ జరిగింతును. ఈ విషయమున మనమిర్వురము గలసి పనిఁ జేయుదము."

ఇత్తఱి మేక్సిము ఆ యాగారమునఁ బ్రవేశించెను.

వర్జసు — ఏమోయీ! ఈరాక యెచటినుండి?

మేక్సిము — మామయ్యగారూ! గడచిన బుధవారము విందునకై రాఁజాలనందులకుఁ జింతిలితిని. నాయొప్పమి సైరింతురా?

"నేడు పాపము తీరుబడిగానున్నావు కాఁబోలును?"

"తీరుబడి యెందులకుండును? నమ్ముఁడు నమ్మకపోండు — ఇంక నేను గడియారవు ముల్లువలెఁ బనిఁజేయుదును. పలికిమాలిన పనులకై వృథా కాలవారణ మాచరింపను."

"నీసుడువులను నేనెఱుఁగనా! నీకెట్టి కర్మాభిరతికలదో నాకుఁ దెలియదా? ఒకనాడు 'ఈపనిఁజేసితి' నని విశదీకరించి చెప్పుము.

"నిన్న దినమంతయు నడుమువంచిఁ ఒక్కమాటైన మెడయెత్తక ఒక్కవరుసగ గ్రంథకాలక్షేపముఁ గావించితిని. పవలంతయుఁ జదివి చదివి యున్నమీదట అలసి సొలసి, ఆరోగ్యముఁ గాపాడుకొనుటకై సాయం సమయమున నవ్వలికి వెడలిపోతిని. పలుతావులఁ దిరు

గుచుఁ దిరుగుచుఁ జాలదూరము సాగిపోతిని. పదంపడి ఎవరోకొందఱు దుండగులు నన్ను సమయింపఁ దలఁపడిరి !”

“ఊరక గలహములను బెంచుకొనుచు దారులఁబడి తిరుగుచుఁ గాలముఁ బుచ్చుచుంటివా ?”

“లేదు లేదు. రేఁబవళ్ళు చదువుచుఁ గూర్చుచున్న యెడల నారోగ్యమునకు భంగము కలుగునను భీతిచే నొకమాఱు వ్యాహాళికరిగితిని. అపుడు కొందఱు దుర్మార్గులు నా వెంబనంటి వచ్చిరి. అత్తఱి మీ బాలకుఁడు జగ్గెటునాకుఁ దోడుపడక పోయినయెడల నాపని యేమాయెడిదో చెప్పజాలను. ఆపేద బాలుని వేతనము నెక్కుడు జేయ మిమ్ము వేఁడుచున్నాను.”

“ఇది యెపుడు జరిగియుండెను ?”

“గడపున రేయి రమారమి రెండు యామము లగును.”

“అంతరాత్రివేళ బాలకుఁడు రాజపథమునఁ గ్రుమ్మరుచుండెనా ? జీతము హెచ్చించుటకు మాఱు నేనికఁ గుఱ్ఱని బనినుండి తొలగించివైతును.”

“మీరు వానిఁ దొలగించు నెడల నేనాతని నా యధీనమున నుంచుకొందును. అతఁ డూరక దారులందుఁ బడి క్రుమ్మరుట లేదు. తనపితామహి కడకు బాలకుఁడు పోవుచుండెను.”

“బాలకుని విషయమై బావ చెప్పినది నిక్కము. వాని వేతనమును హెచ్చించుటే యుచితము. పిల్లవాఁడు బుద్ధిమంతుఁ” డని ఎలిను వచించెను.

వర్జర్సు — విగనరీ ! నీయభిప్రాయ మేమి ? కుఱ్ఱవాఁడు బాగుగా పని జేయునా ?

విగనరీ — ఆతనికి విరుద్ధముగ నేఁ దెలుపవలసిన దేమియు లేదు.

వర్జర్సు — ఒక గొప్ప యింటి యామె యనురోధమున నే

నాతనికిఁ బనిఁ యొసఁగితిని. మీరందఱు కాంత పేరు వినియే యుందురు. ఆయువతి మన బేంకునందుఁ జాల మొత్తమును నిల్వ వైచియుంచెను. ఆ పరిచయమువలన నామె బాలకుని విషయమై నాతోఁ జెప్పియుండెను. ఆమె యత్యంతైశ్వర్యశాలిని ఆ యువతి బాలకుని గడు నవలీలగఁ బోషింపఁ జాలును. కాని ఎల్లప్పుడు పేరిసు నగరమున నుండననియు బాలకుఁడు పితామహియొద్ద నలవాటు పడిన వాఁడగుటచే ఆమెను విడిచియుండజాలననియు అందుచే నాతఁడు మీకడఁ బడియున్న యెడల సుఖించుననియు నా గమణి నాతోఁ జెప్పెను. నేనామె వేడికోలును జెడచెవిఁ బెట్టజాలనైతిని. ఆ మహిళ పేరు కవుంటెస్ ఇయ్యల్టా."

"బాలునిపై కౌంటెసున కంత దయ యెందులకు?"

వర్జర్సు — ఆతని జనకుఁ డొకప్పు డాకాంత తండ్రి ప్రాణములను రక్షించియుండెనఁట. అప్పటినుండియు బాలుని కుటుంబము యెడ నామె మిగులఁ గృపఁ గలిగియుండెను."

"ఆ రమణి కడు సుందరియా?" అని ఎలిస్ ప్రశ్నించెను.

వర్జర్సు — అట్టి యుందకత్తియను సాధారణముగాఁ జూడఁ జాలము.

"ఆమెకు పెండిలి యైనదా?"

"పెండ్లియైనది; కాని ఆమె పతి వరమపదించెను. విధవయగుడు ఇపు డాయామది స్వతంత్రయైయుండెను. ఇటీవలనే పరిభ్రమణార్థమై ఆపె ఇటలీ పోయియుండెను. పదునేను దినములలో దిరిగివచ్చును."

మేక్సిము — ఇది కడు నబ్బురముగ నున్నది. పేరిసు నగరమందలి సౌందర్యతిలక లందఱు కట్టుగట్టి నట్లు లోకే సమయమందే నగరమును వీడి చనిరి!

"మీ మాటలను యోజించి చూడ మీ రెవరో యొక సుందరాంగి వలపులోఁ జిక్కినట్లును ఆమె యవ్వలి కరుగుటచే విరహవేదన

ముచుఁ దాము కుందుచున్నట్లును బోధపడుచున్న" దని కేమూరెటను వింధారగింప వచ్చిన ఒక యువకుఁ డనెను.

"ఏమి!—అట్లని నన్ను ద్దేశించియే యనుచున్నారా! నే నే యాడు దాని వలపులందును జిక్కుకొనలేదు."

"జాగ్రత! క్వాంటెస్ ఇయల్టా ఎంతటివారి శిరములనైనఁ ద్రిప్పి వేయఁజాలును!"

ఉపాధ్యాయిని— (ఎలిసు నుద్దేశించి)— అమ్మా! ఇంచుక గానామృతముచే మా వీనుల నింపవా?"

"బానా! మన మిద్దఱము కలిపి గాన మొనరింతము రమ్ము." అని ఎలిస్ మేక్సిము నుద్దేశించి పల్కెను.

మేక్సి మాపె వేఁడికోలును ద్రోసివైవఁజాలకపోయెను.

విశాలమైన నాయాగారమున నొక వంకఁ గల పియానో (గాన జంత్రము) చెంత కరిగి ఇద్దఱు రించుక సేపు గాన మొనరించిరి. పదం పడి తమ రాగాలాపము వీడి సంగీత యంత్రమును ప్రయోగించుచు మృదుస్వరమున నాయిరువు రిట్లు ప్రసంగించుకొనిరి.

ఎలిస్ — నీతో నొక ముఖ్యవిషయము గుఱించి ప్రసంగింపఁ గోరు చుంటిని.

మేక్సిము — ఆ దేమి?

"నీకును విగనరీకిని జాల చెలిమి యున్నదికదా?"

"అవును, అతఁడు నాయంతరంగ మిత్రులలో నొకఁడు."

"నే నాతని విశ్వసింపవచ్చునా?"

"నీ భావము నాకు బోధపడలేదు."

"దైవోపహతుఁ డగు అతని నెయ్యు నొకని రక్షింపఁ బూను కొనిన యెడల విగనరీ సాయ మొనరింపఁ జాలునా?"

"నిక్కముగాఁ దోడుపడఁజాలును! నేనాతని బాగుగ విశ్వసింతును."

"మంచిది. రాబర్టు నిర్గోపియుని నేను ఋజువుఁ జేయుదును. హృదయపూర్వకముగ నాయుద్యమమున విగనరీ నాకు సాయపడునా?"

"ఏమీ! రాబర్టు నిర్గోపియా! ఆతనియెడ నీకట్టి సమ్మానమున్నదా?"

"అందు నీకేమైన సందియమున్నదా?"

"రాబర్టును నీవు ప్రేమించుచుంటివా?"

ఎలిస్ — (ప్రగాఢస్వరమున) నిక్కముగ నే నా యువకునిఁ బ్రేమించుచుంటిని. అంతియగాక ఏముహూర్తమున ఆతనిపై నీ యపనింద పడియెనో ఆముహూర్తమునుండి ఆతనిపై నాకుఁ గల ప్రణయము మఱింత ప్రగాఢమైనది. ఆతనిఁ దక్క నేనిఁక నెన్నఁ డెవరినిఁ బ్రేమింపజాలను.

"నీస్పష్టోక్తులకు మిగుల సంతసించుచుంటిని. అతని యెడ నాకెట్టి విద్వేషము లేదు. అతఁడు చాల పెద్దమనిషి యనియే నాయూహ. విగనరీ కూడ నాయట్లే యూహించుచున్నాఁడు."

"మిత్రుని దోషము బాప జతనమొనరింతునని ఆతఁ డింతకు మున్నే చెప్పియుండెను."

"విగనరీ యుదారపురుషుఁడు. ఆతఁడు మిగుల నుత్తముఁడని నీవు కూడఁ గ్రమక్రమముగ నెఱుఁగ జాలుదువు."

"ఆతఁడు నాకు సాయము సలుప నంగీకరించెను. అందుచే నే నాయువకు నెడఁ గృతజ్ఞనై యుందును."

మేక్రిమ — (ఒకించుక యోచించి) రాబర్టు నిర్దోషియుని ప్రమాణ మొనరింపఁ గంకణముఁ గట్టుకొంటివా! ఈకార్యము సులభమైనది కాదుసుమీ!

"కాకున్న నేమి? ఆతని సమ్మానమందు నా సమ్మాన మడఁగి యున్నది — ఆతని మానాభిమానములందు నా మానాభిమానములు నిహితములై యున్నవి. అతడు నా వాగ్దత్తవల్లభుఁడు."

"రాబర్టిట్టి దుస్థితిలో దవులుకొన్నను నీవాతని బరిణయమాడఁ దలఁచుచుంటివా?"

"నిక్కముగ నట్లే!"

మరదలి సాహసమునకును అవ్యాజప్రణయమునకును మేక్సిము కడుంగడు నబ్బురపడియెను. ఆయువతి చరిత్రయం దీ దృఢధృఢత యున్నటు లీవఱలో నెన్నఁ డాతఁడు విశ్వసించి యుండలేదు."

మేక్సిము – మీ యిరువురకుఁ బెండిలి యగుట యసంభవము. ఆతఁ డిత్తఱి ఏసీమయం దడఁగి యుండెనో ఎవ్వ రెఱుఁగుదురు? రాబర్టు ఇఁక నెన్నఁడు బ్రాన్సునకుఁ దిరిగి రాడు.

ఎలిస్ — (దృఢస్వరమున) నా ప్రాణపతి ఇందే యుండెను? పేరిసునగరము వీడి ఆతఁ డెందును యరుగలేదనియు అట్లాతఁ డరుగఁ డనియు నొక్కి వక్కాణింపఁ గలను. ఆతఁడు వంచింపఁబడెను. నేఁ బ్రతిజ్ఞాభంగ మొనరించితినని ఎవరో దురాత్ము లాతనికిఁ దెలిపి యుందురు! ఆ కినుకచే నాతఁ డీ సౌధమువీడి వెడలిపోయెను. పేరిసు నందే ఆతఁడున్నాఁడు.

"అట్లయినచో తన నిర్దోషత్వమును ఋజువుఁ గావించుకొనుట రాబర్టు విధియై యున్నది. అతఁడేల ముందునకు రాలేదు?"

"తన తలపైఁ జౌర్యాపరాధము పడినట్లే ఆతఁ డెఱుఁగడు."

"అవును నీవనినది నిక్కమే. మామయ్యగారీవిషయముఁ బోలీసు వారికిఁ దెలుపలేదు. ఈయుదంతము నెవ్వరు నెఱుఁగరు. మంచిది. నీవు నాపై భారము వైచితివేని ఆతఁడు నిరాపరాధియని ఋజువుఁ జేయ యత్నించెను."

"నీవుకూడ మాకుఁ దోడుపడుదువా? నిక్కమేనా?"

"నేను నిక్కమే వచించుచుంటిని. కాని కొన్ని ప్రమాణములు రాబర్టునకుఁ బ్రతికూలములుగఁ బ్రబలములై యున్నవి. ఇనుపపెట్టె

యందు ముప్పదినాల్గులక్షల రూకలున్నట్లును ఆపైకమునుండి ఏబది వేల రూకల నోట్లుమాత్ర మపహరింపఁ బడినట్లును నీవెఱిగియే యుందువు. రాబర్టునకు విరుద్ధముగ నిది బలమైన ఋజువుగఁగన్పట్టు చుండెను! సాధారణ చోరుఁడైనయెడల పెట్టెయందున్న విత్తము నంతయు హరించియే యుండును!"

"ఇం దాతనికి బ్రతికూలముగఁ బ్రమాణమేమియు గోచరించుట లేదు. ఏబదివేల రూకలనోటులను రాబర్టే అపహరించెనని ఏలతలంప వలెను?"

"నీవనిన ట్లందులకుఁ దగు నిదర్శము లేదు. కాని రాబర్టు నిరపరాధి యని ప్రమాణమొనరింపవలెనన్న చౌర్యముయొక్క యుద్దేశ మేమై యుండునో గ్రహించు టవసరము. ఏబదివేల రూకలతోఁబాటు బెరిషప్ దొర పత్రములపెట్టె యొకటి హరింపఁబడెను."

"దానిమూలముననే రాబర్టు దోషరాహిత్యము బాగుగ ఋజువు కాఁబడును. ఒక విదేశీయుని, ఒక యపరిచితుని కాకితములవలన నాత నికిఁ జేకూరు ప్రయోజనమేమి?"

"అవు నట్లే కాని, రాబర్టు జనకుఁడు రష్యాదేశ మందుండు పేరిసు సచివునొద్ద నుద్యోగిగా నుండెననియు ఆసీమవాస్తుఁడగు నెచ్చెలి నెవనినైనఁగూడి రాజకీయ పత్రములను రాబర్టు దొంగిలించి యుండు ననియు బెరిషప్‌దొర యనెను."

"ఈయభియోగమునం దెట్టి మూల్యమును లేదు. రాబర్టును విలోకింపజాలని కతన కర్నలీనేరము నాతనిపై మోపెను."

"రాబర్టుపై ఆదొరకెట్టి పగయు లేదు. అయువకునియెడ నీద్వేషము కర్నలు కెట్లుపుట్టును?"

"రాబర్టు నన్నుఁ బ్రేమించియుండెనని ఆదొర యెఱుగును. నాకేలుబట్ట నాతఁడుకూడ నభిలషించెను."

"అట్లైనఁ బ్రణయ ప్రతిద్వంద్వియని రాబర్టుపై కర్నలు లీదోషము నారోపించియుండునా?–అవు నట్లే కావచ్చును. ఇది యసంభవమును కాదు. అతఁడు రాబర్టును వెదకుచున్నట్లు నీ వతిగి చేయియుండునా."

"ఎఱుఁగను. అట్లని నే నీవఱలో వినియుండలేదు."

"రాబర్టును వెదకి పట్టుకొనుటకై కర్నలు పేరిసునుండి వెడలి చనెను."

"నిన్నటి దినమునఁ దురగమెక్కి ఆతఁడు రాజపథమునుండి చనుట జూచితిని. అట్లైన నాతఁడు తిరిగి వచ్చియుండును."

"రాబర్టు నాదారి వెదకి పట్టుకొనినయైన నుండవలెను. లేక ఆతని వెదకు ప్రయత్నము వీడినయైన నుండవలెను."

మేక్సిము నూరకుండుమని ఎలిస్ కనుసన్న గావించెను. వర్జరు వృద్ధభృత్యుఁడొక తాళవృంతముఁ గొనివచ్చి "అమ్మా! వీవనఁ దెమ్మంటిరి గదా! ఇదిగో!" అని దానిని గానజంత్రముపై నిడి భావయుతాపాంగము నాయువతిపై సారించి పిదప నలువలనులకు జాగరూకుఁడై జూచుచు అవ్వలికి దాఁటెను."

వీవనక్రింద నేదోయొక లేఖ యున్నట్లు మేక్సిమున కనుమానము తట్టెను. తనపొంతఁగల రమణి రహస్యముగ నిట్టు లెవరితోడనో ఉత్తర ప్రత్యుత్తరములు నెరపుకొనుటగాంచి ఆయువకుఁడు హతబుద్ధియై పోయెను. మేక్సిము ముఖము విలోకించి ఆచాన ఆతని భావమును గ్రహించి కోమలస్వరమున "ఆతని జాబు" అనెను.

"నేఁగూడ నట్లే యనుకొంటిని. ఆముదుసలి అట్లైన నంతయు నెఱుఁగునా!"

"జోసెఫ్ నాకు నుగ్గుపాలొసఁగి మిగుల గారాబమునఁ బెనిచెను. రాబర్టుయెడ ఆతనిభక్తి విశ్వాసములు మెండు. నామనసును బీడించు నగులునాతఁడు గ్రహించి ఎట్టులైన నాపాణిగ్రహీ పత్రముగొని వత్తు

నని మునుపటి సన్న నాతోఁ జెప్పియుండెను. తండ్రి వృద్ధతనముగ నాకుఁ గొన్ని సుఖించుమని అతఁడి గట్టిగనమ్మినట్లు లేదు. ఈ లేఖవలన సంశయము తెల్లమగుచున్నది. ఆమరణము నేను పరంత సంతాపమున దినములు గడుపవలెనో లేక ఆశాన్వితుఁడనై యుండవలెనో ఈ కమ్మ వలనఁ దెల్లమగును — బావా! జాబును నిప్పునందు ఇడువుము!!"

"నేనెట్లు చదువుదును? మీ ప్రణయ పత్రమును నేను కట్టుఁ జెల్లునా?"

"ఏమియు సంశయింపకుము — నా మానసికావస్థను బాగుగ గ్రహించియుంటివేని నే జెప్పినట్లాచరింపుము. పీవన నాకొనఁగుము. తోడనే నాసిక్రిందనున్న జాబును దీసికొని పఠనమందిరము జొచ్చి దానిఁజదువుము — శంకింపకుము. చదివి నా ప్రాణసఖుఁడు నాకు దెలుపక చనునంతులకు సంతోషజనకముగు హేతుకముఁగాంచి అతఁడు నిర్దోషియని గ్రహింపితి నేని ఉత్తరమును తిరిగి నాకిచ్చి వేయుము. అట్టి సానుకూలభావ ముందుఁ జూపట్టకున్న యెడల, తోడనే ఆకమ్మను అగ్నియందు బడవేయుము. అది యున్నది లేనిది నీ ముఖము చూడఁ గనే గ్రహింపఁజాలుదును."

మేక్బెత్తు దులకు సమ్మతిఁ దెలుపకమున్నే, ఎలిసు లేచి నిలిచి పీవనఁ గైకొనెను. వర్జర్సు తననుదేవన కరుదెంచుటఁజూచి, యువకుడీక యోజింపక, ఇష్టములేకున్నను ఉత్తరమును దీసికొని కౌశలమున దానిని దన యంగీజేబునం దుంచుకొనెను.

వర్జర్సు — మేక్బెత్తూ! నీవిఁక పఠనాగారములోని కరిగి ఇంచుక విశ్రమింపుము. ఎంతసే పిచటఁ గూరుచుందువు?

యువకుని కిఁక వేఱుతెరవు తోపలేదు. వ్యాకులాయితచిత్తుడై బాష్పపూరిత లోచనుడై తనదేవ ఎలిస్ దీనంపు దృక్కుల సారింప గనే అతని హృదయము జాలిచే నిండిపోయెను. బిఱాన బఠనమంది

రముసొచ్చి యందొక్కరుండు నొక్కమూలఁ గూరుచుని జాబు విప్పి దాని నాతఁ డిట్లు చదువదొడఁగెను.

"ప్రేయసీ! నిన్ను నేను నా ప్రాణముకంటె మిన్నగఁ బ్రేమించి యుంటిని. ఇప్పుడుకూడ నీయందు నాకుగల యనురాగ మంతరింపలేదు. నీవుకూడ నన్నుఁ బ్రేమించితివని నమ్మియుంటిని — కాని నీవు నీ ప్రతిజ్ఞను పాలన మొనరించుకొనఁగలవని విశ్వసించి భ్రాంతిఁ బడిపోతిని. నీవతులైశ్వర్యోపేతవనియు నేను నిరుపేదననియు నీజనకుఁడు నాకు బోధపఱచెను. నీవు నీతండ్రి ముదల ననుసరించి వర్తించుదానవు. ఆతనినుడువు లాతని దృఢనిశ్చయమును తెల్లముగ వ్యక్తీకరించినవి. అందుచే నాయాన యడియాస యనినమ్మి మీ తావునుండి వెడలివచ్చి తిని. ఫ్రాన్సుసీమను బూర్తిగఁ ద్యజించుటకు మున్నొకమాఱు మాతృ సమాధి మూలమున సాగిలపడవలెనను వాంఛ గలుఁగ మా స్వగ్రామ మునకుఁబోతిని. నాజన్మస్థానమున — నాశైశవ క్రీడాంగణమున రెండు దినములుమాత్ర ముంటిని! పేరిసు నగరమునకు మరల నేలవచ్చితినని నీవు యోజింపవచ్చును. నాదుర్బలతఁ గాంచి నీవు నవ్వవచ్చును. నీజన కుఁడొకవేళ నన్ను మోసగించెనేమోయని సంశయించి నీదెసఁ బ్రాకు నాశాలతికను నాహృదయ నికుంజమునుండి తొలగింపఁజాలనైతిని. నీజనకునియాజ్ఞ నుల్లంఘన మొనరింప నీవు సాహసింపకున్నను నన్ను నీవు బొత్తిగ మఱచియుండలేదని భ్రమించి నిన్నొకమాఱు జూడఁ జాలుదునని యాశించి మరలఁ నీనగరమున కరుదెంచితిని. గడచినబుధ వారమునాఁడు నీవు 'ధర్మమందిరము' న కరిగినపుడు నేను నీసమీప మందే నిలిచియుంటిని. నీముదుసలి భృత్యుఁడు నాకాతావునఁ గాని పించెను. పొరపాటునకైన నెవరును నన్నొకపరియైనఁ దలఁపలేదనియు నీవుమాత్రము కన్నీరు మున్నీరుగా విలపించుచుంటివనియు ఎనలేని హృదయయాతనమును సహించుచుంటివనియు నేనావృద్ధునివలనవింటిని.

"అప్పుడు నీకడ కొంత కష్టము వ్రాయుటవలె నను వాంఛ కలుఁగ దీనిని లిఖించి నీకిమ్మని నీభృత్యుని కరముల నిడితిని. నేను నీపై నెట్టి నేరము మోపుచుండుట లేదు. నా[illegible]ల నీవొనరించిన ప్రతిజ్ఞను మదిఁ దలఁచి, తచ్ఛపథాశృంఖలములం దాబద్ధవై యుండుమని నిన్ను నే నిఁక హెచ్చరింపను. మన మిర్వురము నిఁక కలియఁ జాలము. ఎవరికిని నేమియుఁ దెలుపక అకస్మికముగ వచ్చినందులకుఁ దగు సమాధానము నొసఁగక నేను దాస్యాంతర సీమ కరిగితినేని నిస్సంకోచముగ నీవు నన్నే నగింపవచ్చును. నీవలని జుగుప్సను నేనెన్నఁడును సహింపనేరను. నే నేల మీాతావునుండి యరుదెంచితినో యెఱుంగఁ గలిఁగితివేని నాకిఁక వేఱుపాయము లేదని యూహింపఁ జాలుదువు. రేపటిదిన మపరాహ్ణము మూఁడుగంట లప్పుడు 'వయుడికెలోను' నందు నీకొఱకై వేచియుందును. నీయుపాధ్యాయినిని వెంటఁగొని రాదలఁతువేని అక్లేరమ్ము. ఒకటి రెండుమాటలను మాత్రము చెప్పుదును. నీయుపాధ్యాయిని సమ్ముఖమందే యుండును. నేనెట్టి యనుచిత ప్రశంగమును గావింపను. నీవచటికి రాని యెడల వేరిను ముఖమును మరల నీజీవములతోఁ జూడనని యొట్టు వెట్టుకొని నేనచటికేని వెడలిపోదును!

ఇట్లు

ప్రియపాత్రుఁడు, రాబర్టు.

జాబును బూర్తిగఁ జదివి మేక్సి యిట్లు వితర్కింపదొడగెను. "ఏమి విచిత్రప్రేమ పత్రము! ఈపెద్దమనిషి తన యొప్పమి నొప్పుకొనుచు, దన ప్రణయిని జూడ నభిలషించుచుండెను. నే నేల మీాతావునుండి యరుదెంచితినో యెఱుంగఁ గలిగితివేని, నాకిఁక వేఱుపాయములేదని యూహింపఁజాలుదు" వని యాతఁడు స్పష్టముగ వ్రాయుచుండెను. ఈయొక్క నుడువునందే ఆతని యపరాధమంతయుఁ బ్రకాశ మగుచుండెను. హా! ఎలిసూ! నీ కెట్టి దుస్థితి

ప్రాప్తించుచున్నది! ఆ నిరాశాగారములను నెట్లు నీవీనులు గ్రోయు దును! ఇపుడు నే నేమి చేయుదును! కష్టాకు నగ్గిపుట్టించి బుగ్గి జేయుమని ఆని చెప్పెనే! అట్టే యొనగించి ఆ గాలన యునిస్ యెడ కరిగినంతనే, నా గౌరవము జారిపోయి డనే ఆమె యింతయు గ్రహింపజాలును. సహృదయమైన దుఃఖమూచే నా మొ ఆనుచేయిననైమో పోవునేమో కదా! ఎట్లు కోపిష్ఠియై యుండెను. కాని సంశయసం భ్రమ జనితమగు నా మనో కర్మము ఖర్మము నాలేదు! ఒకనాడు నీకును సమం జేజేని గంభీరగహాస్యము కహిం కష్టించుచుండును. కష్టమునందలి భావయందు నేరస్థుని ధోరణి ఏమియు లేదు. అది యపరాధి భావమవలెఁ గన్పట్టుటలేదు. ఆహా! ఒక్క పదినిమిషము లామెతో ప్రసంగించు నదను లభించిన బాగుండును గదా!

మేక్సిము చింతాస్రోతమున కంకిలి కలిగెను. మస్తకమును జేయివైచుకొని ఆతఁ డించుక సేపూరకొనియుండెను. ఆకస్మికముగ నాయువకుని యోష్ఠమున హాసనరేఖ కన్పట్టెను. "మంచిది రేపటి దినము నిరూపితస్థానమున నే నాతనికై వేచియుండి, రాబర్టు రాగనే ముందుగ నే నాతని మోల సాక్షాత్కరించి, అన్ని విషయములు నాతని కడనుండి తెల్లముగ నెఱుఁగుదును. ఆతఁడు నిర్దోషియని తెల్లమగుచో, నపు డిరువురము కలిసి నిజమైన దొంగను బట్టఁ బ్రయ త్నింతుము. ఈయుత్తరము వెలిసుపకు పురలి యిత్తును. ఉపాధ్యా యిని కూడ నుండును. నేను కూడ వెలిను సకటమున నుందును. ఇఁక సంకోచము గాని అడలు గాని యెందులకు?"

విగనరీ యపు డాయాగారమునఁ బ్రవేశించెను. అతని యాననమున దరహాసచంద్రికలు నూపట్టెను.

మేక్సిము — మిత్రమా! ఏమైన దారి కన్పట్టెనా!

"ఏదారిని గుఱించి గాని ఇపు డేమి తెల్పుదును? ఎలినునకును

నాకును జాలిసేవ ప్రసంగము జరిగియుండెను. ఒకించుక విశ్రమించితివి కనుక చేసికొం బుచ్చుకొనుటకై రమ్మని నిన్నామె పిలుచుచుండెను."

"మంచిది నడువుము."

తోడనే వా రిద్దరును ఎలిసుయున్న గదిం బ్రవేశించిరి. ఆయువతి ముఖపుండరీకము ప్రఫుల్లమై చూపట్టినను, ఆమె యంతరంగమున నావేగ యుత్తేజనములకును, ఆశా నైరాశ్యములకును దారుణమగు ప్రవిదారణము జరుగుచుండుట మేక్సిము కనిపెట్టెను. ప్రసన్న దృక్కుల నాపల్లవోష్ఠివదన వనజమునం బఱపి, ఆమె వంక కరిగి, ఏరికిని దెల్లము గానటులం గడునేర్పున జాబు నాతండా నెలంత కరములం దిడెను.

"చదివితివా? అతండు నిర్దోషి కాడా?" యని మృదుస్వరమున నెలిసు యనెను.

"నీయుత్తరము నీవే చదువుకొని యోచించికొమ్ము. నే నశ్రాంతము నీమంగళము నాకాంక్షించువాఁడ నను విషయము విస్మృతింపకుము."

ఏలిస్ అల్లన నందుండి నిష్క్రమించెను. మేక్సిము కూడ నవ్వలి కరిగెను. వెలుపలి గుమ్మము పొంత వృద్ధభృత్యుఁడు జోసెఫ్ నిలువంబడి యుండెను. "అట్లైన నేమోయీ! రాబర్టు పేరిస్ నందే యుండెనా?" యని మేక్సి మాతనిం బ్రశ్నించెను.

"నే నెఱుంగనండి బాబయ్యా!" అని వినయపూర్వకముగ నాతండనెను.

ముదుసలినుండి ఏమాటం గాని వెలిదీయుట శక్యముకాదని మేక్సిము గ్రహించెను.

## ౬

పేరిసు వాసులు సాధారణముగా నొకించుక ఎండయెక్కిన గాని శయ్యల విడిచి ఈవలికి రారు. ఉదయము తొమ్మిది గంటలకు

ముందుగ నేకాఫీ హూటలునందును నెవరును జేరుకొనరు. గత ప్రకరణమున నుల్లేఖింపఁబడిన ఘటనము జరిగిన మఱునాటి ప్రభాతమున నొక యువకుఁడు రుదేరఫాపల్లెయం దొక చిన్నకాఫీ యంగడిఁ బ్రవేశించెను. అపుడింకను అచటి కెవరును రాలేదు. యువకుని వలువలు కడు శుభ్రముగనుండెను. కాని ఆతని వేషమున నించుకైన దంభము కనఁబడుచుండుటలేదు. అందెవరును లేకుండుటచే నీవలగల ఒక యాసనముపై నాతఁ డాసీనుఁ డాయెను.

సమ్ముఖమందలి మేజాపై ఆనాఁటి వార్తా పత్రిక పడియుండెను. పత్రిక నందుకొని యువకుఁడు దానిని చదువదొడఁగెను. అకస్మికముగ నాతని దృష్టి ఒక విజ్ఞాపనపైఁబడెను. జేబునుండి తన నోటుబుక్కు నీవలికిఁ దీసి, రాబట్టా విజ్ఞాపనము నందు నకలుగావించుకొనెను —

"అమెరికా వాణిజ్య విజ్ఞాపనము — వ్యవసాయవృద్ధికిఁ గాని లేక గనులఁ ద్రవ్వుటకుఁగాని లేక శిల్పసామగ్రిని నిర్మించుటకుగాని వలయు విత్తము నెవరేని పెట్టుబడి పెట్టునెడల గావలయు వివరముల నన్నిఁటి వెంటనే తెలుపుదుము. ఈకార్యములు కడుంగడు లాభ యుతములు. వీనిలో దేనికైన గండగు వారికి వాణిజ్యఫల మటుండ, గొన్ని యున్నతోద్యోగము లీయఁబడును. పరిశ్రమమున కోర్చి, బుద్ధియుతుఁడై యుత్సాహపూర్వకముగఁ బని సలుపఁజాలు వ్యక్తికిఁ దగు వేతన మీయఁబడును. పర్యటనమునకు, పథవ్యయమునకు నగు వ్యయమును కంపెనీవారే భరింతురు. వాణిజ్యమునకు గడఁగు నాతఁడు పెట్టుబడి మొత్తమును ముందే యొసఁగవలెను. హేవర్, హేంబర్గు, లివర్‌పూల్ మున్నగు పట్టణములందును, అమెరికాయందలి ప్రధానసగరములందును కంపెనీవారికి శాఖలు కలవు. నెం 44 రు రుదెలావమెల్, పేరిసు అను విలాసమున బ్రయురుదొరయొద్దకు దరఖాస్తు

బంపవలెను. పగలు తొమ్మిది పండ్రెండు గంటల లోపున దొర దర్శనము దొరకును."

ప్రసన్నచిత్తుఁడై యువకుఁడా సకలమును అంగీజేబునం దిడుకొని అంగడినుండి అవ్వలికి అరిగెను. తలపైనున్న టోపీ నాతఁడు మఱింతముందునకు, — నొసలు మీఁదికి లాగుకొనెను. అత్తఱి వర్జర్సు కొఠీ యుద్యోగులలో నెవరైన నాతని విలోకించియున్న యెడల, ఆతఁడంతకుముందు న్నావృద్ధుని యధీనమునఁ గార్యదర్శియైయున్న యువకుఁడే యని నిముసములో గుఱుతింపక పోవువారు కారు.

రాబర్టు యాకృతి కతిపయదినములలో మాఱిపోయెను. ఆననము వివర్ణమైపోయెను! కన్నులు లోఁతుఁగలగుంటలవలెఁ దోచుచుండెను! విషణ్ణత, యుత్కంఠచిహ్నములు ముఖమండలమునఁ బరిస్ఫుటమై యున్నవి! ఒకించుక సేపటిలో రాబర్టు నెం 44 రు ఇల్లు సేరెను.

బ్రయరుదొర మూడవయంతస్తున నుండెనని ద్వారముకడ విని రాబర్టు పైకి బోయెను. ఘంటాధ్వానము విని ఎవరో తలుపు దెఱచిరి. బ్రయరుపేరు చెప్పినంతనే ఆతడు రాబర్టు నొక యాగారము లోనికి గొంపోయెను. మిగుల బ్రౌఢుండగు నొక పెద్దమనిషి అత్తా వునఁ గూరుచుని పనిఁజేయుచుండెను. ఆతని ముంగలఁగల మేజాపైఁ బత్రములెన్నో స్తూపీకృతములై యుండెను. ఆగారమంతయు నలంకృతమై యుండెను. గదియందలి కచేరి యుపకరణములు నూతనములై కడు నందముగ నమరుపఁబడి యుండెను.

రాబర్టు — అయ్యా! బ్రయరుదొరగారు తమరేనా!

"చిత్తము. తమకేమి కావలయును?"

"నేఁటి పత్రికయందు మీ విజ్ఞాపనమున అమెరికా —"

"ఓ! దాని వివరముల నెఱుఁగఁ గోరుచుంటిరా? ఇపుడే తెలుపు చుంటిని. కేలిఫోర్నియో, మెక్సికో —"

"కలోరెడోలో స్థాపింపనున్న వ్యాపారమును గుఱించిన విశదములను దెలుపుడు"

"తాము సరియగు వేళకే విచ్చేసితిరి ? కలోరెడోయనందు మాఖని యొకటి కలదు. దానిమూలమున విశేషవిత్తము సార్జించుకొనవచ్చును. అందు మీ కేదేని యుద్యోగము కావలయునా ?"

"ముందు విశదము లన్నియు విని, పిదప నాయుద్దేశముం దెలుపుదును, నాకు నచ్చునెడల, అందలి యొక యంశమును గొందును. తోడ్తోడనే యుద్యోగముంగూడ స్వీకరించి అచటి కరుగుదును."

"తమ నామధేయము ?"

"నా నామధేయమువలని బ్రయోజనమేమి ? సంగతిఏమో ఎఱుంగుటకై వచ్చితిని !"

"అయ్యా ! మావ్యాపారమునకు సంబంధించిన నియమములు కొన్నికలవు. వాని ననుసరించి మేము నడుచుకొని తీరవలెను. మీ రెవరో — మీ పేరేమో ఎఱుంగకుండ మావాణిజ్యమును గుఱించిన ఏ రహస్యమునుగాని ఎట్లు తెలుపుదుము ?"

"మంచి దట్లైన దెల్పుదును — నాపేరు రాబర్టు అందురు.

"పూర్ణాభిధేయముం దెల్పుడు — పేరునందలి తునుకనుమాత్రము తెలిసినం బని జరుగుటెట్లు ?"

"హెన్రీరాబర్టు !"

"తమ యుద్యోగమేమి ?"

"ఏమియు లేదు."

"నివాసము ?"

"నెం 209 రు బులెవార్డ్ డెవేటిన్ నలిస్ — నాజన్మస్థాన మేదియో, నా వయసెంతో కూడ నెఱుంగం దలంతురా ?"

"ఈమాత్రము చాలును. వానిని దెలుపనక్కఱలేదు."

"అట్లైన నీకు వివరము లన్నియుం దెలుపుడు."

"కలోరేడో కరిగి, అర్థోపార్జన మొనరింపం బూనుకొనుట మిగుల ప్రశంసనీయము. యౌవనమును, శక్తియు, నర్థముం గలవారు గాన మీరా తావున నున్నతి నందఁగలరు. అచట మా గనినిగూర్చిన పని చాలకలదు — నిక్కముగ నది లాభజనకమైనది! కాని, గనియందలి వివిధ ధాతువులను నవీన విధమున విశిష్ట మొనరింపం జాలనిచో విశేష లాభము చేకూరదను విషయము జ్ఞప్తియం దుంచుకొనుడు — మఱి యొకమాట. మీరు కనిపెట్టు ఆక్రొత్తరీతి ఎవరికిని దెలియరాదు. విశ్వసనీయులను మాత్రము ఖనిఖననమునకై నియోగింపవలెను. మీ యొద్ద నెంత సొమ్మున్నది?"

"ఏఁబదివేలు. అందుఁ బదివేల రూకలను మాత్రము నాయొద్ద నుంచుకొందును."

"మంచిది కలోరేడో చనుటకు మీకు వలయు వ్యయమునంతయు మేమేభరింతుము — అచటికిఁ జనినపిదప మిగుల ననుకూలమైన వేతనము నొసగుదుము. కాని, గనిపని మొదలుకాకముందే పెట్టుఁబడిసొమ్ము నిచ్చివేయవలెను."

"సొమ్ము నాయొద్దనే యున్నది. కాని వివరముల నన్నిఁటి నెఱుఁగక దానిని మీచేతులఁ బెట్టఁజాలను"

"మా వ్యాపారవిషయము బూర్తిగ నెఱుఁగక, మమ్ము బాగుగ గుర్తింపక సొమ్ము మా కప్పన మొనరింపుడని మిమ్ము వేఁడుచుండుట లేదు."

"మంచిది. అట్లైన నేఁగోరునదేమో పూర్తిగ దెలుపుడు. వెంటనే కార్యమునకు నడుముఁ గట్టుదును. పూనుకొనిన దానిని వేగిరమే నిర్వర్తింపవలెను!"

"మహాశయా? భవదీయ కార్యతత్పరత కడుంగడు ప్రశంసనీ

యము. పత్రము లన్నియు మా యధ్యక్షుని యొద్ద నున్నవి. ఈ విషయమున ముందుగ నాతనితో మాటలాడు టవసరము!"

"వారి దర్శన మెపు డబ్బును?"

"నేఁటి యపరాహ్ణము మూఁడుగంటలప్పుడు."

"అపుడు నాకు రా వీలుండదు."

"అట్లైన రేపటి యుదయమున — కాదు కాదు. ఆసమయము కుదురదు. రేపు పొద్దున వ్యాపార కార్యనిర్వాహకుల సభ యొకటి జరుగును; శనివారమునాఁడు భాగస్థులసభ జరుగును. ఈ రెంటియందును మా యధ్యక్షు డుండి తీరవలెను. అందుచే సోమవారమునకు ముం దాతనిఁ గలిసికొనఁజాలు టసాధ్యము!"

"నేనంతవఱకు వేచియుండఁజాలను."

"అట్లైన నిపుడే మీ రాతని యాలయమున కరుగుడు. ఇపు డాతని దర్శనముఁ దప్పకఁ బడయఁగలరు. నేనొక యుత్తరము వ్రాసి యిచ్చుచుంటిని. దాని నాతని పరిచారకునికి —"

అట్లు చెనుటకు రాబర్టున కిష్టములేకపోయెను. అసమ్మతి సూచకముగ నాతఁడు తలయూపెను.

ఒకించుక యోచించి, బ్రయరుదొర యిట్లనెను — "అట్లైన నావెంట రండు. నా కాతని దర్శింపవలయు నవసరముకలదు. నాకొఱకై ఇపు డాతని బండివచ్చును. అధ్యక్షుఁ డన్ని వేళలఁ గార్యనిరతుఁడై యుండును. ఇరువది నిముసములలో వలయు వివరములన్నియు నెఱుఁగఁజాలుదురు"

రాబర్టందుల కంగీకరించెను.

బ్రయరు — ఒకించుక తాళుఁడు. నే లేనితఱి ఎవరును వచ్చి తిరిగి పోకుండుటకై వలయు నేర్పాటుఁజేసి ఇపుడే వత్తును.

అయిదు నిముసములలో టోపీ కరమం దిడుకొని బ్రయరుదొర యరుదెంచి "అధ్యక్షుని శకటము నిలయనికటమున నిలిచియున్న" దనెను.

ఇంతదనుక కవాటము పొంత నిలువంబడియున్న పరిచారకుఁడు బండిపై కెక్కి కూర్చుండెను. మలయమారుతము రివ్వురివ్వున వీచుచుండెను. బండికిటికీ తెఱచి యుండెను. పరిచితమైన 'రుదేసురేనని' (ఒకతావు) దాఁటి శకటము పర్వెడుచుండ రాబర్టు చిత్తమున నెన్నియో తలఁపు లుదయించెను. ఆకస్మికముగ నా యువకుని చూడ్కి తెరువునదను మేక్సిముపైఁ బడెను. వర్జగ్ను మేనల్లుఁడు తన్నెక్కడఁ జూచి పోవునేమో యను భీతిచే నాతఁడు తన మొగమును బ్రక్కకు గ్రక్కునఁ ద్రిప్పుకొనెను కాని మేక్సిము తీక్ష్ణదృష్టిని దన వదనమునుండి మరల్పఁ జాలనైతినని ఆతఁడు తోడనే గ్రహించెను. బండి కడురయమునఁ జనుచుండెను. కూడనున్న బ్రయరుదొర రాబర్టు ముఖ చిహ్నములను లక్షించి "పేరిసునగర మెట్టిదోకాని, ఎవరి కన్నులఁ బడుట కిష్టపడమో వచ్చి వచ్చి వారి కన్నులనే పడుదు" మని వ్యంగపురస్సరముగఁ బల్కెను.

ఆతని నుడువునకు రాబర్టు మిక్కిలి కినిసెను; కాని ఏమియు నుత్తర మొసఁగకుండుటే మేలని ఆతఁ డూరకుండెను.

రుదేవిగనీ యను నొక పేరిసుపేటయందు గొండొక పెద్దమేడ ముంగల బండినిలచెను. రాజపథమున జను లేరును లేరు. కొందఱు కుఱ్ఱలు మాత్రము అం దాడుకొనుచుండిరి. అన్యమనస్కుఁడై యుండనిచో రాబర్టు వారిలో నాడు జగ్జైటును గుఱితించి యుండును. తన యజమాని కార్యదర్శి నందుఁజూచి జగ్జైటు మిగుల నబ్బురపడియెను. రాబర్టు యుద్యోగమున కుద్వాసమిచ్చి ఎండేని జనియుండెనని ఆతఁడు వినియుండెను.

వీధిద్వారమునుండి బండి లోపలి యావరణలోని కరిగెను. బండి దిగి రాబర్టు బ్రయరు ననుసరించి లోనికిఁజనెను. ఒక యలంకృతాగారమునఁ గూర్చుండ రాబర్టును నియోగించి "నే నిపుడే అధ్యక్షు

నకుఁ గబురు దెలుపుచుంటిని. ఇంచుక తాళుఁ ” డని బ్రయ రండుండి యువ్వాలికరిగెను.

పొడవైన పరిచారకుఁ డొకఁడు పదునేను నిమిసములైన పిదప నరుదెంచి, “అయ్యా! నాకూడ రండు ” అనెను.

రాబర్టు మఱొకగది జొచ్చెను. వేషమువూర్చి బ్రయరుదొర అందుఁగూర్చుని యుండెను.

రాబర్టు — అధ్యక్షుఁ డెచట ?

బ్రయరు — అయ్యా! తమరు కూర్చుండుడు.

“ మహాశయా ! కూర్చుండనక్కరలేదు. మీతో నాకేమియుఁ బని లేదు. అధ్యక్షుని దర్శనము కలుగని-చో నేనిపుడే ఇందుండిచనుచుంటిని.”

“ నాకు మీతోఁ జాలపనియున్నది. ఇవు డిందుండి చనుటకు మీకు సాధ్యముకాదు. ”

“ ఏమి ! ఇందు నిలువ నన్ను నిర్బంధింతురా ? ”

“ నిశ్చయముగ నట్లే !

క్రోధముచే రాబర్టు మొగమంతయు నెఱ్ఱవారిపోయెను! కంపిత కంఠమున నాతఁడు “ఏమి ఈ దౌష్ట్యము ! ! — కలోరెడో యను తావునకు బలవంతముగ మీరు కూలీల నంపుచుంటిరా ? ”

“ కలోరెడో ఏమో మే మెఱుఁగము ! రుదేసురేసని యందు జరిగిన దుష్కృత్యము విషయమై ఇవుడు విచారింతుము ! ! ”

రాబర్టు చకితుఁడై పోయెను — దొర ధోరణి కాతఁడు మిగుల నచ్చెరువు పడెను !

కఠోరస్వరమున బ్రయ రిట్లనెను. “ మీ నామధేయము హెన్రీ రాబర్టని నే నెఱుఁగకపోలేదు. వారము దినముల క్రితమువఱకు మీరు వర్జర్సుగారి కొఠీయందుఁ గార్యదర్శులై యుండిరి. ఇట్లని మీ రొప్పి కొనక తప్పదు. మిమ్ము నేను బాగుగ నెఱుఁగుదును. ”

గర్వమున శిరమెత్తి కాబట్టు "ఒప్పుకొనక పోవు టేల? నాపేరుఁ దెలుపుటకు బిడియమును, నా యుద్యోగ మెఱింగించుటకు నడలును బొందు టేల?" అని గంభీరముగఁ బల్కెను.

"కాని, నేను మీ పేరడిగినపుడు, దానిని దెలుపుటకు సంశయించితిరి!"

"కానిపించిన ప్రతిమానవుని యొద్ద నా నామ వివరమును, నా వృత్తి వృత్తాంతమును దెలుపవలసిన యక్కఱ నాకు లేదు. ఆ విషయ మటుండ, — ఇపుడు మీ యభిప్రాయమేమో సత్వరమే తెలుపుడు. మీ మ్రోలనిలచి రహస్యాలాపము సలుపుటకు నాకు వ్యవధిలేదు."

"మీ వాక్కుల ధోరణిఁజూడ మీ రిపు డెచటికి వచ్చితిరో ఇంత వఱకు మీకు గుర్తు తెలియ లేనటులఁ దోచుచున్నది."

"అవును! ఆగుర్తేమో తెలియలేదు"

"తెలియక పోవుట నాకుఁ గడునబ్బురముగఁ దోఁచుచుండెను. మీ రెంతో బుద్ధిమంతులనియు, జతురులనియు, యోచించియుంటిని. ఇఁకఁ జెప్పకపోవు టేల! — నేనిపుడు పోలీసు కమీషనరు యాదేశానుసార మాచరించు చుంటినని మాత్రము గ్రహింపుడు"

"నా కేమియు బోధపడుటలేదు. పోలీసువారికిని మీ కంపెనీవారికిని సంబంధ మేమి?"

"ఏమియుఁ దెల్లము గాన ట్లభినయించు చుంటిరే — అట్లైన నే నంతయు స్పష్టముగఁ దెలపెద వినుడు. మీరిపుడు కైదిగఁ బట్టుబడిరి. విజ్ఞాపనములోఁ గంపెనీని గుఱించిన యుదంతమును జాలచూచి యుంటిరి — అట్టికంపెనీ యొకటి లేనేలేదు!!! ఈ వలవైచి మిమ్ము బట్టుకొనుటకే విజ్ఞాపనమును బ్రకటించితిమి. పేరిసు నగరమునకు మీరు మరలివత్తురని మే మెఱుఁగుదుము. అమెరికా పోవలెనని మీరు ముందు నుద్దేశించి యుందురు. అట్లని గ్రహించియే మేమీ యుక్తిఁ బన్నితిమి —"

దొర ధోరణి కడ్డువచ్చి, రాబర్టిట్లనెను. “అయ్యా! మీ యుపన్యాసము నిఁకఁ గట్టిపెట్టుడు. మీతో వితండవాదము సలుపనేఁదలచుకొనను — నన్ను వెతకి పట్టుకొనుటకు మీ కేమి యవసరమో చెప్పివేయుడు.”

“జాగ్రతగ మాట్లాడుడు. ఇపుడేమి యనినను, అదియంతయు మీకుఁ బ్రతికూలమై నిలుచునని యెఱుఁగుడు. మీరు నేరస్తు లను విషయ మెఱుఁగుదురా?”

“ఏమి యపరాధము గావించితినని నేరస్తుఁడ నైతిని?”

“వర్జర్సుగారి యింటియందు దొంగతన మొనరించుటే మీ యపరాధము!”

“దుర్మార్గుఁడా! ఏమంటివి!!” అని పిడికిలిఁబట్టి రాబర్టు బ్రయరు మీఁద లంఘింప గమకించెను.

కవాట నికటమున నిలువంబడియున్న బొడవుపాటి పరిచారకుఁడు చివాలున నెగిరివచ్చి వా రిర్వురి నడుమ నిలువకపోయిన యెడల, నిక్కముగ దొర యువకుని ముష్టియాఘాతమునకు గురియైయుండెడిదే! పరిచారకుఁడు రాబర్టు కాయము నంటలేదుగాని, నిట్రాటివలె నడుమ నిలిచిపోయెను.

బ్రయరు — జాగ్రతసుమీ! బలము చూపినంత మాత్రమున నీవు నిరపరాధివని రూఢి కానేరదుఁ బ్రక్కగదిలో మఱి యిరువురు వేచియుండిరి! ఇంగిత మొనరించినంతనే వారలు వచ్చి పడుదురు. ఒక్కఁడవు ఏమిచేయఁ జాలుదువు? — ఇంచుక శాంతింపుము!”

క్రోధముచే రాబర్టు విశ్వాస మించుమించుగ దుర్ధమైపోయెను! అతికష్టమున నాతఁ డాత్మసంవరణ మాచరించుకొనెను.

బ్రయరు — వర్జర్సుగారి గృహమున చౌర్యము జరిగెను — ఆ

విషయము మీ రెఱింగియే యుందురు. పేరిసువాసులంపఱు దానినే అబ్బురపాటునఁ జెప్పుకొనుచుండిరి!

రాబర్టు — నేను నగరమందు లేను. వార్తాపత్రిక నైన నేటి దనుక జూచియుండలేదు. ఏపరిచితుని గలసికొనలేదు. పోయిన గురువారము రాత్రి పదునొకండున్నరగంటలప్పుడు వెడలి వచ్చితిని?''

"చేతఁ బెట్టెఁగొని తత్తరమున నానిశి మీ రెందరిగితిరి?"

"మీ కీ పరీక్ష యంతయు ఎందులకో నాకు ముందు చెప్పుడు."

వ్యంగస్వరమున బ్రయ రిట్లనెను. 'ఓ! — పరీక్ష కారణమెఱుఁగరా? పాపము మీ కేమియుఁ దెలియదు కాఁబోలు! రాత్రి పదునొకండు గంటలప్పుడు కోశీదారుని ఇనుప పెట్టెను ఒక ముచ్చు మాఱు తాళముచేఁ దెఱచెను. అరగంట యనంతరమే మీ రవ్వలికి దాఁటిరి. ఆ చెడు చెయిద మెట్టులు జరిగెనో — దాని నేర మేరిపై బడెనో ఒకించుక యోచించి చూడుడు.'

"ఏమి — ఇనుపపెట్టె నుండి విత్త మపహరింపఁబడెనా? అట్లైన పాపము వర్జర్సుగారు తమసర్వస్వమును గోల్పోయిరా? పెట్టెయందుఁ జాల మొత్తముండెను!"

"అట్లని మీ కెట్లు తెలియును?"

"కోశీ యధినాథుఁ డావిషయముఁ దెలుపుచుండ నేను సమీపమునం దుంటిని. ముప్పది లక్షల కెక్కుడుగ సొమ్ము ఇనుప పెట్టెయందుఁ గలదు. ఆమొత్తము నపహరించితి నను అపవాదమును నాపై మోపుచుంటిరా! ఇంత విత్తమును అపహరించిన వానికి మరల నీ దేశమందొక నిముసమైన నిలిచియుండుట కెన్ని వేల గుండియలు కావలెను?"

కార్యసాధనార్థమై యుక్తిఁ బ్రయోగించు టుచితమని యోచించి బ్రయరుదార ఇట్లనెను. "మీరు వేయివిధముల దలఁచితిరి — దొంగిలించినవారు మీరని నేననుచుండుటలేదు. సత్యము గన్గొనుటకై యత్నము

నలుపుచుంటిని. రయమున జని ఎందేని యదృశ్యులుగాఁ దలఁపలేదని మీరు నిక్కంబు వక్కాణించితిరి! — కాని ఆనాటిరేయి ఎందువల్లనో మీరు పేరిసు నగరమును వీడి మీజన్మస్థానమగు బ్రిటనీకి చనియుండిరి. మే మచటికిఁ బంపిన పత్తేదా రందు మిమ్ముఁ గానక మరలివచ్చెను. ”

“ ఏమి? నన్నుఁబట్టి నావెంట నొకపత్తేదారు నంపితిరా?—అట్లైన చౌర్యము సలిపితినను అపరాధము నాపై నారోపించి, దేశమం దెల్ల కడల దురంతమగు నీయపవాదముఁ జాటించితిరా? ”

“ మేమేమియుఁ జాటింపలేదు. అతిరహస్యముగ మే మీ యను సంధానమును నెరవుచుంటిమి. బ్రిటనీయందలి మీ యనుఁగువారు మాయపరాధ పరిశోధకుఁడు మీనెచ్చెలియనియు, మిత్రకార్యార్థమై అతఁ డరుదెంచెననియు యోచించిరి. అందుండి మీ రచటికో స్థలున బయన మొనరించితిరని వారు తెలిపిరి. ”

“ నేను తిన్నగ పేరిస్ నగరమున కరుదెంచితిని. ”

“ మీరు మీస్వస్థలమునకు జనినది సొమ్ముప్రోగుఁజేసుకొనుటకా? ”

“ అందుఁ బ్రోగుజేసుకొనుటకు నాకేమియు లేదు. నాకుఁగల యాస్తి యిల్లుమాత్రమే. ఇల్లున్నను, దానిమీఁద నెవరును బదు లొసంగఁ బూనుకొనరు. ”

“ కాని, మీయొద్దఁ జాలవిత్తమున్నట్లు తోచుచున్నది — ఏలనన, వ్యాపారమునకై నలుబదివేల రూకలను మీరు వెచ్చఁబెట్ట సంసిద్ధులై తిరిగదా! ఈ యర్థమును మీరీవరలోనే సంచిత మొనరించితిరా? ”

“ నే నీవరలో నేమియు సంచిత మొనరింపలేదు — ఇపుడు నాకడ నేఁబదివేలరూకలు మాత్ర మున్నవి. ”

“ అంత ధనముమాత్రము మీ కెందు లభించెను? ”

“ మీ కా వివరమును, — ఈపరీక్షయు నెందులకు? కొఠీయధికారి

యినుపపెట్టెనుండి ముప్పది లక్షల రూకలు హరింపబడెను గదా ? — నా ఏబదివేలు ముప్పదిలక్షల రూకలు కాఁజాలు టెట్లు ? "

" ఇట్లని కోర్టువారి మ్రోల మీరు వచించియున్నచో, శేషించిన యర్థమును మీరు స్వగృహమున నెందో దాఁచియుంచి యుందురని న్యాయాధిపతి వచించియుండును ! "

" అట్లైన, నాగృహమును పోలీసులచే వెతకించుకొనుడని తోడనే నేఁ జెప్పియుందును ! "

" సరేగాని దానిమాట అట్లుంచుడు — ఇపుడు మీయొద్దనున్న ఏఁబదివేలరూకలు నోట్లుగ నున్నవా లేక మొహరులుగ నున్నావా ! "

" నోటులుగనే — మహాశయా ! మీకీ ప్రశ్నలతోఁ బనియేమి ? "

" అదేమో చెప్పెదను. బేంకు యధికారివి హరింపఁబడిన నీ యేఁబదివేలరూకలే ! "

" ఏమి యద్భుతము ! ముప్పదిలక్షలరూకలు కుప్పలై యెదుటఁ గానిపింప, దొంగ ఏఁబదివేల రూకలుమాత్రము గైగొని వెడలి పోయెనా ? "

" ఇది మామూలుదొంగ చేసిన కర్జము కాదు — అందుచే మానందేహము మీపైఁబడెను. "

" నేఁగాక పెక్కులు బేంకునందుఁ బనిచేయుచుండిరి. నాయొక్కని మీఁద మీనందియ మేలపడెను ? "

" చాలమంది యక్కడఁ బనిచేయుచుండుట నిక్కమే ! కాని రాతి రులం దెవరును అందు వసింపరు. ఆమాటటుండ నామాలుతాళముచే దొంగ ఇనుపపెట్టెను దెఱచెను. తనబీగమును పలుమాఱులు మీరు గొనియుంటిరని కోశపతి చెప్పియుండెను. "

" అది వట్టి మిథ్య ! "

" సరే బీగముమా టటుంచుడు — సాంకేతికపదము నెఱుఁగనిచో,

ఇనుపపెట్టెను దెఱచుట దుస్సాధ్యము! అన్నివేళల మీరాగదిలోని కరుగుచుందురు. అందుచే ఆమాటను మీరు చూచియుందురు."

"అవును చూచియే యుంటిని — అది వర్జర్సుగారి తనూభవ యభిధేయము! దానంజేసియేనా నాపై సందేహము?"

"మా సంశయమున కది యొక్కటియే హేతువుకాదు. ఇనుపపెట్టె కొక మర కలదు. పెట్టె దెఱచు తెఱంగు నెఱుంగని చో, నుక్కుచేతులందు చోరుఁడు పట్టుఁబడును. మీ కా తెఱంగు తెలియనిది కాదు. ఈకారణము లన్నియు నటుండ మీరు కడుంత్తరమున పేరినుపీడునుండి వెడలిపోతిరి!"

"మహాశయా! ఈ యుదంత మంతయు సంభ్రమకరమైనదై యున్నది. — ఏంబదివేల రూకల సామాన్యార్థము కొఱకై, నే నీ దృశజఘన్యకృత్య మొనరించితినని, నాచరిత మెఱింగినవా రెవరును విశ్వసింపరు — నన్నింక న్యాయాధికారి ముందుకుఁ గొనిపొండు. మీతో విశేష కాలము ప్రసంగించి, నాయుత్తమాంగమున మఱింత దుర్దాంతమైన యవమానభారమును బూనుకొనను."

"అయ్యా! మీరు కోరునట్లే మిమ్ము న్యాయాధికారి ముందుకు గొంపోదుము. ఏంబదివేల రూకలు మీ కెందు లభించినవో, — అందులకుఁ దగు సమాధానమును మీ రీయవలసియుండును! నెల ఒక్కింటికి మీకు పుట్టు జీతము నూఱురూకలు మాత్రమే! ఆపాటి వేతనమునుండి రెండుయేండ్లలో నేఁబదివేల రూకల విత్తమును మీ రెట్లు కూడఁబెట్టఁ జాలితిరో కోర్టువారే యూహింతురు!"

"మాస వేతనమునుండి నూఱు రూకలనైన నేను నిల్వవేయఁ జాలనైతిని!"

"అట్లైన మీ కింత ధనమెందు లభించెను?"

"దానికుత్తరము న్యాయాధిపతి ముందుఁ దెల్పుదును. ఈ ప్రహ

ననమ్మా చాల సేపటినుండి ప్రదర్శింపఁబచుండెను. నేనిఁక నొక నుడువునైన మీయెదుట వచింపువాడను కాను!"

"హరింపఁబడినవి ఏఁబదివేల రూకలు మాత్రమే కాదు — తోడ్తోడనే ఒక నగలపెట్టియు కూడ దొంగిలింపబడెను."

"కర్నలు బెరిషఫ్ నగలపెట్టియా?"

"అట్లని మీకుఁ దెల్లమయ్యే యుండెనే!"

"నిశ్చయముగఁ దెల్లమయ్యే యుండెను!"

"ఇఁక మానందేహమునకు —"

"ఆ విషయమును నే నెఱుఁగుటకుఁ గారణ మున్నది — వర్జర్సు గారిని కర్నలు నగలపెట్టె నడిగి నప్పుడు నేను సమీపమందేయుంటిని. ఉదయమే వచ్చి దానిని గొనిపోవుదునని చెప్పి ఆతఁడు చనెను."

"ఇదిగాక మీ రిఁకేమియు నెఱుఁగరా?"

"ఎఱుఁగను. ఆనాఁడే నే నిలువీడి వచ్చివైచితిని."

"మఱునాఁటి యుదయము జూలుస్ ఖాతంజీ చూచునరికి, ఇనుప పెట్టె తెఱువఁబడి యుండెను! — అపు డందు నగలపెట్టె కానంబడ వేదు. అన్యసీమ యరుగుటకు వలయు వ్యయము కోసరమై హర్త ఏఁబదివేల రూకలఁ గొంపోయెను."

"ఇట్లనుమానించుట యసంగతము కాదు."

"కర్నలు బెరిషఫ్ ఇట్లు సందియపడెను."

"అట్లైన కర్నలు యాదేశానుసారమే మీరు నన్నిటకుఁ గొని వచ్చితిరా!"

"కాదు. న్యాయాధిపతి ముదల ననుసరించి మి మిచ్చటికిఁ గొని రావలసివచ్చెను. ఇది కర్నలు నిలయము. నడువుడు. మి మ్మాతని పాలికిఁ గొనిపోదును."

రాబర్టు తోడనే అందుల కంగీకరించెను — కర్నలును దర్శింప

నాతఁ డుత్సుకుఁడాయెను. తలుపుఁ దెఱచి బ్రయురుదొర పొంత నిలువఁబడెను. రాబర్టు వలాయున మొనరించు నను బీతునఁ బరిచారకుని ద్వారసమ్ముఖమున నాతఁడు నిలువఁబెట్టెను. కాని, పాటిచనవలె నను నుద్దేశ మాయువకునికి లేదు. సగర్వమున నొదల నున్నత మొనరించి నిర్దిష్టాగారము నాతఁడు చొచ్చెను. గది పెద్దది. మిగుల నందముగ నలంకరింపఁబడి యుండెను. కాని, కర్న లందు లేడు.

ఇంచుక సేపు తడసిన పిదపఁ బ్రక్కగది తలుపు తెఱువఁబడెను. కర్నలు బెరిషఫ్ మెల్లగ గదియందుఁ బ్రవేశించెను. యువకుని గూర్చుండ నియోగించి, బెరిషఫ్‌దొర అం దొకచో నాసీనుఁ డాయెను.

రాబర్టు — "నన్నిచటి కెందుకు రావించితిరో వెంటనే తెలుపుఁడు."

"కారణమేమో మీరు నిక్కముగ నెఱుఁగుదురు. మిమ్మిచటికిఁ గొనివచ్చిన యాతఁడు మీకంతయుఁ దెలిపియే యుండును."

"వారంటు మీఁద నన్నాతఁ డిచటికిఁ గొనివచ్చెనఁట. కాని, నేనా నుడువును నమ్మలేదు. మీ యాదేశానుసారమే ఇదంతయు జరుగుచుండెను!"

ముహూర్తమాత్ర మేమో యోచించి సౌమ్యవచనములఁ గర్న లిట్లనెను. "మహాశయా! తాము కాని తెరువున నడుగువైచితిరి — చౌర్యాపరాధము మీపై నారోపింపఁబడెను. 'దోషినిగాను' అని మీరు ప్రతిఘటింపఁ జాలుదురా?"

"అయ్యా! ఈ తేని మాటలేల! నిర్హేతుకముగ నీ ఘోరాపరాధమును మీరే నాపై మోపితిరి.?"

"అట్లు మోపినది నేనొక్కరుండనుగాను. చౌర్యమునలిపినది మీరే యని పలువుర దృఢాభిప్రాయము. ఇది నాయొక్కరునకు సంబంధించిన విషయమైన యెడల ఒక పెద్దమనిషి మఱియొక పెద్దమనిషియొద్ద ననుకూల విచారమే వడసియుండును."

"ఊరక తీయని మాటలచే మీరు నన్ను మఱపించుచుంటిరి. మీ ప్రోల నేనిపుడు స్వతంత్రుండనై యుండలేదు. విడుదల బడసినచో నిక్కముగ నేను నా నిర్దోషిత్వమును ఋజువుజేసి యుండువాఁడను. పదంపడి నిర్హేతుకముగ నాపై నిట్టి దురంతాపవాదము మోపి నన్నవ మానించినందులకుఁ దగు సమాధాన మీయుఁడని మిమ్మడుగు వాఁడను! -- మీ గృహమున మీ యధీనమున నున్నంతకాలము నే నే మాటకును జవాబొసఁగను."

"నన్నుగుఱించి దురభిప్రాయము పడవలదు — మీకు నేనెట్టి చెట్టఁ జేయదలఁచుటలేదు — ఈ ఘటనముపై నిప్పుడే యవనిక పడుటయు బడకుండుటయు గేవలము నాయిష్టముపై నాధారపడి యుండును."

"ఏమి! విచారణ భార మంతయు మీమీఁదనే యాధారపడి యుండెనా? — ఇపుడు రష్యారాజ్యమున వసియించుచుంటిమని నేఁ దలఁచుటలేదు."

"ఒక్క రష్యాసీమ యనెదరేల? — ఇచ్ఛగించినచోఁ నే దేశమం దైనను వాది తన యభియోగము దాను నిముసములో రద్దు పఱచు కొనఁజాలును."

"మీ యిష్టమువచ్చిన యాదరణమునకు నన్ను బద్ధునిఁజేయుట మీ యభిప్రాయమని మీనుడువులవలన బోధపడుచున్నది. కాని అట్లు నిశ్చయించి కృతకృత్యులు కాఁజాలుదురని నేను విశ్వసింపను."

"మీ రన్యథా యోచించుచుంటిరి. నే జెప్పునది సరిగ వినుడు — మీకంతయు స్పష్టముగఁ దెల్లమగును. నాపత్రము లెవని కవసరమో, అతఁడే పేటికను దొంగిలించియుండెనని నాదృఢవిశ్వాసము. ప్రప్రథమ మున మీపై నాకెట్టిసందియము కలుగలేదు. కాని, కడు త్వరితముగ పేరిసు వీడునువీడి మీ రెందేని వెడలిపోతిరనియు, నినుప పెట్టెఁ దెఱచు తెఱఁగంతయు మీ రెఱుఁగుదురనియు, సింధుకమున్న యాగారము

లోనికి నిరాటంకముగ మీరు పోయి వచ్చు వాడుక కలదనియుఁ గోశాధికారి నాకుఁ దెలిసినపుడు నాకు సంశయము కలిగెను. పెట్టె మాత్రము నాకు ముట్టునెడల, నీయాందోళనమంతయు నిముసములోఁ గడముట్టును: పెట్టెయందొ నపహరింపఁబడిన దేమో మిగులదుచ్ఛమైనది."

"ఏఁబదివేల రూకలపహరింపఁబడెనని చెప్పితిరి కదా. ఆ విత్తమంతయు మీకుఁ దుచ్ఛముగఁ దోచుచుండెనా?"

"నిక్కముగ నది తుచ్ఛమైనదే! కష్టములేకుండ ఆనష్టమును వర్జస్సు యోర్వఁజాలును. వలయునెడ ఆనష్టమును నేను పెట్టుకొనఁ జాలుదును. నా కాగితములను నేను పడసినయెడల, నిశ్చింతుఁడనై యుందును. ఏఁబదివేలరూకల విషయమును మీరు తెలుపక పోయినయెడల నే నింతదూరము సాగివచ్చువాఁడను గాను. చౌర్యము సలిపినవారు మీరేయని నేనంతగ విశ్వసించువాఁడను కాను."

"ఆవిత్తము నాకెందు లభించినదో, మీ యుద్యోగికి నేను తెలుపలేదు. కాని మీకు దాని నవలీలగఁ జెప్పజాలుదును. నాకీయర్థము లభించి మూఁడునాళ్ళుమాత్రమైనది."

"ఎవరికడ లభించినది?"

"నాజనకునికడ నొకవ్యక్తి సాధారణముగ ఋణముఁ దీసికొనుచుండువాఁడు. తా నొనరించిన పెద్దయప్పు నాతఁడిప్పటివఱకు దీర్పఁజాలక పోయెను. ఇపుడా బాకీ మొత్తము నంతయు నాతఁడు నాకడ కంపివైచెను."

"ఆధర్మాత్ముని పేరేమి?"

"ఆధర్మాత్ముని పేరు నేనెఱుఁగను. జాబుతోఁబాటు నోటులకట్ట నొకట వరునందిడి దాని నాతఁడు నాపాలికంపెను. నిస్సంశయముగ నే నావిత్తమును గ్రహింపవచ్చునని ఆతఁడువ్రాసెను. ఉత్తరమందు స్వాక్షరములు లేవు."

"ఆలేఖ మీయొద్ద నున్నదా?"

"నిక్కముగ నున్నది."

"దానిని నాకుఁ జూపుదురా?"

"ఇపుడు కాదు. న్యాయాధికారి మ్రోలఁ జూపుదును."

'అయ్యో! మీమనుజుల నెవరును విశ్వసింపఁజాలరు. – ధనము నపహరించిన యాతఁడే నా నగలపెట్టియను గూడ నపహరించెను. పైకముఁ గొన్నవారు మీరే! – అందుచే నా నగలపెట్టె కూడ మీయొద్దనే యున్నది. అట్లులేకున్నను, పత్రములు లేదున్నవో, ఎచట నున్నవో మీరె౦ఱుఁగుదురు. అవి హస్తాంతరితములే యైనచో, వాని నెట్లులైన స్వాధీన మొనరించుటకై మీరు నాకుఁ దోడుపడ వలసియుండును."

"కూడని యనుమానములను సంకల్పించుకొనుచు, అనుచితమగు దోషమును నాపై నారోపించుచు, మీరు నాకెంతేని యవమానముఁ దెచ్చిపెట్టుచుండిరి!" అని ఘృణాపురస్సరముగ రాబర్టు పలికెను.

ఆనుడువును సెవిజొరనీయక కర్నలిట్లనెను. "నేఁ జెప్పినదానిని బాగుగ యోజించి చూడుఁడు. పోలీసువారి కీ విషయము తెల్లమైన యెడలఁ మీయుద్ధార మాశాతీతమగును. ప్రమాణములన్నియు మీకుఁ బ్రతికూలముగనుండెను. వాని యన్నిటికి మీరవశ్యముగ సమాధాన మొసఁగవలయును. నగలపేటికనుగాని ఏమి చేసితిరో తెలిపిన యెడల, నే నింతటితో నాయనుసంధానమునంతయు విరమించి వైతును. నాపత్రములను నేను మరల బడసితినని న్యాయాధికారి మ్రోల విన్నవింతును. పదంపడి, ఏరికడనుండి వచ్చెనో తెల్లముకానట్లు వర్జర్సునకు నే నేఁబదివేల రూకలఁ బంపివైతును. అనంతర మాతని పాలికరిగి, తన శంక యమూలకమైనదనియుఁ జౌర్యకృత్యమందు రాబర్టున కెట్టి జోక్యము లేదనియుఁ జెప్పుదును. – నిక్కంపు చోరునిఁబట్ట

జాలితిని, కాని యిట్లని నేనెందును వ్యక్తీకరింపనని శపథపూర్వకముగఁ జెప్పుచుంటిని, మీపై నెవరికిని బిందుమాత్రమైన సందియ ముండదు."

"నన్నిచటికిఁ గొనివచ్చిన యాతని మనసునందుఁ గూడ నే సందియము నుండదా ?"

ఇంచుక యోచించి కర్నలు :—"నిజమంతయు నిపుడు తెలిపివైచుట మేలు మిమ్ము తనతోఁ గూడఁ గొనివచ్చిన యాతఁడు నా ప్రధానోద్యోగి" యనెను.

"అట్లైన నింతదనుక తాము అనృతముఁ బలుకుచుంటిరా ? న్యాయాధికారి యింకను ఈచౌర్యోదంతము నెఱుంగడా ? ఇప్పటివఱకు ఇచటఁ గేవలము ప్రహసన మభినీత మగుచుండెనా ? నన్నిచటికిఁ గొని వచ్చిన దురాత్ముఁడు మీ ప్రధానోద్యోగియా ? ఆ పలుగునకుఁ దోడు పడిన కటికివాఁడు మీభృత్యులలో నొకఁడా ?"

కిన్క నడంచుకొని కర్న లిట్లనెను. "మీ రూరక క్రోధమునకు వశవర్తులగుచుండిరి. — మీవలె నేఁ గోపమునకు దావీయను. వంశ మర్యాదయందు మీరు నా కెందును దీసిపోరు. నావలెనే మీరు భద్రకులమున జనించితిరి. నాయాగ్రహము కూడ నుద్దీప్తమైన యెడల మిమ్ము ద్వంద్వసమీకమున కాహ్వానింతునని యోచించితిరి. కాని, నే నట్లొనరింపను. ఇవు డాజన్యము జరుగుట యసంభవము. మీ పేరు నంటిన అపరాధ కాలిమమును మీకు మీరే క్షాలన మొవు డొనరించుకొనఁ జాలుదురో, మీతో ద్వంద్వయుద్ధమునకు నే నవుడు గడంగనేర్తును. — అంతకమున్ను గాదు. చౌర్యాపరాధ భార మెవని మస్తకమునఁ బడియుండెనో, ఆతనితోఁ బోరు సలుపుట కెవ్వ రియ్యకొందురు ? — నా నగల పెట్టియను దోడ్కొని పోయిన వారు మీరే యని గట్టిగ నమ్ముచుంటిని."

"నిష్కారణముగ నొరులపై దురంత దోషారోపణ మొనరించి, కాపురుషు లిట్లే యాత్మపక్షమును సమర్థన మొనరించుకొందురు!"

"కాని మాటలందు దిగుచు ముఖ్యాంశము నడంచివైచుచుంటి రేల? అవలీలగ మీరు మీ నేరము నీయకొనినచో, మీ తప్పిదము యొక్క యొప్పిదమును మీనుండి సులభముగ వెలిదీయఁజాలు వ్యక్తి పాలికి మిమ్ముఁ గొనిపోవలసివచ్చును జుడీ!"

"మహాశయా! అట్లే కావింపు" డని రాబర్టు నిర్లక్ష్యముగ వాక్రుచ్చెను.

"అట్టైన పోలీసు కమిషనరునకు మిమ్మిప్పుడే యొప్పగింతును. వర్జర్సు నాకుఁ దోడ్పడును."

'మంచి దట్లే యొనరింపుడు. — భటాధిపతిమ్రోల నేమి చెప్పాట కైన సుమంతైన నడలువాఁడనుగాను."

"ఈయభియోగ మంతవఱకు బెచ్చిల్లినచో, మీదుష్కీర్తి దశ దిశలఁ బ్రకాశముగునని యెఱుంగుడు. ఎల్లరు మిమ్ముఁ జూచి "ఛీ! ఛీ!!" యని ధిక్కరింతురు! బంధుమిత్రులకు మీరు దూరమగుదురు. చట్టమునుండి మీకెట్టి చెట్ట గలుగకున్నను, సంఘము నుండి దూరీకృతులగుదురు. వర్జర్సు సంశము కూడ కళంకితమైపోవును. ఆతని కుమారి చరితము కూడ —

"జాగ్రత్త! ఆ సుకుమారి నామధేయమును మీనోటరానీకుడు!"

"మీముఖమంతయు నిమిషములో వివర్ణమైపోయెనే! —

ఈపర్యాయము మీహృద్వీణయందు సరియగు తీవను మీటితినను కొనెద. విషాదమంతయు నిపు డెందు నిహితమై యున్నదో మీకు బోధపడుచున్నది. ఇచ్ఛగించినచో, మీరీవిషాదమునుండి పరిత్రాణముఁ బడయఁజాలుదురు. ఇపుడైన నేమియు దాచఁక జరిగిన దంతయు నున్న దున్నట్లు తెలిపివేయుఁడు. మీరు తెలుపుదానిని నిభృతమువ

నడచియుంతును. సుమంత్రైన నొరులు కదిలి తెలియఁజేయుచు. నా సుతు వులను విశ్వసింపుము." అని శాంతవచనములు దొర యనెను.

"నే నేమియుఁ దెలుపకున్న నేమి చేతురు ?"

"మిమ్ముఁ బోలీసు నాయకు కరముల నప్పగమైనఁ గావింతును లేక నిశ్చయము వక్కాణించు నందాక మిమ్మిందు బంధించియైన నుంచుదును !"

"మీ వాంఛను నే నిత్తతి ప్రతిఘటింపజాలను. — అయినను నా యభీష్టముఁ దెలుపుదును — నన్నిపుడు కొరిపతి పాలికిఁ గొనిపొండు. నే నాతని ప్రమోలనంతయుఁ దెలిపివైతును."

"మీసమాధానమును వర్జర్సు చెవిఁ జొరనీయను ! అంతియకాక అతఁడు భారమునంతయు నాపైఁ బడవైచెను. కొంచె పాటివిత్తము పోయినంతమాత్రాన అతనికి వచ్చిన నష్టమేమియు లేదు."

"రూకలను, నగలపెట్టియును ఒక్కరుఁడే కొనిపోయెనని మీరను చుండిరి. పైకమును నేఁ గొనిపోలేదని ప్రమాణ మొనరించితినేని, పేటికను నే, దీయలేదని ఋజువగునా ?"

"మీరు నిర్దోషులని ఇపుడుకూడ రెట్టించుచుంటినా ? మీరింక నేమియు వెలిబుచ్చనట్లు తోఁచుచున్నది. ఇఁక నేమి చేయవలెనో తెల్పుడు. నేఁడు మిమ్మిందు నిలుపవలసివచ్చుచున్నది. ఇందు నా దోసము లేశమైన లేదు. వర్జర్సు పాలికి మిమ్ముఁ గొనిపోవుటెట్లు ? కారాగార శకటమేమియు నాకడలేదు. మార్గమధ్యమున మీరు పలాయన మొనరింపరని ఎవరు చెప్పగలరు ?"

"మీ యధీనమునఁ బలువురు భృత్యులుకలరు. — వార నవలీలగ నన్నాతావునకుఁ దోడ్కొని పోఁజాలుదురు. దారియందు సాయము కొఱకై తెరువరులనేరిని నేఁబిలువను. మీరు కూడ వెంట రండు !'

“ మీకూడ వచ్చుటకు నాకు వీలులేదు. ”

అనిర్వచనీయ క్రోధావమానములచే రాబర్టు యంగ ప్రత్యంగము లన్నియుఁ గంపింపదొడఁగెను. అతికష్టమున నావేగమును సంవరణ మొనరించుకొని ఆతఁ డిట్లనెను. “ అపరాహ్ణసమయమునఁ దప్పక మీపాలికి వత్తునని శపథపూర్వకముగఁ బల్కినచో, మీరు నన్నొక మాఱు విడిచిపెట్టఁజాలరా ? ”

“ ఎవరినిగాని చూడ ” ననియు, ‘ నేనెవరితోను నేమియుఁ జెప్ప ’ ననియు మీరు ప్రతిజ్ఞ జేయఁజాల రనుకొనెదను. దానంజేసి నేను మిమ్మెట్లు విడిచిపెట్టఁజాలుదును. ”

“ పలుగు గాక ఒక పెద్దమనిషితోఁ బ్రసంగించుచుంటినని నే నింత వఱకు యోచించియుంటిని. కాని అది వట్టి భ్రమయని ఇపుడు స్పష్టముగఁ దెల్లమాయెను ! మీరు కారాధ్యక్షులు మాత్రమే యని యనుకొనెదను. ”

చిరునగవు నగి కర్న లిట్లనెను. “ ప్రతిదిన మపరాహ్ణసమయమున నీ యాగారమందే మీ తల్పు మేర్పరుపఁబడును — ఆహారముఁ గూడ నిందేపడయుదురు. నా భృత్యులందఱు మీయాదేశము లన్నిఁటిని వినయపూర్వకముగఁ బ్రతిపాలన మొనరింతురు. ఇచ్చుటి పుస్తకభాండాగారమున లెక్కకు మించిన పొత్తములు కలవు. ఇచ్చవచ్చినంత సేపు మీరు గ్రంథకాలక్షేపముఁ గావించుకొనవచ్చును. వలయు నపుడు మీకు ఫలహారము లొసఁగఁబడును. ధూమపానార్థ మెట్టి చుట్టలనైన మీరిట్టెఁ బడయుగలరు. నగలపెట్టె యెందున్నదో తెలిపిన ముహూర్తమందే మీస్వాతంత్ర్యము మీకొసంగబడును.

ఇట్లుపల్కి, కర్న లా యాగారమునుండి నిష్క్రమించెను. తోడ్తో డనే కవాటము రుద్ధమైపోయెను.

ఎలిస్ నికటమున సెలవుఁగొని, చింతాకులస్వాంతుండై మేక్సిము నిజ నిలయమున కరిగెను. ఎలిసు రాబర్టుల నిరువురఁ గలిసికొనకుండఁ జేయు టెట్లు లను చింత యనుక్షణ మాతని హృదయమున ననుదిత... కా దొడంగెను. రాతిరి యంతయు నాతనికి బాగుగ నిద్దుర పట్టలేదు.

ప్రభాతమున పర్యంకమునుండి లేచి, జగ్గెటునిశాంతమును జూచుటకై ఆతఁ డవ్వలికరిగెను. ఎలిసును జూచుటకై రాబర్టు అపరాహ్ణ సమయమునఁ జనును. ఈలోపుగ నృత్యకామినిని వెదకి జగ్గెటు యవ్వను జూడవచ్చునని ఆతఁడు యోచించెను.

నృత్యప్రాంగణమునుండి ఆనాఁటి రజనిసుందరిఁ గూడి ఆ మను దెంచిన పథమునుండియే మేక్సిము చనసాగెను. మనోమోహినియై, లావణ్యఖనియై, సౌందర్యతిలకయై తనరారు ఆ శిలోదరి యుజ్జ్వల కటాక్షములును — కోమలకరతలమధురస్పర్శయు నవుడుకూడ ఆతని యింద్రియము లన్నిఁటి నభిభూత మొనరించి యుంచెను. నిర్దిష్టసౌధ సమ్ముఖమున కరుదెంచి యువకుఁడు నిలువఁబడెను. ఉపరిభాగమున నున్న వాతాయనము మూసియుండెను. మేడయందు మానవుల యలికిడి ఏమియు వినఁబడుటలేదు. సుందరి యప్పటనఁ దనతో నన్నృతము వచింపలేదనియు, నిక్కముగ నామె పేరినును వీడి చనెనగాయు మేక్సిము భావించెను.

కాని ఆమె యింటి నెవరికైన నొప్పగించి చనియుండు ననియు, నింటఁగలవారిని వాకవుచేసి ఆపె యుదంత మెఱుఁగుటుచిత మనియు నాతఁడు యోచించి, చేతనొక నాణెముఁగొని ద్వారసమ్ముఖమున కరిగి ఘంట మ్రోయించెను. ముమ్మాఱు మ్రోయించిన పిదప నెవరో

తలుపుఁ దెఱచిరి. తలుపుఁ దెఱచిన మహనీయుని ముఖమంతయు దీర్ఘశ్మశ్రువులచే సాంద్రమై యుండెను. దట్టమైన వెండ్రుకల యడవి యం దాతని మొగమించుకైనఁ గానంబడుటలేదు. కాని కేశగహనాభ్యంతరమునుండి చిన్ని శిఖరమువలె నాతని ముక్కుకొన చూపట్టుచుండెను! ఆ పురుషుని వదనారవిందము విలోకింప నాతఁడు సాధారణ భృత్యుఁడని తోఁపదు! సౌందర్యతిలకను జూచుటకై చనిన యువకునకు నీ లీలామానుష విగ్రహము యొక్క దర్శనము లభింపగనే, చిపాలున నాతఁడు మూర్ఛిల్లలేదు, — పరమానందముతో భక్తుని భంగి నృత్యమునైన సలుపలేదు! ఇంచుక జతనమున గుండెనిబ్బరమును నిలుపుకొని మెక్సి మా స్వరూపమును తిలకించి " ఈ మేడ అమ్మఁబడునా?" యని ప్రశ్నించెను.

" అమ్మనుబడదు, అద్దెకు నివ్వబడ" దను శబ్దము శ్మశ్రుగహన ముఖమునుండి వినవచ్చెను. గుమ్మముపై బాహువును జాచి ఆ వింతమానిసి నిలువంబడి తోడనే తలుపు మూయ నుంకించుచుండెను.

" ఇది కడునబ్బురముగ నుండెను. ఈయింటియామె దానిని విక్రయించునని వింటిని. ఒకవేళ ఇంటినెంబరును బాగుగ గుఱితింపలేక తప్పుచోటునకు వచ్చితినేమో తెలియదు — సార్జెంటు దొరసాని ఈ మేడలోఁ గాదా ఉండుచున్నది? "

" ఆపేరు గల యాఁడుదాని నెవ్వతెను నేనెఱుఁగను? "

" అట్లనుచుంటి వేమి? — నే నా కాంతను పలుపర్యాయములు చూచితిని. ఒకనాఁడామెను వెంట తోడ్కొని వచ్చి ఈసౌధమందే విడిచిపోతిని. ఆమె నాకు — "

" అయ్యా! సార్జెంటు దొరసాని యెవరో నే నెఱుఁగనని మీకు స్పష్టముగఁ జెప్పుచుంటిని. మఱొక యింటికరిగి వాకబుచేయుఁడు" అని యాతఁడు తక్షణమే కవాటము మూసివైచి లోని కరిగెను.

17

తలుపుమూయు తెఱఁగు అవమానభూయిష్ఠమై యుండెను! మేక్సిమున కరికాలు మంట తలకెక్కెను. అతఁ డూరకొనక ఈవలనున్న ఘంటను పలుమాఱులు మ్రోయింపదొడఁగెను! కాని, యెవ్వరును కవాటమును దీయ రాలేదు. అపుడుకూడ నూరకొనక మాన పరిచితుఁడు తలుపుపై సత్తువకొలఁది తన్న దొడఁగెను. ఎడతెఱపిలేక కడువడిగ నది యూడి నేలఁ బడులాగున నాతఁడు తలుపుఁ దన్నుచుండుటచేఁ బుట్టిన భీషణధ్వనివిని, త్రోవ కావలివైపుననున్న మేడతలుపుఁ దెఱచుకొని ఒక పరిచారకుఁ డీవలికి వచ్చి నిలువంబడి ఆ వింత జూచుచుండెను — ఉత్తేజితుఁడై భవనమంతయు బ్రతిధ్వనించులాగునఁ బదాఘాతపరంపరలకు ద్వారమును గురిఁజేయు మేక్సిమును జూడఁగనే ఆతఁడు మిగుల విస్మయ పడిపోయెను. ఆ భృత్యునిజూచి, పొంతనున్నవాఁడు కాన, అతని కా యూఁడుదాని విషయ మించుక తెలిసియుండునని యోచించి, మేక్సిము మెల్లగ వాని కడ కరిగెను. యువకుని రూపుఁ గాంచి, ఆతఁ డే దేని యున్నత శ్రేణిలోనివాఁ డని పరిచారకుఁ డూహించెను. మేక్సిము చేతనున్న నాణెమునుగూడ నాతఁడు చూచెను. లుబ్ధనేత్రుఁడై యువకునివిలోకించి టోపీతీసి యాతఁడు సలామొనరించెను.

"ఆ వింతమానిసి పొగరుఁబోతువలె నున్నాడు"

"చిత్తము — ప్రష్యావాఁ డట్టివాఁడేనండి"

"ఏమి? — అతఁడు ప్రష్యావాసియా?"

"ఎక్కడివాఁడో సరిగఁ జెప్పజాలను. అన్ని భాషలనుకూడ వాఁడు ధారాళముగా మాట్లాడఁగలఁడు! ఆ మేడ నాతఁడు కావలికాయును.

"మఱెవరైన నా మేడలో గాపుర మున్నారా?"

"లేరు. నేనెపుడును ఎవరిని ఆగృహమందుఁ జూడలేదు."

"ఆయింట నొక భద్రాంగన వసించుచుండెనని యనుకొంటిని."

"భద్రమహిళ యెవర్తుకైన నందు వసించుట యసంభవము.

ఆయింటి కే మానవులు వచ్చిపోవుట నే నెన్నఁడుఁ జూడలేదు. మేడ మాత్ర మెదురుగఁ జూపట్టుచుండును! అందు మీరు చూచిన వింత మానిసి యొక్కరుఁడు తక్క నిఁకెవరును వసించుటలేదు. ఆతనితో సఖ్యము సలుప మేమెంతో యత్నము సలిపితిమి. కాని మా ప్రయత్నము వ్యర్థమైపోయెను — మావంక వాఁడు తలయెత్తి చూడనైనఁ జూడడు."

"సార్జెంటు దొరసాని యను నామె ఆ మేడలో వసించుచుండె నని తలంచితిని"

"ఆపేరుగల వృద్ధనారి యొకతె కలదు. కాని ఆపె భద్రమహిళ కాదు — ఒక యంగడీ యం దామె యుండును!"

"నేను వెతకుచున్నది యామెఁ గాదు. ఆమె సుందరి — జవ్వని!"

"అట్లైన నామె మీ కన్యవిలాన మెసఁగి యుండును."

నాణెమును భృత్యునిచేతఁబెట్టి మేక్సిము వెడలిపోయెను. తెరవున నడచుచు నాతఁ డీ తెఱగున యోచింపదొడఁగెను: "రహస్యముపై రహస్యము ఘనీభూత మగుచున్నది. నృత్యకామిని నిక్కముగ నన్ను మోసగింపవైచెను! కాని ఆమె కాయింటి తాళముచెవి యెట్లు లభించెను? నిక్కముగ నాయింటికిని నీవిక్రృతాకారునకును పరిచయ ముండియుండును. వింతమానిసి ముఖమునఁ గ్రౌర్యము తాండవ మాడుచుండెను. ఈ పల్లెయందలి వా రెవరును ఆపె నెఱుఁగకపోవుట కడు విచిత్రముగ నున్నది! నా కంతయు నద్భుతముగఁ దోఁచుచుండెను — మంచిది, ఏమి జరుగునో చూతును. నేనును ఒకపట్టున విడుచువాఁడను కాను! ఆసుందరిని దప్పక వెదకి పట్టుకొందును. ఆ మేడపై నన్ని వేళల నొక కన్నువైచి యుండుమని జర్జెటును హెచ్చరించెదను."

ఇంచుక సేపటిలో రుకార్డునేటను తావు నాతఁడు చేరుకొనెను. జర్జెటు పితామహియున్న నెలవును గన్గొనుట కాతనికి విశేషకాలము

పట్టలేదు. ఆ పల్లియ నిప్పచ్చరనిపీడితులకు మాత్రము నిలయమై యుండెను ! — కష్టజీవులుమాత్రమందు వాసము సలుపుచుందురు.

నిర్దిష్ట నిలయమును సమీపించి యువకుఁడు తలుపుఁదట్టెను. మొట్ట మొదట నెవరును బలుకలేదు. కాని, ఇంటిలోపల నెవరికంఠస్వరమో వినఁబడెను. ఎవరో తనగళనాదము విని యులికిపడి చివాలున లేచి నిలువంబడినట్టు లొక వింతశబ్దము యువకుని చెవులఁబడెను ! పిదప నాధ్వని యాఁగిపోయెను. ఒకస్త్రీవిగ్రహము అద్దముల కిటికీ కడకు వచ్చి నిలువంబడెను. మేక్సిము తలుపుఁద్రోసి చయ్యన లోపలఁ బ్రవేశించెను. గవాక్షనికటమున నిలువంబడియున్న యాఁగుది యతాత్తుగ నాతని త్రోవ కడ్డమువచ్చి "అయ్యా ! ఎవరికొఱకై లోపలఁ జొరఁ బడుచుంటిరి ?" అని ప్రశ్నించెను.

"పిరియాక్ దొరసాని యెచట ?"

"నేనే యామెను. మహాశయా ! తమ నామధేయము !"

ఆదరగర్భితమైన నాపోలఁతి ప్రసంగమునకు మేక్సిము విస్మితుఁ డాయెను.

ఆకాంత కుంతలములు శుభ్రములై యున్నను, ఆమె తనువునుండి విగతయౌవనస్మృతి ఇంకను నదృశ్యము కాలేదు. దానంజేసి ఆమెను జూచినంతనే ఒకప్పు డామె సుందరియై యుండెడిదని తోఁపక మానదు.

"నేను వర్జున్‌గారి మేనల్లుఁడను.

పిరియాక్ దొరసాని యానుడువు విని కడుంగడు నచ్చెరువుపడి కొన్ని నిముసము లట్లే నిలువంబడి యుండి, పిదప సమ్మాన పుర స్సరముగ "రండు — లోపలికి దయచేయుఁడు. మావంటి పేదలయింట మీవంటివారు కూర్చుండుటకుఁ దగు యాసనమైన లే" దని లోపలకి దారిఁ దీసెను.

గృహాభ్యంతరమున కరిగి మేక్సిము విస్మితుఁ డాయెను.

అభ్యంతర యాగారము విశాలమై యుండెను. కష్టజీవులుండు వాసము లేవియు నీచాడ్సున నుండవు.

"మహాశయా! కూర్చుండుడు. నా మనుమఁడు మీమాటఁ దఱచుగాఁ జెప్పుచుండును."

ఆసనముపై నుపవిష్టుఁడై "ఒకనాఁ డాతఁడు నాకెంతో యుపకారముఁ గావించియుండెను. ఆ యుదంత మంతయు మీ కాతఁడు తెలిసియుండెనా?" యని మేక్సిము పల్కెను.

"లేదు."

"నేను వాని సదాచారణమునకు సంతసించితిని. వాని క్షేమైనఁ బారితోషిక మీయ వాంఛించుచుంటిని. కాని పసివాని కిట్టి పనదనము —"

"మీకృపకుఁ గృతజ్ఞులము. కాని మేము పసదనముగాని పైకము గాని అపేక్షించువారము కాము. నా మనుమఁడు వలయునంత విత్తమును సంపాదించుచుండెను. నేఁగూడ నలసస్వభావను గాను. అందుచే మా కోరుల సాయము నిష్ప్రయోజనము మీ వాంఛను పలుమాఱులు వ్యక్తీకరించి నామనను నొవ్వఁజేయరని నమ్మెద."

తనవాంఛను దెలుపుట పొరపాటని మేక్సిము గ్రహించి, మనసున నించుక కించపడెను. కాని, ఆమె మనసు నెట్టులైన మరలింప నుంకించి యువకుఁ డిట్లనెను. "బాలకుని విషయమై మా మేనమామగారితోఁ జాల జెప్పితిని. త్వరలో వానిజీతము హెచ్చింతునని అతఁడు మాట యిచ్చెను. దాయిత్వపూర్ణమగు గార్యభార మాతనిపైఁ బెట్టఁబడును."

"మీసదుద్దేశమునకు మీయెడ కృతజ్ఞనై యుందును. తండ్రివలె నా మనుమఁడు సైనికుఁడైన లేక నావికుఁడైన గావలయునని నా కోరిక. శీఘ్రముగ మాకుట్టు డావృత్తులలో దేనియందైనఁ బ్రవేశించుటకు వలయు కౌశల మలవడఁ జేసికొనును. కొలీ యుద్యోగమున

బాలుఁ డనవరత మంటిపెట్టుకొని యుండవలెనని నే నించుకైన వాంఛించుటలేదు."

"ఇయర్లాకాజ్ఞి యనురోధముకతనఁ దన యధీనమున బాలకుఁడు యుద్యోగముఁ బడసెనని నా మేనమామగారు వచించిరి. ఆ రాణికిని మీకును జాలపరిచయ మున్నదా?"

"లేదు. నా పుత్రునకును ఆమెకును రష్యాదేశమం దించుక పరిచయము కలిగెను. అపు డామె చిరుతప్రాయముదై యుండెను. పేరిసు నగరమున కరుదెంచి, నా మనుమని కొఱకై వెతకి వాని నామె కొనిపోయెను. పిదప గుఱ్ఱనికీపని దొరకెను. అందుల కామెఁ డనమ్మతిఁ దెలుపలేదు. నేనుకూడ అపుడాపని కెట్టి యడ్డు పెట్టలేదు. కాని నా మనుమని అచిరకాలములో నావికావృత్తియందుఁ బ్రవేశపెట్టఁదలఁచితినని ఇయర్లాదేవికి వ్రాయుదును. అందుల కామె యీయకొనకపోదని నా యాశ."

ఆ యూఁడుదాని వాక్కుల తీరు మేక్సిమునకు విస్మయకరమై చూపట్టెను! సాధారణస్త్రీలకంటె నామె యధికశ్రేణిలోనిదని అతఁడు గ్రహించెను.

మేక్సిము — ఒకప్పుడు నీ మనుమఁడు నాజీవముఁ గాఁపాడెను. అందుచే నే నాతనియెడఁ గడు కృతజ్ఞుఁడనై యుంటిని. ఒకనాఁటి నిశి రుజొప్రా యం దొకపథమున నేను విపాదమునఁ బడిపోతిని. సార్జెంటు దొరసాని యనునామె సేవతుకనైన మీరెఱుఁగుదురా?"

కూరుచున్న తావునుండి చివాలునలేచి, గంభీరవదనయై వృద్ధాంగన యిట్లనెను: "మహాశయా! నేనెచటను దిరుగుదాననుగాను. రుజొప్రా యను నొకపల్లె యున్నట్లే నే నెఱుఁగను. సార్జెంటుదొరసాని యెవ తెయో నే నెఱుఁగనే యెఱుఁగను. సాధారణముగా నాయింటి కెవ

రును రారు. నేనుగూడ నెచటికిని బోవుదానగాను. పరులయిండ్లఁ గాలిడుట నాయలవాటుకాదు."

ఇఁక నందుండి మెల్లగ నిష్క్రమించుటయే యుచితమని యోచించి మేక్సి యిట్లనెను. "మీ సమయ మంతయుఁ జెఱచితినని మనసునఁ గినియకుడు. నే నిచటికి వచ్చినపుడు లోపల నెవరితోడనో మీరు ప్రసంగించుచుంటిరి కదా? వారు—"

"నేనొక తెనే యుంటిని. ఎవరును నాయింటలేరు. నాకుజ్జనికొఱకై తాము—"

"ఏమి! మీరొకరే యుంటిరా? నిక్కముగ మీ నిలయమున నేను మఱొకరి కంఠస్వరము వింటిని!"

"అట్లని యనుకొంటిరిగాని — నిక్కముగ వినియుండలేదు? నా మనుమనియందు మీకుఁగల కృపకై వేయివందనము లర్పించు చున్నాను. కాని మహాశయా! మాకు ఎవరిసహాయము అక్కరలేదు!"

పరిభవచిత్తుఁడై కుంఠితుఁడై మేక్సిము మెల్లగ నందుండి చనెను. వృద్ధాంగన ప్రోలఁ బనికిమాలినవాఁడ నైతినని యాతఁడు యోచించెను. ఆమెకును ఇయుల్టాదొరసానికిని నిశ్చయముగఁ గాఢ స్నేహ ముండెననియు, ఆమెపల్కులు విశ్వసనీయములు కావనియు, ఆమె వాక్కులయందలి రహస్యమే మో కన్గొనితీరవలెననియు, జర్జెటు సాయము తనకుఁ గావలసియుండుననియు, ఆబుడత నెట్టులైన మఱపించి గుట్టుసంతయు వెలుపలికిఁ దీయవలయుననియు, యువకుఁడు తలఁచెను.

ఇంచుక ఆఁకలి గొనియుండుటచే సమీపమునఁగల భోజనశాల కరుగ నాతఁడు నిశ్చయించి, కొంతదూరము ముందునకుసాగిపోయెను. మిగుల సొంపుగ నలంకరింపఁబడిన బండి యొకటి అపు డకాత్తుగ వాని కంటఁబడెను. బండి ఆతని వెనకే వచ్చుచుండెను. యువకుఁడు ప్రక్క నిలిచి, బండిపైఁ దృక్కులఁ బరపెను. శకటమం దిరువురు కూరుచుని

యుండిరి. వారిలోనొకఁడు మేక్సిము కంటఁబడకుండుటకై యత్నించుచు, శిరము నాసన నిమ్నమునకు వంచుకొనెను. యువకుఁడు దానిని గను పెట్టెను — ఒక్కచూపుతో మేక్సిము రాబర్టును గుర్తింపఁగలిగెను.

బండి వెడలిపోయెను. మేక్సిము నడచునట్లు యోచింపఁదొడఁగెను. "ఇది కడు నబ్బురముగ నుండెను. రాబర్టట్టి సాహసుఁడని నేఁ దలంపలేదు. ఆతఁ డింతటి దే యుండెనని వింటినిగాని, ఎందును అడంగియుండక, శకట మెక్కి ఆతఁ డిట్లు విచ్చలవిడిగ దిరుగుచుండెనని నేనూహింపనైన లేకపోతిని. కర్నలు బెరిపవున కాతనిపైఁ గల సందియము వట్టిది కాదు. పెద్దపెద్దవారితో వానికి గాఢమైత్రియున్నట్లు తోఁచుచున్నది! రాబర్టు పక్షము నవలంబించి, — ఆతని యుద్ధారార్థము, ఛిన్నహస్తరహస్యమును గన్గొనఁ గంకణముఁ గట్టుకొని, కాని శ్రమకు లోనగుచుంటిని. ఇందు నాకిపుడు తోఁచు నిజమును ఎలిసునకుఁ దెలిపిఁ రాబర్టు నడవడి ఆమేడియుకు బోధించి, తనకోరిక నడంచుకొమ్మని వేఁడుదును — అట్లు చెప్పుటయుగాక ఏదేని యుక్కట్టునఁ బట్టుపడకుండ మెలఁకువతో మెలఁగుమని ఆమెను హెచ్చరించుట నా కర్తవ్యము! రాబర్టు చరిత్ర మంతయు గభీరసందేహగర్భితమై, శంకా సంకలితమై యుండెను!!"

మేక్సిము యొక హోటలులోఁ బ్రవేశించెను. భోజనము సిద్ధముగాక మున్నాతఁడు సమ్ముఖమందున్న వార్తాపత్రికను గైకొని, అందలి యంశములను బరికింపఁదొడఁగెను. ఆకస్మికముగ నాతనిదృష్టి పత్రిక యందలి ఈ పంక్తులపైఁ బడెను:

"ఘోరతర రహస్యము!"

"గడచిన బుధవారమునాఁ డపరాహ్ణసమయమున నొకయద్భుత ఘటనము జరిగెను! ప్రదర్శనార్థమై శవవ్యవచ్ఛేదాలయమున నుంపఁబడిన ఛిన్నహస్త మాకస్మికముగ నంతర్హితమై పోయెను! కరము నపహ

రించిన దెవరో, – ఏవిధముగ నది యపహృతమాయెనో ఇంతదనుక ఇంచుకైన నాచూకి తెలియరాలేదు !! ”

వార్తఁ జదివి మేక్సిము నిర్విణ్ణుఁడై పోయెను. తనకుఁగూడ శీఘ్రకాలములోఁ జేటు మూడనుండెనని ఆతఁడు భయమందెను. మొండి చేయి నపహరించినట్లే కంకణమునుగూడ దొంగిలించుకొని పోవుటకై నిశ్చయముగఁ జోరులు యత్నింతురు. సాధారణులవలె వారు చూపట్టుటలేదు. వార్త లన్నియు నెప్పటికప్పుడు వారి నఖాగ్రములందుండెను! ఛిన్నహస్తాపహారణమును, నృత్యకామినీ పరిచయమును నిశీథనీయాక్రమణ విషయమును, ఒక్కమాఱుగ మేక్సిము చిత్తవీధిని ద్యోతకమాయెను? చేయి ఛిన్నమైనయనంతరమే యెంతటి యోఁడుది యైనను బహిరంగ ప్రదేశమున నృత్య మొనరింపజాలినదై యుండదు. అందుచే సార్జెంటు దొరసాని పేరుఁ బూనిన నృత్యమహిళ చోరకామిని యై యుండదు. కాని ఆదుష్కృత్యమునకుఁ బూనుకొనిన దళములో నామె యొకతయై యుండవలెను! ఇంతటినుండి మిగుల జాగరూకుఁడనై యుందును. ఎట్టి సుందరపు కాంతనైన నే నిఁక విశ్వసింప ” నని వితర్కించుకొని పత్రికను ప్రక్కనిడి యువకుఁ డాహారమునకుఁ గూరుచుండెను. భోజన మించుమించుగ శేషించుతఱిఁ బూర్వపరిచితుఁడైన విలాస నను చికిత్సకుఁ డా యాగారమునఁ బ్రవేశించెను. దరహాసితముఖమండలుఁడై, ప్రసారితహస్తుఁడై భిషగ్వరుఁడు మేక్సిము సమీపమున కరుదెంచి, కరచాలనము సలిపెను. నికటమందలి యాసనమం దాతఁ డాసీనుఁడు కాఁగనే మేక్సి మాతని నుద్దేశించి, “ఆనాఁడుగాక మీ దర్శనము మరల లభింపలేదు. విశ్రామమందిరమున మీ కొఱకై చూచుచుంటి ” ననియెను.

“ఈ నడుమఁ గొన్నినాళ్ళనుండి ఒకరోగికిఁ జికిత్సఁ జేయుచు తెఱపిలేక యుంటిని. అందుచే నెచటికిఁ బోలేకపోతిని. ఆరోగి కివు

డివు డించుక గుణము కానిపించుచుండెను. నేఁటినుండి విశ్రామమందిరమున కరుదెంచుచుందును."

"నేఁటి పత్రికఁ జూచితిరా?"

"లేదు. వార్తాపత్రికను జదువుటయందు నాకంత శ్రద్ధలేదు. రాజనీతి యేమో నేనెఱుఁగను. ఎఱుఁగదలచినను, నాకది బోధపడదు. బోధపఱచుకొనవలె నను నభిలాష నాకు లేనేలేదు! ఇఁక సమాచారము లందురా, వైద్యవృత్తియందుఁ గాలిడి పలుతావులం దిరుగు సమయమున నెన్నెని వార్తలు వానికవంత నవి వచ్చి నాచెవులఁ బడును! ఇఁక దినపత్రికను గొని చదువలసిన యక్కఱ యేమి? నా యౌషధములను సేవించువారిలోఁ బెక్కులు యాడువారలు. ఆఁడుదాని నోటినుండి ఎన్నెని కబురులు యూరుచుండును!

"అట్లైన ఛిన్నహస్తాపహరణవార్త వినియుంటిరా?"

"వింటిని. అది మిగుల నద్భుతమైన ఘటనము! కైదు భీతిలేక ఒక సామాన్యవస్తువును దొంగిలించుటే సాహసకృత్యము! — పటువుగ దృష్టియందున్న ఛిన్నకరమును దొంగిలించినవాని కెన్ని గుండె లున్నవో యెఱుంగము! కాని, హర్తకు సాధ్యముకాని కార్య మేమియు లేదు!"

"ఈ సంఘటనముగుఱించి మీ కేమి తోఁచుచున్నది?"

"శూన్యము! ఇట్టి రహస్యములను కన్గొనఁజాలు శక్తి నా కావంతయైన లేదు. శక్తిమా టటుండ, నిట్టివిషయములందు నాకుఁగల కౌతూహల మత్యల్పము! ఈయుదంత మిట్లుండ, ఆనాఁటి ప్రణయ దృశ్యము యొక్క పర్యవసాన మెట్లు తేలెను? రంగమందు మీ రిరువురు ప్రవేశించుట మాత్రము చూచి నేను వెడలిపోతిని. తదనంతరము మీ ప్రణయనాటకమున జరిగిన చిత్రమేమో యెఱుఁగను."

"ఆప్రయత్నమున ననుకూలమైన పరిణామము చూపట్టలేదు."

"ఏమి! అట్లని విశ్వసింపను. ఆసుందరియు మీరును ప్రఫుల్ల

ముఖులై కలిసి వెడలిపోయిరి. ఆ వేడుకను కన్నులారఁ గాంచి నే నెంతయో సంతసించితిని !"

సుందరి ననుసరించి చాల దూర మంధకారమున సాగిపోతిని — చెప్పనేల ? ఆమె మేడవఱకుఁ జనితిని. చోరత్వ మొనరించి, అందుండి ఆపె వెన్నంటకముందే నిమేషములో నా లతాంగి విద్యుల్లతవలె గాఢ తమసమునఁబడి నిజాలయమున నదృశ్యమాయెను ! దట్టముగ నలుగడల నలముకొనియున్న చీకటిగుండా నే నామె సౌధమునఁ బ్రవేశింపఁ జాలనైతి అందులకుఁ బూనుకొనలేదు. నన్నట్లా పౌలంతి మేడపొంత విడిచి యంతర్హిత యైనపిదప, పథమున మూవురు బందిపోటులు నన్నుఁ దారుకొనిరి. నా మేనమామగారి కోఠీయందుఁ బనిఁజేయు బాలకుఁ డొకఁడు అదృష్టవశాత్తు అత్తఱి నాకు సాయము నలుపకున్న యెడల నిక్కముగ నేను గొప్ప ముప్పునం బడియుందును."

"ఆ సంఘటన మంతయు నాకు సందేహాస్పదముగఁ దోఁచు చుండెను. సుందరికిని దస్యులకును సంబంధమున్నదని తలఁతును."

నాకుఁ గూడ నా శంకయే కలుగుచుండెను ! కాని ఆ రమణి యాకృతి యాచరణములు రాజ్ఞీసులభములై యున్నవి."

"పైరూపుఁ జూచినంతనే లోకుల స్వభావములను గుఱుతించుట వలనుగాదు. ముఖ్యముగ పేరిసు వనితల చరితము లత్యంత రహస్య గర్భితములై యుండును. వారి యదార్థోదంతము నెఱుంగజాలక పలుపర్యాయములు భ్రమయందుఁ బతితులము కావలసివచ్చును. ఆ సుందరి తన నామధేయముఁ దెలిపెనా ?"

"ఏదో నోటికివచ్చిన పేరును దెలిపెను -- 'సార్జెంటు దొరసాని' నని యాపె చెప్పుకొనెనుకాని అది బూటకపుపేరని నాకుఁ దోఁచు చుండెను. నిక్కముగ నానారి చరితమంతయు గభీర రహస్యజాలమున జడితమైయున్నది. ఈకొలదిమాత్రపు దినములలో ఆమెనుగుఱించి

ఎన్నెన్నియో విచిత్రములను వింటిని. విపదవస్థయందు నాకుఁ దోడు పడిన బుడుతఁడు ఇయట్లారాజ్ఞి యదుపాజ్ఞలయం దుండెనఁట ! — అట్లని తాము విశ్వసింపరేమో యని యూహించుచుంటిని. ఇయట్లా దొరసానిని మీరెఱుఁగుదు రనుకొనెదను."

"నిక్కముగ నెఱుఁదును. నేనామె యింటివైద్యుఁడను. ఒక పర్యాయము రమ్మని ఆమె నేఁడు నాకుఁ గబురుఁ బంపెను. భోజనానంతరము నేనచటికిఁ బోదును."

"ఇటలీనగరమునకుఁ బరిభ్రమణార్థ మామె చనెనని నామేనమామగారు సెప్పిరి. నేఁడీకబురేమి ?"

"ఇటలీనుండి ఆమె నిన్నఁ దిరిగివచ్చెను. పర్యటన మిప్పు డాపడఁతికి పడినదికాదని తలఁచెద. అందుచేతనే ఆమె నాకొఱకై కబు రంపి యుండును."

"ఆమెయింటి వెజ్జువైనపు డామెనుగుఱించిన విషయము లెన్నియో మీకుఁ దెలిసియే యుండును. లోకులకడ ఆమెనుగుఱించిన చిత్రకథల నన్నింటిని వినినంతనే, ఆకాంత కాహిని యంతయు నరేబియాదేశపు యవనయామినీ వినోదములందలి రాకుమారి చరిత్రము చాడ్పున నున్నట్లు నాకుఁ దోచెను."

"అవును — అది యసత్యముకాదు."

"ఆపె రాజధాని యెచట ?"

"నేనావివరము నెఱుఁగను. కాని ఆ రమణి అతులైశ్వర్య శాలిని యనియుఁ జంచల చరిత్ర యనియు మాత్ర మెఱుఁగుదును. ఒకే తానమున నామె పలుదినము లుండ నిచ్ఛగింపదు."

"ప్రతి రష్యాసీమ రమణి ప్రకృతియు నట్టిదియే !"

"కాని ఆమె రష్యాదేశపుఁ బురంధ్రియని నే నూహింపను."

"కాని రష్యావిషయమున నాపె నేఁ జెప్పిన బాలకుని జనకుని పరిచ

యమం దుండెననియు, వా రిరువు రొకరికొకరు పలువిషయము లందుఁ దోడ్పడై యుండిరనియు వింటిని."

"పిన్నవయసున నొకవేళ ఆమె రష్యాయందు వసించి యుండును. కాని ఆమె జన్మస్థాన మాసీమకాదు. సుల్తాను యధీనమందలి దేశ మామె జన్మభూమియై యుండును. ఎవఁడేని గ్రీకు రాకుమారునితో నామెకుఁ బరిణయము జరిగియుండును. కాని సుమారు మూఁడేండ్లకు మున్నే ఆపడఁతి పతిఁ బరమపదించెను."

"ఆమె వయ సిపు డెంతయుండును. !"

"నేనామాట ఆమె నెపుడును అడుగలేదు. కాని ఆకాంతకు రమారమి ముప్పదేం డ్లుండునని నా యభిప్రాయము."

"ఆ యాఁడుది మిగుల సుందరి గాఁ ? — దూరమునుండి చూచు టచే, నామె వదనమండలమును బాగుగ వీక్షింపలేకపోతిని."

"ఆమె యందమును గుఱించి విపులముగ నేనేమియు జెప్పఁ జాలను. కాని ఆమెతో నెవ్వ రెవ్వరొకరు పర్యాయము ప్రసంగించి యుండిరో, తొడ్తోడనే వారు ముగ్ధులై పోయిరని నిస్సంశయముగాఁ జెప్పఁగలను!"

"నిక్కముగా నామె మనోమోహినియై యుండవలెను."

"వీరోచితములగు వ్యాయామము లన్నిటియందు ఆ యింతి యారితేరినది. కత్తిసామునందును, వేటాడుటయందును, ఆరమణిని మించినవార లేరును లేరని నాయభిప్రాయము. వీరాంగనయయ్యు, నామెనుండి సీమంతినీసులభశాలీనత వీడిపోయెనని వచింపరాదు. వేషవిన్యాసములం దా వధూటి యసాధారణయని చెప్పితీరవలెను. పేరిసు వీడునందలి విలాసినులీవిషయమున నెన్నఁ డామె తలదాఁటి పోజాలకపోతిరి. చిత్రశిల్ప సంగీతాదికళయందుఁ గూడ నా మహిళ కనన్యసాధారణ కౌశలముకలదు. ఇచ్ఛగించినచో, బాత్రధారిణియై

రంగస్థలమునఁ దన యెనలేని హొయలు నంతను జూపుచు, నతి నేరుపున నా కాంతామణి యంతరంగము తనగాన, ప్రదర్శనా నైపుణ్యముఁ జూపఁజాలును! కవిత్వముంకుఁ గూడ నా వాఙ్గంటి యారితేరినది. ఇన్ని విద్యలం దిట్టి కౌశలముఁ జూపినవారిని నే నీవఱలోఁ బురుషులందుఁ గాని స్త్రీలందుఁగాని వీక్షించియుండలేదు. ఇన్నిదినాలనుండి మీ రామె పరిచయముఁ బడయజాలకపోవుట నాకు మిగుల నబ్బురముగఁ దోఁచు చున్నది. మీయయ్యలందఱా నెలంతను బాగుగ నెఱింగియుందురు."

"అనుదిన మా యింతి నిలయమున నృత్యాది శృంగారక్రీడలు జరుగుచుండునని వింటిని. కాని ఎల్లవేళల విలాసకృత్యములందు నా మనసు సొరదు. అంతియగాక గుంపులుగుంపులుగఁ గూడినవారిఁ గలిసి వేడుకఁ జూచుటకు నాయుల్లమొల్లదు. అందుచే నే నెపుడును అపె ఖేలనా ప్రాంగణమునఁ గాలిడలేదు."

"జననీలోకమందు లేనపుడే మీరచటికిఁబోవచ్చును. మీ కేమియు నభ్యంతరము లేనిచో, ఆమెతో మీకుఁ బరిచయము నే జేయింపఁ జాలుదును."

"ఏ యధికారమున?"

"మైత్రియధికారమున నన్నుఁ దమ నెయ్యరిగ నంగీకరింపరా? ఇయ్యట్టా అన్నివిషయములందు విశ్వసించును. నిర్బోధయువకునిగాని మూర్ఖునిగాని నే నాపెకడకుఁ గొనిపోవువాఁడను గానని ఆమె యెఱుఁ గును. ఒరుల చిత్తముల రంజించి, వారి నాకర్షించుకొనఁజాలు శక్తి మీకుఁగలదు. తఱచుగా మీ రాతని కడకుఁ బోయి వచ్చుచున్న యెడల నామె నిక్కముగఁ బ్రమోదసంభరితస్వాంత యగును. ప్రస్తుతము సహచరుఁ డెవఁడును లేనికతన ఆసుందరి నంతప్తహృదయై యుండెను!"

"భిషగ్వరా! మీనుడువుల కచ్చెరు వొందుచుంటిని. విదుషీమై

ధనవతినై, సుందరినై, ఉన్నతవంశజనైన నాపె ప్రణయమునకుఁ బాత్రుఁడైన వాఁ డెవడును లేఁడా?"

"నాకుఁ దెలిసినంతవఱకు, దనజీవనమున నియట్లా యెవనినిగాని ప్రేమింపలేదు! భగవానుఁ డామిన్న కెన్నియో గొనములొసంగెను. గాని ఒక్క హృదయముమాత్ర మీయలేదు. హృదయమే యున్న యెడల, సర్వసద్గుణసంపన్న యనియుఁ రమణీకులమున కంతకు నాదర్శప్రాయమనియు నాపె యనర్ఘమగుప్రతీతిఁ బడసియుండును!"

"ప్రతి వారికిని హృదయమున్నది కాని, ఒక్కరొక్కరి కది యున్నట్లు ప్రథమమునఁ దెల్లముకాదు. అయినను కొంతకాలములో నది తెల్లము కాకమానదు."

"ఇయట్లా దొరసాని నెంతయు శ్రద్ధతోఁ బరీక్షఁజేసి చూచితిని. ఆమె కల్పనాశక్తి యత్యుత్తమైనది. కాని అంనువారికి ముఖ్యముగ నుండవలయు ననుభూతిశక్తి అపె కించుకంతైన లేదు. ఆ తెవ్వలున కెట్టి యౌషధమును మా వైద్యశాస్త్రమున నిర్దేశింపఁబడలేదు — ముందే మి మ్మప్రమత్తులఁ జేయుచుంటిని. ఆమెతోఁ బ్రేమచర్చ సలుప నుంకించితిరేని, యీ యాశ వృథ యగుట నిక్కము. ఊరక కాలహరణమగును?"

"ఆ విషయమున నిశ్చింతులై యుండుఁడు. ప్రేమచర్చ సలుపుటకు నాకు వ్యవధిలేదు. ఆమె సుందరియే కానచ్చును? — సౌందర్యఖనులైన మానినులఁ గేవలము ప్రశంసింతును, అంగనుల సౌష్ఠవమును పవిత్ర చిత్తుఁడనై యుగ్గడింతు నంతియే! కౌతూహలమును చరితార్థ మొనరించుటకే ఆమె పరిచయము నపేక్షించుచుంటిని. ఆమె ప్రతిపాలన మొనరించు బాలకునిగుఱించి కొన్ని విషయముల నెఱుఁగవలె నను నుద్దేశముకూడ నాకుఁ గలదు."

"మంచిది అట్లైన నచటి కెప్పుడు రాదలఁతురో చెప్పుఁడు."

"మీరాయిప్టను వచ్చెదువారములో నాపెను జూడఁగూడదా ?"–

"అంతవరకు ప్రాయశః ఆమె యిందుండదు. – అమెరికా లేక రష్యా ఆమె చనును. తలిదుగ నామె కాన్‌స్టాంటినోపిల్సునకుఁ బోవుచుండును. రేపటిదినమున నామె ఏమొనరించునో, నేఁడు చెప్పఁజాలము. – ఆమెయైనఁ జెప్పనేరదు ! నేఁడే మీరు నావెంట వచ్చుట కభ్యంతర మేమున్నది? అకస్మాత్తయాలాపమన్న నామె కధి కానందము."

"నేఁటి యపరాహ్ణము రెండు గంటలప్పుడు నా కొక తావునఁ బనియున్నది."

"అప్పటివరకు నూరకనే యుందురు గదా బండి కట్టించుకొని, కవుంటెసు కడకు పోవుల కెంతసేపు పట్టును ?"

"ప్రభాతాంబరములను ధరించియే యుంటిని. ఇపుడే మనము ఇయుట్లా కడ కరిగిన మొదలు, నాపె పాన్పునుండి లేచి యుండ దేమో యని యోచించుచుంటిని."

"ఆమె యభ్యాసములను మీ రెఱుఁగరు. సూర్యునితోడనే ఆమె నిదురనుండి మేల్కాంచును. మన మచటికిఁ బోవునప్పటికి కడు దీక్షగ నామె ఏదేని వ్యాయామమునఁ గాలము బుచ్చుచుంటఁ గాంతురుగాక!"

"అట్లైన నడువుడు. రెండు గంటలకు నేను తిరిగి రావలయును సుడీ. దానిని మఱువకుడు."

ఒక బండి నద్దెకుఁ గుదుర్చుకొని ఇరువురు కవున్ టెస్ ఇయుట్లా ప్రాసాదాభిముఖముగఁ జనిరి. – వియత్తల మంతయు నవుడు కృష్ణ జలధరాచ్ఛన్నమై యుండెను ! కొంచెము కొంచెముగఁ దుషారపాతము కూడ చూపట్టుచుండెను !

శకటమునఁ గూర్చుండి, "ఇట్టి సమయమున నెలిసు నాపె యుపాధ్యాయురాలు వెలుపలికి రానీయదు. ఒకర్తుక వచ్చుట కామె

సాహసింపదు. అట్లామె ఇలువీడి పోకుండుటే మంచిది. తన కష్టయందలి వేడికోలును బెడచెవిఁ బెట్టెనని యోచించి ఎలిసుపై రాబర్టెంతేని కినియును. గళమునఁ బ్రాణము లున్నంత కాలము తిరిగి ఈదేశము మొగముఁ దాను చూడకుండు టుచితమని నే నా యువకు కునకు బోధింతును.” అని మేక్సిము వితర్కించుకొనెను.

“కవున్ టెస్ ఇయట్లాకు సంబంధించిన కోటీపతి మీ మేనమామ గారేనా యేమి?”

“అవును ఇయట్లా దొరసాని చాల విత్తము నాతని కోటీయందు జమఁ జేసియుండెనని వింటిని.

‘ఆతని కంటె తగినవా రాపెకు లభింపరు. — మీ బేంకరునకుఁ జాల మంచి పేరున్నది?”

“అవును. విదేశీయులు ముఖ్యముగ రష్యా సీమస్థులు మాకోటీ యందు సొమ్మునుంచుకొందురు. కర్నలు బెరిషప్ అను నాతని పేరు వింటిరా?”

“వినకేమి? — వింటిని. అతఁడు రష్యా దొరతనమువారి యధీన మం దొక గొప్ప యుద్యోగి.”

“రహస్య చరుఁడా?”

“నే నది చెప్పఁజాలను. కాని, ఆతఁడు రష్యా వాహినియం దుండు ఉచ్చపదస్థపామరికోద్యోగి. అతుడైశ్వర్యమున కధిపతియని వింటిని. రష్యా పాలకుల రహస్య కార్యభారము నేదేని పైఁబూని ఆతఁ డిచటికి వచ్చెనని వింటిని.”

“ఇయట్లా దొరసాని ఆతని గుఱుతింపఁ జాలునా?”

“చూచిన వైన గుర్తింపఁగలదు. కాని కర్నలు శత్రువని కవుంటెస్ భావించును. — ఇదిగో, మనము వచ్చితిమి.”

ఒక చిన్న గుమ్మమునకు సమీపమున వారు బండినుండి దిగిరి. "ఇయట్లా దొరసానిం జూడవచ్చినపు డీ గుమ్మముగుండా పోవుచుందును. – ప్రాంగణమునుండిపోవుట కిది దగ్గఱత్రోవ. ఇందుండిచనిన యెడల, నా పెదర్శనము త్వరలో లభించును. సమ్ముఖద్వారముగుండా చనినయెడల, చాల యాలస్యమగును. చీటిఁబంపి, తిప్పవైచుకొని కూర్చున్నపిదప జాలసేపటి కామె దర్శనము చేకూరును" అని వైద్యుఁడు చెప్పెను.

చికిత్సకుఁడు ముమ్మాఱు ఘంట మ్రోయించెను. తోడనే కవాటము తెఱువఁబడెను. ఉభయులు ప్రాంగణమునఁ బ్రవేశించినంతనే తెఱువఁ బడిన తెఱంగుననే తలుపు తనంత నది మూయఁబడెను!

మేక్సిము – నాట్యరంగములయందలి ఏర్పాటు వలె నున్నది. కవాటము దానికదే తెఱువఁబడి మూయఁబడుచుండెను. పరిచారకుల గడబిడ యడావిడులకుఁ బొల్పడనక్కఱలేకుండ నీ యుపాయము చాల యనుకూలముగ నున్నది."

ఇయట్లా దొరసాని భవనమున వైద్యునకు సర్వస్వాతంత్ర్య ముండెనని మేక్సిము గ్రహించెను. తన యిచ్చవచ్చినట్లా చికిత్సకుఁడు దానిలోనికి వచ్చుచుఁ బోవుచు నుండవచ్చును. రమ్యమైన ఒక యుపవనము గుండా ఆతఁడు యువకునిఁ బ్రాసాదాభిముఖముగఁ గొనిపోయెను. నలుదిక్కులందును నానావిధములగు వృక్షములు ఫలభార సమన్వితములై అవనతశీర్షములై యుండెను. కొమ్మకొమ్మలందును బ్రసూనములు ప్రస్ఫుటితములై నగుచుండెను! ఆ సుందరదృశ్యమును విలోకించి మేక్సిము నిక్కముగ ముగ్ధుఁడై పోయెను.

వైద్యుఁడు – రాణి ఇపుడు బిలియర్డ్సు నాఁడుచున్న దనుకొనెదను.

"ఏమి! ఆమె బిలియర్డ్సు నాడు టెఱుంగునా?"

"అన్ని యాటలందును ఆమె యారితేరినది. చతురంగమున

నామెకుఁ జాలినవా రెవరును లేరు. నాకుఁగూడ నా యాటయందుఁ బ్రవీణత కలదు; కాని నే నామెతో నాడి పెక్కుమాఱులు లోడితిని."

"ఆ యింతి ప్రణయమునకుఁ బాత్రు లెందును నెందులకు లేరో నే నిపుడు గ్రహించితిని. అజస్రము ఖేలనాభిరతి నుండుటచే, సమయము లేనందున నామె ఎట్టి ప్రేమచర్చకు గడంగదు. ఇపు డెచటికి నన్నుఁ గొనిపోవుచున్నారు? హర్మ్య మంతయు యక్షిణీసంభూత మైనట్లు తోఁచుచున్నది!"

"పలువిధవస్తువులు గేహాభ్యంతరమున విరాజిల్లుచుండెను. తర వారి క్రీడామందిరములును, పిస్తలు యుద్ధాంగణములును ప్రతిమా గారములును — ఇవియవి యననేల పలువిధోపకరణముల కాల వాలమై ఈనిలయ మొప్పారుచుండును. కన్నులార వీక్షింపుడు."

"కాని, ఇవియన్నియు నిశ్శబ్ద గాఁవులేక నుంపఁబడెను! ఈసౌధా వస్థఁబట్టి జూడ మనము సుషుప్తిమగ్నయైన రాజకన్య మాయాపురిఁ జొచ్చినట్లు తోఁచుచున్నది!"

"కాని ఇచటి 'రాజకన్య' సుప్తిమగ్న కాలేదు—అదిగో! వినుఁడు."

చికిత్సకుఁడు యువకు నొక కాచవాతాయనప్రాంతమునకుఁ గొంపో యెను. అస్త్రఘర్షణత్కారరవము మేక్సిము కర్ణములఁ బ్రవేశించెను.

వైద్యుఁడు — అస్త్రశిక్షకునితో నియట్లారాణి సాముఁ జేయు చున్నది. మీరు కత్తిసాము నెఱుఁగుదురా?

"ఇంచుక ఎఱుఁగుదును. తరవారిక్రీడ యన నాకెంతేనియిష్టము."

"మంచిది. తగినయుజ్జీదారు ప్రోల దనయస్త్రచాలనాకౌశలముఁ జూపుట కా సీమంతిని మిక్కిలి మక్కువపడును."

చికిత్సకుని యుద్దేశమున కనమ్మతిఁ దెలుప యువకుఁ డుంకించెను. సంపూర్ణాపరిచితుని ప్రోలఁ గత్తిసామునకై నాకాంత నిలుచు టంత యోగ్యముగఁ జూపట్టదని ఆతఁడు యోచించెను. కాని యువకు

డేమియుఁ బలుకకమున్న జికిత్సకుఁ డాతనిఁగొని పార్శ్వగృహమధ్యమునఁ బ్రవేశించెను.

ఇయట్లాయపుడు కత్తిసామునకు వలయువేషము ధరించెను. ఆమె ముఖమండలమంతయు గవిసెనచే నావృతమై యుండెను; అందుచే నామె సుందరియో కాదో ఎఱుగుట కపుడు వీలులేకపోయెను.

"వైద్యమహాశయా! జోహారులు. ఒకించుక తాళుఁడు. ఈ రొక్క వలయము ముగిసినపిదప మీతో మాట్లాడుదును."

ఇయట్లా తన్ను వీక్షింపలేనట్లు మేక్సిమునకుఁ దోచెను.

క్రీడానంతరమున శిక్షకునకు సెల వొసంగి రమణి సుందునకు విచ్చేసెను.

వైద్యుడు — జోహారులు! వాతపునొప్పి మీ కత్తిసామున కెట్టి లోపముఁ దెచ్చినట్లు తోఁచుటలేదు.

"మీ రౌషధమును దెచ్చితిరా! వాతము వామహస్తమం దెక్కుడుగ నుండెను. మం దొసఁగుడు. మూడు నాలుగు దినములలో సంపూర్ణగుణము కానిపించవలెను" అని పల్కుచు పొలంతి తన మొగమును గప్పియున్న గవిసెనఁ దీసివైచెను. ఆధూటివదనమును వీక్షించి మేక్సి మబ్బురపడిపోయెను. పాశ్చాత్యరమణులందు సౌందర్యమునఁ బ్రథమగణ్య యామెయే యని యువకుఁ డూహించెను. ఆకాంత మేను తుషారశుభ్రమై యుండెను! — ఓష్ఠాధరములారక్తములై ప్రస్ఫుటితము లై యుండెను. గ్రీకుసీమ శిల్పనిర్మితప్రస్తరమూర్తి నాసిక న్యాయమున నానారి ఘ్రాణము సమున్నతమై, సుందరమై యుండెను! ఆపల్లవోష్ఠి నయనయుగళము సుందరమై, చంచలమై పరివర్తనశీలమై, ఒక్కొకపుడు నభంబున్యాయమున గాఢనీలసమన్వితమై, ఇంకొకప్పుడు సంక్షుభితమహోదధిచాద్పున నీలాభసంయుతమై మఱొక్కకపుడు శీతాభ్రమభంగి ధూసరజ్యోతి విశిష్టమై

యుండెను!! భావవైచిత్ర్యముతో గూడ అనుక్షణ మా వనజాక్షి చక్షులందు వర్ణపరివర్తనము నూపట్టుచుండెను!!!

యువకుఁ డాయువతి యపూర్వలావణ్యమునకు విస్మితుఁడై, ఆనన, బోడి సోయగంపు తలఁపునఁ బూర్తిగ నభిభూతుఁ డైపోయెను. సాధారణ రమణులకంటె నాపల్లవాంఘ్రి సొబగు పెక్కుమడుంగు లెక్కుడని మేక్సిము తృటిలో గ్రహించెను.

వైద్యుఁడు — నేఁ జెప్పిన ట్లాచరింపుడు. తెవులు యచిరకములో మాయమగును. స్వాంతము సర్వదా అన్యవిషయములందు వ్యాపృత మొనరించు టవసరము. అశ్వచాలన మత్యంత యుత్కృష్ట వ్యాయామము. నావేడుక చెలిమికాండ్రలో ముఖ్యుఁడగు మేక్సిము వర్జర్సును మీకడకుఁ గొనివచ్చితిని."

సమయానుకూలమైన మాటల నొకటి రెండు పలుక మేక్సిము యత్నించెను. కాని అపు డాతని నోటి కేనుడువులు రాలేదు. అందుచే నాయువతి కభివాదనము మాత్రము సల్పి యువకుఁ డప్పటికిఁ దృప్తుఁడాయెను!!!

ఇయుల్లా — డాక్టరుగారి ప్రియమిత్రులు నాకుఁగూడ బ్రియమిత్రులే! కోశీపతియగు మాంసియేవర్జర్సుగారికి తామేమైన నగుదురా?

"నే నాతని మేనల్లుఁడను."

"అట్లైన మీ రపరిచితులు కారు. ఆతనికిని నాకును బరిచయ మున్నది. నా ప్రేమాలఁ బ్రేమ భాజనుఁడై యున్న ఒక బాలకుని ప్రతిపాలన భారముఁ గైకొనినందులకు నేను మీ మాతుల నికటమునఁ గృతజ్ఞనై యుంటిని."

ప్రసంగమునకుఁ దరుణము లభించుట గాంచి ఆనందితమనస్కుఁడై యువకుఁడు — "జర్జెటు విషయముఁ జెప్పుచుంటిరా?" యనెను.

"మీ రాబాలకు నెఱుఁగుదురని తోఁచుచున్నది."

"నిక్కముగ నెఱుఁగుదును. ఒకపర్యాయ మాతఁడు నాకేంతేని యుపకారము గావించినకతన నేనాతని ఋణమున నుంటిని."

"కనుగాయ కుఱ్ఱఁడు మీకొనరించిన మహోపకారమేమి?"

"దుష్టులు కొందఱు నన్ను ముట్టడించి, నాయొద్దనున్న విత్తము నపహరింపఁజూచిరి. బాలుని సాయము కతన అతికష్టి నేను నాయుసు ఱులను నిలుపుకొనఁ జాలితిని."

"వాని జనకుఁడు నాజనయిత ప్రాణములఁ గాపాడెను. పరజీవన రక్షణ మొనరించుట వారి వంశగత కర్తవ్యమై యుండవచ్చును!"

"మా మేనమామయొద్ద నీవిషయమునేఁ గొంచెము కొంచెము విని యుంటిని."

"బాలకునిపై నేనించుకైన నేమియుఁ గావింపనేరకున్నాను. - ఏమియొనరింపవలెనో తోఁచకున్నది. వయసునఁ జిన్నవాఁడే యయ్యు వాఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడు. వానికేదేని మంచియుద్యోగ మిప్పింప వలెనని యూహించుచుంటిని."

"తన మనుమఁడు సైనిక వృత్తియందుగాని, నావిక వృత్తియందుఁ గాని ప్రవేశించి అందే జనకునిశీల ఔన్నత్యముఁ బడయవలెనని ఆతని పితామహి వాంఛించుచుండెను. ఈ యుద్దేశము నామె మీయొద్దఁ బ్రకాశ మొనరించియే యుండును."

"లేదు. నేను పేరిసునకుఁ దిరిగివచ్చి ఆమెకడకు మనిషి నంపితిని. బాలకునిమాత్ర మామె నాయొద్ద కంపెను కాని తా నొకమాఱైన వచ్చి నన్నుఁ జూడలేదు."

"వృద్ధాంగన ప్రకృతి మిగుల నద్భుతమైనది!"

"మీ యిర్వురకును సమావేశమై యుండెనా?"

"నేఁటియుదయమున నే నామెయింటి కరిగితిని. పిరియాక్ దొర

సాని నిక్కముగ మారువేసము వైచిన రాజకూమారియై యుండునని నా యూహా!"

"దానంజేసియే కాంబోలు ఆమె నా మ్రోల కరుదెంచుట కిష్టపడుటలేదు. పోనిండు. ఇపుడు జర్గెటువిషయ మటుంచుడు — మీరు కత్తిసాముఁ జేయుచుందురా ?"

"అపుడపుడు మాత్రము చేయుచుందును."

"అట్లైన తాము నా కస్త్రచాలనము నేర్పుదురా! నా శిక్షకు నకువచ్చిన విద్య నంతయు నాతఁడు నేర్పివైచెను. నాకు నేరువుట కాతని యొద్ద నిఁక విద్యలేదు. నేనిఁక వానికి సెలవుఁ జెప్పివైచెదను. సామునందు మీరు నన్నోడించివైతురని నమ్మెద !"

తలపని తలఁపుగ దారుకొనిన యీ వేడికోలు నెట్లు తప్పించు కొందునా యని మేక్సిము యోచింపఁదొడఁగెను. — కాని, ఆతఁ డే వెరవును రోయఁజాలకపోయెను. యువకుని మనసునందలి తలఁపును గ్రహించి చికిత్సకుఁడు రమణి నుద్దేశించి యిట్లనెను. "వ్యాయామ మొనరింప మీకు నేను హితమొనరించియుంట నిక్కమే, కాని, అట్లని మీ రన్నివేళలందు వ్యాయామమునకు గడంగరాదు. వాత రోగపీడితులకు నొక గంట వ్యాయామమే చాలును."

"వైద్యమహాశయా! నేనలసియుండలేదు. వలయుచో, నా నాడిఁ బరీక్షించి చూడు" డని కవున్టెస్ దక్షిణహస్తమును ప్రసారిత మొనరించెను.

"నేఁ జెప్పినచొప్పున నడచుకొననిచో, నీ తెవులు నెట్లు కుదర్పఁ జాలుదునో చెప్పుడు — ఆ మాట టటుండ, నామిత్రశేఖరుఁడు సాము సలుపుటకు వలయు దుస్తులను ధరించుకొని రాలేదు."

"అందులకై చింతయేల ? ఒక ముఖావరణమును, చేఁదొడుగులను ధరించిన జాలును. ఒకటిరెండు వలయములను దిరిగినంతనే ఆతని క్రీడాకౌశలమును గ్రహింపఁజాలుదును !"

ఇంక దప్పించుకొనుట కుపాయము లేదని మేక్సిము గ్రహించెను. పూర్ణదృష్టి సమన్వితాక్షియై ఆ రమణి వానిని దేఱిచూడసాగెను. తోడనే ఆ తొయ్యలి యనురోధమును పాలన మొనరింపకున్న యెడల, నామె కవమానము సూపిన ట్లగునని యువకుఁడు యోజించెను. ఆవిషయము నటుండ నా రమణి యనన్యసామాన్యసౌందర్య సౌష్ఠవో పేత యగుటచే, తనవంటి యువకుఁ డా సీమంతినీచూడామణిమాటఁ ద్రోసివేయు టెంతయు ననుచితమని అతఁ డనుకొనెను. ఇంకఁ గాల హరణ మాచరింపక ముఖావరణమును జేఁదొడుఁగులను ధరించి అతఁ డీయల్లా మ్రోల నిలచెను!

"బళే! సాహసమున్న నిట్లుండవలెను! ఒక యువతి వేడికోలు నెట్లు పాలన మొనరింపవలెనో మీరు బాగుగ నెఱుంగుదురని దీని వలన స్పష్ట మగుచున్నది." అని యింక రెండవమాట యనక ఆ మగువ మేక్సిమును తారుకొనెను!

రమణీసమ్ముఖమునఁ దన కౌశలము జూపవలెనను దృఢవాంఛ నాతఁ డడంచుకొనలేకపోయెను. సుందరిని సంతసపెట్టు నస్త్రశిక్షకుఁడు స్వీయపరాజయము నంగీకరించెనని ఆతఁడు యోచించెను. కాని, వానిభ్రమ నిముసములో దూరీభూతమైపోయెను! ఇయ్యల్లా దొరసాని శిక్షాకౌశలము కడుంగడు విచిత్రమైనది! ఆత్మరక్షణార్థమై ఎంత యత్నించినను, ఎట్టికౌశలముఁ జూపినను యువకుఁడు యువతి తరవారి స్పర్శనుండి తప్పుకొనలేకపోయెను.

నిజకృపాణము నవనత మొనరించి "రమణీమణీ! నే నోడితి" నని మేక్సి మనెను.

"లేదు! లేదు! అట్లనబోకుఁడు! నా యాక్రమణకౌశల మెఱుఁగుటకు తమ కింకను సమయము చిక్కలేదు. నిముసములో నా సాము యందలి రహస్యమును మీరు తెలిసికొనఁజాలుదురు. ఉభయుల

సాము తెలుఁగు ఒక తీరునదికాదు. మీ యస్త్రము చాలనాకౌశలము నాదానికంటె సత్కృష్టమైనది. తుదకు మీరే జయోపేతు లగుదురు."

ఇరువుర యస్త్రక్రీడ మరల నారంభమాయెను. ఈ మాటమాట విని బూర్తిగ 'వలయింపవలెనని యువకుఁడు నిశ్చయించెను! కాని పాప మాతని నిశ్చితము కొనసాగలేదు! ఆకస్మికముగ నా కాంత చూసి ఆతని మణిబంధముపైఁ బడెను! తొడుగుకొనియున్న కోటు గుండా కత్తిమొన ఆతని చేయికిఁ దగుల్కొనెను! బలపూర్వకముగ నాసీమంతిని ఖడ్గము నూడవెఱికినంతనే యువకుని జేతనున్న కంకణము ముక్కలై చివాలున నేలరాలెను!

అడలు, యచ్చెరువు లొక్కమారు మేక్సిము యెడదను జుట్టు ముట్టెను! తిరిగి ఆ తలోదరి నెదుర్కొనవలెనని ఆతనికిఁ దోఁచనే లేదు — అత్తఱి తనకర్తవ్యమునే ఆతఁడు విస్మృతించెను!! ముఖమును గప్పియున్న గవిసెన నూడవెఱికి "అయ్యో! — పాపము మీకు వ్రేటుతగిలెనా యేమి?" అని వీరాంగన వాకుచ్చెను.

"లేదు! లేదు!!"

"పాప మాతని హృదయ మాహతమై యుండును. యువతీమణీ! మీ కత్తివ్రేటు యువకుని జేతికంకణమును ముక్కలు చేసివైచెను. అది యెవర్తుకదేని ప్రణయచిహ్నమై యుండునని తలఁచెద!" అని స్మితముఖుఁడై పలికి, చికిత్సకుఁడు కంకణపు తునుకలను నేలనుండి దీసి నావధూటి చేతులయం దప్పన మొనరించెను!!

మందస్మితముఖసరోజయై, అలంకారమును పరీక్షించుచు, ఆకాంతా శమంతకము యువకు నుద్దేశించి "ఎవ్వతెయో సుందరాంగి మీకు దీని నుపహారముగా నొసంగియుండు" ననెను.

రాని నగవుఁ దెప్పించుకొని యువకుఁడు, "విపణినుండి కొని తెచ్చితి నన్న యెడల, నామాట నమ్ముదురా?" యనెను.

"అశ్రాంతము అలంకారముగ జేతులనందాల్పవలసిన దని మీప్రణయిని మిమ్ము వేడియుండును."

"అవునని చెప్పజాలను."

"నేను వింతగాక నలహా జెప్పెద వినుము. మిగుల జాగరూకతతో మీ రీవస్తువును భద్రపఱుపవలెను! కంకణమును నేను నాకడ దాచియుంచుట మీకు సమ్మతి కాకపోదని నాయూహ. దీనిని నేను తీసికొనిపోయినయెడల మీ రేమి చేయుదురు ?"

యువకుఁడు నిక్కముగ మిక్కిలి చిక్కులోఁబడిపోయెను — కాని ఆకస్మికముగ నాతనిచిత్తమున క్రొత్త యోచన తట్టెను. చకితుఁడై ఆతఁ డిట్లనెను. "మీరు దీనిని గొనిపోయి మీయొద్ద దాఁచి యుంచినచో నాయెడ మక్కువఁ గలిగి ప్రణయచిహ్నముగ నట్టు లొనరించితిరని తలంతును. ఒకపురుషుని యతీతజీవనోదంతమును విని నంతనే ఎవర్తుక మనసున నీను జనించునో నిక్కముగ నాపె యాతనిఁ బ్రేమించెనని నిశ్చయింపవలెను."

యువకుని పల్కులను విని యువతి చకిత యాయెను! ఆ మదవతి లోచనములం దొక యపూర్వాలోక ముజ్జ్వలమై చూపట్టెను! అపుడు కూడ కంకణ మామె కరమందే యుండెను. తిరిగి దాని నిచ్చివైచుట కా పొలంతి కిచ్చ వొడముట లేదు. మేక్సిము హృదయ మంతయుఁ గలవరపాటున కాలవాలమైపోయెను. చికత్సకుఁ డా చిత్రము నంతయు మిగుల జోద్యముగ వీక్షించుచుండెను.

ఇంచుక తడసి ఆయింతి యిట్లనెను. "మీరు చెప్పినదే నిజము. అట్లని మీయెడను భ్రమ యుదయింపవచ్చును కాని, నే నెవని దెసకును ఆకర్షింపఁబడు నాఁడుదానను గాను. అందులకు ఋజువుగ నిదిగో మీకంకణము మీకొసఁగివైచుచుంటిని"

తడయక యువకుఁడు దాని నందుకొని, చివాలున జేబునఁ బడ

వైచుకొనెను. ఈ చర్య యంతయు జూచుచున్న వైద్యుడు వ్యంగ్య స్వరమున నిట్లనెను. "నిక్కముగ రాజ్ఞి కృపాస్వరూప! నేనే యైన యెడల ఒక నెలవరకు అనుదినము నాకు కత్తిసామునైన లేక గుఱ్ఱపు సవారినైన నేర్పితీరుటకు అతనిచే బ్రతిన జేయించుకొని, మఱి కంక ణమును విడిచివైచియుందును."

"అట్టి ప్రతిన ఆనందగర్భితమే గదా!" అని ప్రఫుల్లవదనుడై యువకుడనెను.

"అట్లైన మీరు మీమాట నిలుపుకొనుడు. అనుదినము తాము మాగీమునకు దయచేయుచుండుడు. మీచెలికారము నేనెంతయు నపే క్షించుచుంటిని." అని భావగర్భితములగు వాక్కులను చర్చించి, మధురమంజుల మందహాసము ముఖమండలమును మండన మొనరింప ఆ మానినీమణి మరల నిట్లనెను: "నెచ్చెలీ! నడువుడు — నేడు కాసారతీరమున విహరించి వత్తము. సరోవరసలిలము ఘనీభవించి నీహార మైనదని వింటిని. అచటి కరిగి తుషారక్రీడయందు హాయిగ సమయమును బుచ్చెదము."

మేక్సిము — నేటికి నన్ను మన్నింపుడు. నాకొకచోటికి బోవలసిన పనియున్నది. ఒకరినిం జూడవలసియున్నది."

"మీరు చూడవలసినది కంకణదాత్రి ననుకొనెదను!"

"కాదు! కాదు! కాని —"

చికిత్సకుడు — (రాజ్ఞి నుద్దేశించి) — తానుకూడ "బోయెూ" సరస్సుతీరమున కరుగుదునని ఆతడు చెప్పెను. ఆతనికింగలపని అందే యున్నది!

"అట్లైన నా యనురోధము నుపేక్షింపంజాలరు. నేనుకూడ నా వలంకునకే పోదును! నాబండిలో మీరుకూడ దయచేయుడు. ప్రొద కూలమున కరిగినపిదప మీకిష్టమువచ్చినపు డందుండి వెడలిపొండు

ఒకగంటవరకు మీరునాకుఁ జెందియుంటిరని మాత్రము నమ్మెదు — అంతదనుక మీరు నాచెంగట నుండక తప్పదు! — వైద్యమహాశయా! ఈ సుందరుని పుస్తకభాండాగారములోనికిఁ గొనిపొండు. వలువలు వదలి నేనిపుడే వచ్చుచుంటిని!"

మరల నేదియో యద్దుమాటఁ జెప్ప యువకుఁడుద్యమించెను. కాని ఆతన్వి ఇఁక నందు తడయక కడువడిగ వెడలిపోయెను. ఏనుడువు నుచ్చరించుటకైన నా యాఁడుది యతనికి వ్యవధి యొసఁగ లేదు!"

వైద్యుఁడు — ఆకాంత మీకెట్లు చూపట్టినది?

"మనోహారిణిమాడ్కి! — నిక్కముగ నాకిపుడామె మోహినీదేవివలెఁ గానిపించుచున్నది."

"దానియర్థము ప్రథమమున మీకాకాంత అట్లు చూపట్టలేదని, ప్రథమదర్శనమందే ఆమె యెవరి మనసును ఆకర్షింపఁజాలదు. కాని, అల్పసల్లాపమందే మతిమంతుఁడైన పురుషుఁ డా సరోజలోచనయెడ మోహితుఁడై పోవును. మీపై నా సీమంతినికి మెండుగ నభిలాష కలిగెను. అట్లని ఆమె లోచనములను విలోకించి గ్రహించితిని."

ఇరువురును భాండాగారాభిముఖముగఁ జనిరి. మార్గమధ్యమ్మున భీమకాయుండును, చిత్రవస్త్రధారియు నగు నొక యారెకుఁడు వారికిఁ గానిపించెను. దర్శకు లిర్వుర కభివాదన మొనరించి, ఆతఁడు త్రోవ వదలెను. ప్రతికక్షసమక్షమం దొక్కొక పదాతికుఁడు నిలువంబడి యుండెను. మేక్సిము విస్మితుఁడై పోయెను. ఏదేని రాజప్రాసాదము నకుఁ దా నరుదెంచినట్లు లాతఁడు యోజింప దొడఁగెను!

పుస్తకాలయమునఁ జొచ్చి, యువకుఁడు నలుకెలకులకుఁ జూచు చుండ, వలువలుమార్చి, క్రొత్తయుడుపులదాల్చి, యువతి యందుఁ బ్రవేశించెను. ఆరమణీయములైన పుట్టములందా పురంధ్రీలలామ కడుం గడు సుందరమై ఆతనికిఁ జూపట్టెను."

ఇరువురును చికిత్సకుని సెలవుగైగొని బండిలోనికెక్కి కూర్చు అశ్వవల్గమును యువతి నిజకరమునఁ గైకొనెను. నక్షత్రవేగమున బండి కదలిపోయెను.

"మన మీకొంచెపాటి సమయమైన నిష్ఠాగోష్ఠి సలుపుకొందము— మీమేనమామగారిని గుఱించినవార్త లేమైనఁ దెలుపుము."

ఈ నుడువులకు యువకుఁ డించుక విచలితుఁడై పోయెను. వెంకట నున్న చేడియ ఇట్టి యుద్దేశముఁ దెలుపునని అతఁ డనుకొనలేదు.

"అతని కొక తనయ యుండెను కదా?"

"అవును."

"ఆమె మిక్కిలి చక్కనిది కాదా? తండ్రిఁ గూడి భ్రమణ మొన రించుచుండ నే నొకనాఁ డామెను జూచితిని. ఇన్నినాళ్ళవరకు ఆమెకుఁ బెండ్లి కాలేదేల?"

"ఇటీవలనే పందొమ్మిదవయేట నాపె కాలిడెను!"

"నిశ్చయముగ మీ రామెను ప్రేమించితిరా?"

"లేదు."

"అట్లైన జర్జెబు నాకుఁ జెప్పినదే సత్యమైయుండునా?"

"మీతో నాతఁ డేమి చెప్పెను?"

"మీ మేనమామగారి యుద్యోగులలో నొకరి యెడ నామె యానక్తమై యుండెనని."

"ఏమి! దుండగుఁడగు నా బుడుతఁడు —"

"వానిపైఁ గినియకుఁడు. దోసమంతయు నాయదియే. అపుడపుడు నేనాబుడుతని నుడువులను వినఁ గౌతుకపడుచుండును. నిన్న నాకేమియుఁ బని యుండకపోయెను. బాలకుని నా పాలికిఁ బిలిపించితిని. ఇప్పుడు తాఁ జేయుపని సౌఖ్యదాయకమైయున్నదా లేదా యని వానిని ప్రశ్నింపగా నాకీ సంగతులన్నియు నొకదాని వెన్క నొకటి తెలియ

వచ్చెను. మీ మేనమామగారి కుటుంబమును గుఱించిన విషయము లను నే నెన్నో ఎఱుంగుదును. తఱచుగ నాతని యాలయమందు మీకాలు నిలువదని కుఱ్ఱవాఁడు చెప్పెను. మీ మాతులతనూభవను గుఱించి వాఁడు చెప్పిన విషయములను వినినప్పటినుండి, ఒకనాఁ డా మెలనాఁగను మా నిలయమునకు రావింపవలెనని మక్కువ వడు చుంటిని."

"ఆమె సాధారణముగ నిలువీడి ఎచటికినిబోదు."

"ఎట్టులైన నాయభీష్టము సిద్ధింపఁజేయుడని ఒకమాఱు వృద్ధునే బతిమాలుదును. — ఒకవేళ అపుడు కూడ నాతఁడు మాయింటికిరా నిచ్చగింపని యెడలఁ ఆమె యుండు నెలవునకుఁ బలుమాఱు బోయి వచ్చుచు నామె చెలికారముఁ బడసి సంతసింతును. పూసగ్రుచ్చినట్లు, కడు నేరుపున బాలకుఁడు చెప్పిన యుదంతమంతయు వినినంతనే, నిగూఢమైన మీకుటుంబ చరిత్రమంతయు నిపుడు నాకన్నులకుఁ గట్టి నట్లున్నది. కోర్టుయందుఁ బనిఁజేయు ఖాతంజీ చాల పెద్దమనిషియఁట— కార్యదర్శి ఉన్నత వంశమునఁ బుట్టినవాఁడు! కతిపయ దినములకు మున్నే ఆతనిఁ గోర్టుపతి పదచ్యుతు గావించివైచెను. అతని యుద్యోగ మేల పోయెనో తెలిపెదరా?"

ఇయ్యట్టి ధోరణి యంతయు మేక్సిము చిత్తమును కలచివైచెను. మనసునందలి భావమును వెలిబుచ్చక ఆతఁ డిట్లనెను. "ఆతని యుద్యోగ మేల పోయెనో నేనంతగా నెఱుఁగను. తనంత దానే రాబర్టు తన పని మానుకొనియుండును. ఈజిప్టు దేశమునకుఁ జనుమని నా మేనమామగా రాతనిఁ గోరియుండురు. అందులకు సమ్మతింపక, ఆతఁ డావలికిఁ దప్పు కొని యుండును."

"రాబర్టా! — పేరు నేను వినినదే యని తోఁచుచున్నది. కొంత కాలమునకు మున్ను సెంటుపీటర్సుబర్గులో నీపేరిట పెరిస్ వాసుఁ

డోఁడు ఫ్రాన్సునుండి వచ్చిన యధీనమున నున్నతోద్యోగియైయుండ లేదా ?"

"ఉండెను. ఆతఁడు రాబర్టు జనకుఁడు."

"మిగుల నబ్బురముగనుండెనే! — అతని పుత్రుఁడు —"

"ఆతని పుత్రుఁ డేల కొత్త యుద్యోగి కావలసి వచ్చెనని యడుగుదురా ? రాబర్టు తండ్రి వెన్క నేమియు నుంచక పరమపదించెను."

"యువకుఁడు పటుసాహసవంతుఁడువలె నున్నాఁడు. చెమట యోర్చి జీవన నిశ్రేణియందలి పెద్దమెట్టు నెక్క నాతఁడు పూనుకొనియుండును! చూడ నాతఁడు సుందరుఁడా ?"

"నిక్కముగ నాతఁడు సుందరుఁడనియుఁ గుణవంతుఁడనియు బుద్ధిమంతుఁడనియు మాత్రము వింటిని. — ఆతనితో నాకంతగా పరిచయములేదు."

"నేనేల మిమ్ము ప్రశ్నలు వేయుచుంటినో గ్రహింపఁగలిగితిరా ? మీకడ నా కౌతుకమంతయు వెలిఁబుచ్చుచుంటినని మీరు యోచించుచున్నారు కాఁబోలు."

"లేదు"

"మీ మాతుల నందని గుఱించియుఁ గార్యదర్శిని గుఱించియు నిన్నిమాట లేల యడుగుచుంటినో వినఁగోరుదురా ? — జర్జెటు కబురులనుబట్టి చూడ, ఆ బాలికను యువకుఁడు మిక్కిలి ప్రేమించినట్లు తోఁచుచున్నది — ఆతఁడుకూడ నా మిన్నపైఁ గన్నువైచియే యుండెనఁట! — ఆ ప్రణయము పరస్పరమగుట నిక్కమట!"

మేక్సిను ముఖమండల మంతయు నారక్తిమమైపోయెను.

"అట్లైన నే నూహించినది సత్యేతరము కాదు. ఉభయుల స్నేహమును మీమాతుల విచ్ఛిన్న మొనరించినందున, నాయనావను లిర్వురు నిదారుణమానసిక యంత్రణమున క్రుగ్గుచుండిరని తలంచుచుంటిని.

వా రట్లు వీడితు లగుట నిక్కమే యగుచో, నే నొక సుకృతి మొన రింప నిశ్చయించుచుంటిని — మీ మఱఁదలి పక్షము నవలంబించి, నేను కార్యదర్శిని వెతకి పట్టుకొందును. తదుపరి ఆతని యెడ వర్జర్సు ప్రసన్నుఁడగుటకై తగు జతనము సలుపుదును. నా నుడువులు మీకు వినసొంపగుట లేదు కాఁబోలు!"

"ఇందు సొంపుకాని దేమియు లేదు. కాని మీ రన్ని విషయ ముల నెఱుఁగని కతన నేనన్యథా ప్రసంగింపవలసి వచ్చుచున్నది. — రాబర్టున కర్థాంగి యైనయెడల నా మఱఁదలు సుఖముఁ బడయజాలు నని విశ్వసింపఁగలిగితినేని, మీరు త్రొక్కఁ దలఁచుకొనిన త్రోవను నేనుకూడ మీవెన్నంటి, పట్టుట కించుకైన శంకించువాఁడను గాను! యువకుని బక్ష మవలంబించుట న్యాయ సంగతమైన కార్యము కాదని సంక్షేపముగ నేఁ జెప్పవలసి వచ్చుచున్నది!"

"ఏల! — ఆతఁ డేమైన జెడు చెయ్య మొనరించెనా?"

ప్రసంగమునఁ దాను చాల దూరము సాగిపోయినట్లు మేక్సీము గ్రహించెను. 'చెప్పవలయుదానికి మిన్నగఁ జెప్పివైచితి' నని యడలి "అట్లని నేననియుండలే" దని ఒక్కనుడువులో నాతఁ డుత్తర మొసఁగెను

"ఆత డేదేని గర్హితకార్య మొనరించియుండును. ఆ యొనరిం చిన దుష్కృత్య మేమి?"

"ఆతఁడు కావించిన దుష్కృత్య మేమియు లేదు. కాని, వాని పోకతీఱు సందేహాగర్భితమై యున్నది. తన యంతరంగ మిత్రుఁ డగు విగసరీతోడనైనఁ జెప్పక, ఆతఁ డకాత్తుగ నెచటికో వెడలిపోయెను. అపరాధశశంకితము కాని మనసుకలవాఁ డెవఁడును అట్లదృశ్యుఁడు కాఁజాలడని నే నూహించుచుంటిని."

అరమణి ఏ నుడువును బలుకలేదు — ఆమె యాకస్మిక మౌనా వలంబనమునకు మేక్సీము విస్మయపడిపోయెను.

బండి చెర్వుపొంతఁ జేరుకొనెను. దర్శకులును, సీహారనృత్యనిపుణ లగు సీమంతినులును పలువురు వచ్చి, అపుడే అందు గుమిగూడి యుండిరి. కవున్ టెస్ అశ్వవేగమును సంయత మొనరించెను. నిశా సంగినియైన సుందరి ఆకస్మికముగ నందు మేక్సిము కన్నులఁ బడెను! ఆనాఁటి నిశి ఆమె ధరించిన మేల్వాలువలే నేఁడుకూడ నామె మేనిపైఁ దనరారుచుండెను! వేసినను వీడి చనుచుంటినని ఆమె తనతో నన్నృతము వచించెనని యువకుఁడు యోచించెను. వనిత వంచనోద్దేశ మేమో యెఱుఁగ నాతఁ డాతురపడెను. కానిఁ ఆతనిఁ జూడక కాఁబోలు నా యామినీకాంతిని తన మృదుపదముల నొందువలనుగ, ద్రిప్పివైచెను!

కవుంటెస్ — మీపని ఎన్నిగంటల కనినారు?

"మూఁడుగంటలకు రుదేబోలోతునకు నేఁ బోవలయును."

"ఇచటి కది ఇంచుకదూరమందుమాత్రమే యున్నది. — రండు. మిమ్మచట విడిచియే వత్తును!"

ఇంతలో ముందునుండి ఒకబండి వారి కెదురుగ రాదొడంగెను. ఇంచుక దూరమం దుండగనే అది తన మేనమామగారి శకటమని మేక్సిము గుర్తించెను. బండికిటికీ తెఱచియున్నది. పయిండిపూత పూసినట్లు బిసమిన మెఱఁము గేశరాశివాతాయన మార్గమునుండి ఇంచుక నీవలికిఁ వ్రేలుచుండెను! మాతులదుహితయుం దుండెనని యువకుఁడు గ్రహించెను. వృద్ధపరిచారకుఁడగు జోసెఫ్ బండిఁ దోలుచుండెను. మేక్సిమును జూచి, అతఁడు బండిని వడివడిగఁ దోలదొడఁగెను. చెంగటనున్న చెల్వ నుద్దేశించి, "నన్నిక విడిచివేయుఁడు — నాకుఁ జాల పనియున్న" దని మేక్సిము కడు తత్తఱమునఁ బలికెను.

"బోధపడినది! — ఆ బండిలో మీ మేనమామగారి కొమార్తె యున్నది. ఆజవ్వని ననుసరింప మీరు తొందరపడుచున్నారు!"

"కాదు. — ఆమె — "

స్మితముఖియై రమణి "సుందరా! ఇఁక దాపరిక మేల? — అట్లొనరింప వొరఁగొనుట నిరర్థకముకాదా? మూఁడు గంటలప్పుడు 'రుదే బోలాతు' నందు మీరు చూడఁదలఁచిన సుందరి, వెతుకఁబోయిన దీవ కాళులకుఁ దవులొ్కనిన యట్లు లదే బండిలోఁ జనుచు మీ సమ్ముఖమున నుదయించెను! కాల్నడకను అచటికి జనినట్లైన మీరాలతాంగిని నిర్దిష్టసమయమునఁ గలిసికొనఁజాలరు. ఆలస్యమున కా యంద కత్తె యలుఁగ వచ్చును!"

"నామాతుల తనూభవ నాకోసరమై ప్రతీక్షించుటలేదు. ఇట్లని పలుమాఱు నొక్కి వక్కాణింపగలను. నేను — "

ఆతనిమాట కడ్డువచ్చి ఇయ్యట్లా యిట్లనెను! "బండి దిగకుఁడు. అత్తావునకు దీనిమీఁదనే చనుఁడు — తురగము మిగుల చురుకైనది. ఆ శకటముకంటె నిదే అచటికి ముందుకుపోయి చేరుకొనును. అందుండి మీ కిష్టమువచ్చినదెసకు దయచేయుఁడు."

మాఱుపలుకుటకు యువకున కవకాశ మొసఁగక యువతి హాయము నదలించెను — జవోపేతమున నాజక్కబండి పోదొడఁగెను!

రానినగవుఁ దెప్పించుకొని మేక్సిము "ఇది నిక్కముగఁ బలాయనమువలె నున్న" దనెను.

"ఇందు నాస్వార్థమేమియులేదు. మీరు ప్రేమించిన యెలనాఁగ చరణతలముననే మిమ్ముఁ జేర్చుచుంటి" నని విన్నబోయిన మోమున రాణి యనెను.

"మీరు పొరపడితిరి — ఆమె నాసోదరీ సమాన! మాయిర్వురకు సతీపతుల సంబంధములేదు."

"నేను మీ నుడువులను విశ్వసింపఁజాలను — మీ రామెకొఱకై చనుటలేదని ప్రమాణ మొనరింపుడు. మీ రా మగువ మక్కువను

దగిలియుండకపోయినచో ఆమెకడ కరుగుటకు మీకింత యాతుర మేల యుండవలెను ? ”

“ ఎట్లుచితమో యట్లే యనుకొనుము — కాని నేఁగాక ఆమెను ప్రేమించువారు పల్వురు కలరు. ”

“ అట్లైన నెవఁడేని మిత్రుని పక్షము నవలంబించి తామిచట కరుదెంచితిరని నేనూహింపవలెనా ? ”

“ కాదు — వారి మిలనమున కంకిలి వెట్టుటకే నే నరుదెంచితిని ! ”—

“ మీ నుడువులు భావగర్భితములై యున్నవి — అందలి యుదంత మంతయు నాకు బాగుగ విప్పి చెప్పఁజాలరా ?

నక్షత్రవేగమున శకటము పరువిడుచుండెను. కుఱంగటనున్న కురంగలోచన గూఢప్రశ్నకు యువకుఁడు చకితుఁడై పోయెను. రమణిచర్యనంతయుఁ బరీక్షించిచూడ, నామె ఈర్ష్యాన్వితయై యున్న ట్లాతనికిఁ దోఁచెను. తన మేనమామ తనయయెడ తాను మక్కువపడి యుండలేదనియు ఆమెమాట యటుండ మఱేమానిని యెడను తా ననురక్తుఁడై యుండలేదనియు ప్రక్కనున్న పల్లవాధర కాతఁడు బోధింప నాతురపడి “ నేనింకను నెవర్తుకను ప్రేమించి యుండలేదు. నా మామ కొమరిత నన్నుఁగాక మఱొక్కరుని ప్రేమించినది. అయుం దముల ప్రోవున కధిపతియగుట కాతఁ డర్హుఁడు కాడని నాయుద్దే శము — ఈరహస్యము వెల్లడికాదని యాసించెద ” ననెను.

“ ఆయువకుఁడు రాబర్టుకాడా ? ”

మేక్సిము చమకితుఁడాయెను. కాని అతఁడు చాలదూరము సాగి పోయెను. — ఇఁక నిక్కము దాపఁజెల్లదు ! “ మీ రూహించినది యథార్థమే ” యని యాతఁడు మెల్లగఁ బల్కెను.

“ మీ మాతుల నందనికిఁ దగిన కాంతుఁడు కాడని మీరు యోచిం చుటకు రాబర్టు చేసిన మహాపరాధమేమి ? ”

" సంశయావస్థయం దాతఁడు మాతుల నిలయమునుండి వెడలి పోయెను ! "

" అట్లైన నాతఁ డింకను పేరిసులోనే యుండెనేమి ? "

" ప్రణయినిఁ జూడవలె నను కాంక్షను పీడఁబోలక, అతఁ డింకను అన్యత్ర చనియుండలేదు. " రుదేబోలాతు " సం దాపెకోసరమై ప్రతీక్షించుచుందునని దెలుపుచు అతఁ డా బాలకొక కమ్మ లిఖించెను. ఆ జాబు నామె నాకుఁ జూపెను. ప్రేమిక ప్రేమికు లిర్వుర సమావేశ సమయమున నుపాధ్యాయిని కూడ నుండును. అందుచే ప్రణయతరంగిణులందు వెల్లివిరియు వారి సమావేశ మేకాంతమై, యనుచిత పరిమాణభూయిష్ఠమై యుండదు. అత్తటి నేఁగూడ సమ్ముఖమం దుండవలెనని సంకల్పించుకొంటిని. ఇఁకముం దెన్నడు నెలిసునుజూడ యత్నింపరాదని రాబర్టునకు నొక్కి చెప్పుదును — ఇపుడు యుదంతము నంతయు వింటిరి గదా ? "

ఇరువురిలో నెవరును ఇఁకేమియు వచింపలేదు. కపున్ లెస్ కడుం గడు విచలితమైనట్లు చూపట్టె మేక్సిము విస్మితు డాయెను. పదపడి ఆ యువతి ఇట్లనెను. " మీవంటి ఉదారహృదయులను, మహత్తరచరిత్రులను నే నీవరలో నెందును జూడలేదు. భవిష్యమున నాయంతరంగమిత్రులుగ నుండ నియ్యకొని, కృపాపూర్వకముగ నా మైత్రిపదవిని నత్రాంతము నా మన్ననలఁ గైకొందురని ఆశపడుచుంటిని — ఇపుడు నిర్దిష్టప్రదేశమును జేరుకొంటిమి. ఇఁక మీ రరుగవచ్చును. రేపు తప్పక తాము మానిలయమునకు దయచేయవలయును — అపరాహ్ణము మూఁడుగంట లైనపిదప నేను మీకొఱకై ప్రతీక్షించుచుందును. నా యాగారమున నపుడు నేనొక్కరితను తక్క నిఁకెవరును నుండరు ! "

మరునాఁడు తప్పక వచ్చెదనని యువకుఁడు మాట యిచ్చెను.

బండి నిలువఁగనే అతఁడు దిగిపోయెను. ఇయ్యల్లా దొరసాని దృతవేగ మున శకటముఁ దోలుకొని వెడలిపోయెను. కతిపయ నిముసములు స్తంభితునివలె యువకుఁడు నిలువఁబడిపోయెను. నేఁటి యుదయమాది ఎన్నియో యపూర్వఘటనములు సంఘటించియుండెను! అపుడుకూడ మూఁడుగంట లగుటకుఁ బదునేను నిముసములు విలంబముండుటఁగాంచి మేక్సిము ముందునకుఁ జనెను. ఎలిస్ శకటమింకను చేరుకొనలేదు. అప్పటికప్పుడే రాబర్టు వచ్చి యథాస్థానమునఁ గనిపెట్టుకొని యుండు నని అతఁడు తలంచెను.

మేక్సిము నిర్దిష్టస్థానము సేరుకొనెను. కాని, అం దెవరును లేరు. రాబర్టు జాడలేమియు గానంబడలేదు? "ఇదంతయు నాకు దురూహ్య ముగనున్నది. ఎలిసే యరుదెంచి రాబర్టుకొరకై వేచియుండు నను కొనెదను. పెండ్లికానిపడుచు అట్లు పెరవానికై యరుదెంచి అతనిరాక నెదురుచూచు టెంత సిగ్గు! — ఎంతచేటు! ఆచెలిమి మితిమీఱినది! ఇంతవరకు రాబర్టు రాకపోవుట మేలనియే నాకుఁ దోఁచుచున్నది. వా రిర్వురు కలిసికొనఁజాలకపోవుటే శ్రేయము. రాబర్టు చరితమును శ్రోతల హృదయంగమ మొనరించుకొని నిక్కముగ నెలిసు చింతాకుల స్వాంతయై, ఎలలేని విరక్తిని దవుల్కొనును! ముందుగ నేనే ఆ మది రాక్షి సమక్షమున సాక్షాత్కరించి, నీతి బోధఁ జేయుదును — కాని, రాబర్టింకను రాకపోవుటకుఁ గారణ మేమి? అతని మనోగతి ఒకవేళ పరివర్తనమై యుండును! — పిన్ననాఁటి చెలిమికత్తియ నింతయైనపిదప జూచినను, సఫలీకృత మనోరథుఁడను కాఁజాలనని అతఁడు యోచించి యుండును. రాబర్టు చను శకటము ప్రాయశః రైలుస్టేషనుకుఁ గొనిపోవు చుండెను. అట్టి యందంపుబండినెక్కి అతఁడు తెరవునఁ జనుచుండుటఁ జూడ, నాతఁడు పెద్దయెత్తు వారికూటమియందుఁ గలిసినట్లు తోఁచు చున్నది!"

మేక్సిమి ట్లాత్మగతమునఁ దలపోయుచుండ, నింతలో బండిచప్పుడు చెవులఁబడెను. మాతుల శకటము దృగ్గోచర మాయెను! వృద్ధుఁడగు జోసెఫ్ తన్ను,చూచి ఎలిసునకుఁ జెప్పిపోవునను భీతిచేఁ నికటమునఁ గల చెట్టుజొంపముచాటున కరిగి, యువకుఁ డం దడంగి యుండెను.

బండిదగ్గఱకు వచ్చి, నిలిచినంతమాత్రాన, జొంపమునుండి ఈవలికి వచ్చి, ఆకస్మికముగ మేక్సిము శకట సమ్ముఖమున నిలువఁబడెను. బండియందలి యువతు లిద్దరు అబ్బురపడిపోయిరి.

ఉపాధ్యాయిని కభివాదన మొనరించి మఱదలి నుద్దేశించి, "బోటీ! నాపై కినియకుము. నేఁ జెప్పున దంతయు విను" మని యువకుఁడు పల్కెను.

ఎలిసు ముఖమండలము వివర్ణమైపోయెను! ఉపాధ్యాయిని దృక్కులు భీతివ్యంజకములై యుండెను. ఆమె వైఖరిఁగాంచి మేక్సిము కడు కష్టమున నగవునాపుకొనెను. ముదుసలియగు జోసెఫ్కూడ కిం కర్తవ్య విమూఢుఁడై మొగముఁ బ్రక్కకుఁ ద్రిప్పుకొనెను.

"నీ వాతనిఁ గలిసికొంటివా?" అని యుత్తేజస్వరమున నెలిస్ ఆతనిఁ బ్రశ్నించెను.

"లేదు. నీవలె నేఁగూడ వానికొఱకై వేచియుంటిని, కాని ఆతఁడు రాలేదు. ఇక రాడని నొక్కిచెప్పఁగలను!"

భీతచకితయై, "అట్లైన నిక్కముగ నాతని కేదేని విపాద మాపాదిల్లి యుండు" నని యువతి యనెను.

"విపాద మేమియు ఘటించియుండదు. కాని, అతఁడు రాకపోవుటకు నిశ్చయముగ నేదేని కారణ ముండకమానదు. దూరమునుండి నే నాతనిఁ జూచితిని. కాని, పల్కరించుట కవకాశము చిక్కలేదు — కడుంగడు సుందరమైన శకటమెక్కి ఆతఁడు చనుచుండెను. నన్నుఁ జూచి రాబర్టు బండినడుమ నడఁగెను!"

నిర్విణ్ణయై ఎలిసు "అట్లాతఁ డేచటి కరుగుచుండెను?" గ్రేసు

"అ దెట్లు చెప్పగలను? ఏదేని రైలు నందుకొనుటకై ఆతఁ డట్లు పోయియుండును."

"అట్లెన్నటికి నైయుండదు. నన్నుఁజూడక ఎందును అరుగనని ఆతఁడు ప్రతిన గావించియుండెను."

"ఒకవేళ అతఁడు తన యభిప్రాయమును మార్చుకొనియుండును. నా యుద్దేశమేమో తెలిపివేయమందువా? ఆ వ్యక్తికోసరమై నీ నా త్మోత్సర్గ మొనరించుకొనుటకు నాకించుకైన నష్టములేదు. రాబర్టు నీకుఁ దగినవరుఁడు కాడు. నిక్కముగ నాతఁ డపరాధియని ఘంటాపద ముగ నేఁజెప్పజాలను — కాని, వానికి బ్రతికూలముగ మనము సందియ పడుటకుఁ దగిన హేతుక మాతని ప్రస్తుత ప్రవర్తనమందు స్పష్టముగ జూపట్టుచుండెను. ఒరునవెన్కనక్కి బండియెక్కి ఉన్న తావున నుండక తిరుగుట ఆత్మగోపనార్థమేయని నాకుఁ దోఁచుచుండెను. నీజనకుని ఇలువీడి చనుతఱి ఆతని అవస్థయేమియు బాగుగలేదు. ఆతఁడు దరిద్రు డని మనమెల్లఱ మెఱుఁగుదుము. ఇపు డాతఁ డైశ్వర్యమునఁ బొరలాడు టెట్లు సాధ్యమాయె! శకట మన్యుల దని నీ వనవచ్చును. అట్లే కా వచ్చును — కాని, అన్యులన నెవరు? ధనికుఁడైన నెయ్యుం డెవడేని ఆతని కున్నట్లు మన మెన్నఁడు విని యుండలేదు. ఉద్యోగమూడిన తోడ్తోడనే ఆతనిస్థితి ఇట్లుమాఱుటయందే ఎట్టిశంకనైనను గట్టికారణము కన్పట్టు చుండెను. ఉపాధ్యాయిని నా వాక్కులందలి నిక్కము గ్రహించినట్లు తోఁచుచున్నది."

ఉపాధ్యాయిని — మీ రుచితమే వచించితిరి — అమ్మా! ఈతని నడువులు హేతుభూయిష్టమై యున్నవి. రాబర్టు నైతిక చరిత్ర నీకి ప్పటి కవగతమయ్యేయుండెను. దానంజేసి ఆతని కోసరమై చింతిలుట నీకిఁక తగదు.

ందునకు సారించుచుం గొంతోకవడి యూరకొని
“ ఆతఁ డపరాధి యని శపథపూర్వకముగఁ

ఆనను,

“అపరాధియే యని నొక్కి వక్కాణింపఁగలను.”

మృతుని మొగమట్లు ఎలిసు వదనమండల మంతయు వెల్లనై పోయెను. అంతరంగమునుండి పొంగిపొంగి తెరలు తెరలుగ నుప్పొంగు నిరాశ సముద్భూత దుఃఖనిర్ఝరిణి నతికష్టముగ నడంచుకొని ఆననఁబోడి “నీవు నా ప్రాణదండనకు నాదేశ మొసఁగితివి — మీ సుతువుల ననుస రించియే వర్తించుచుంటిని. బండి మరలింపుడు ”

“ ముదుసలీ ! బండి నింటిదిక్కుగ మరల్పు ” మని యువకుఁ డనెను. జోసెఫ్ ఇఁక తడయలేదు. శకటము చనినంతనే ఆత్మగతమున మేక్సి మిట్లు వితర్కించుకొనెను.

“ బాగుగనే జరిగినది — ఇరువుర కిఁక మిలనమగుట యసాధ్యము. ఇపుడు నావని యేమో చూచుకొందును — నైశసంగిణి ఇపుడుకూడ హృదకూలమున భ్రమణ మొనరించుచుండును ! ఈపర్యాయముకూడ నా సౌందర్యతిలక ననుసరించిపోయి, కొండవిఱిగి పైబడినను, తుదివఱకు ఆమెను విడువరాదు ! ”

యువకుఁడు ద్రుతగామియై నడువఁదొడఁగెను. కాని కారాగారము చేరినపిదప నందు నియట్లారాజ్ఞినిగాని సార్జెంటు ద్వారపాలిఁగాని ఆతఁడు కాంచనేరకపోయెను. విషణ్ణమనస్కుఁడై ఇఁకఁ జేయున దేమియులేక మేక్సిము తన యడుగుల నింటిదిక్కుగ మరల్చెను !

౮

ఎలిసు కోసరమై రుదేబొలాతునందు మేక్సిము వేచియున్నతఱి కారా గారమందు ఉన్నాఁడని చాడ్పున రాబర్టు పచారి చేయుచుండెను. ఒక

గంటసేపైన విడుదల దొరకెనేని, నిక్కముగ నాతఁడు ప్రాణములనైనఁ జూడఁ బణముగ నొడ్డి యుండువాఁడు! — నిర్జీవప్రాయమున నా మిన్న నొకమాఱు కన్నులతో గాంచుటకై, నిజజీవనమును పలుసారులు విపన్న మొనరించుకొనుటకై అతఁడు వెనుదీయకుండువాఁడు కాని — పాప మా యువకున కేవెరవు తోఁపలేదు! కారాగారభవనమునకు నలుదెసలఁ బ్రతీహారులు కాచి పెట్టుకొనియుండిరి. గృహద్వారము బలముగ రుద్ధమై యుండెను. ఆవల నారెకుని యడుగులచప్పుడు వినంబడుచుండెను! గది యందుగల గవాక్షము నేలకుఁ బదియడుగుల కెక్కుడు ఎత్తున నుండెను! కిటికీ సేరుట శక్యముగాదు. ఒకవేళ నెట్టులైన వాతాయనముఁ జేరఁ గలిగినను, అందుండి అవ్వలికి దిగు టెట్లు? బాహిరమున — నయ్యావసమునకు నాలుఁగు వలంకుల సమున్నతమై — పర్వతప్రమాణమైన ప్రాచీర ముండెను! ఇన్ని యడ్డులనుదాటి అవ్వలఁబడుట శక్యముకాదని రాబర్టు గట్టిగ నమ్మెను! — విడుదలఁ బడయుట యసాధ్యమని తలంచి అతఁడు హతాశుఁ డాయెను! — టంగ్ టంగ్ మని గడియారము మూఁడు గంటలు కొట్టెను. ఆశ యడుగంటిన దైవోపహతుని కైవడి పాప మాతఁడు చతికిలపడిపోయెను. చింతాక్రాంతమైన వాని యుత్తమాంగ మల్లనల్లనఁ బ్రక్కకొరఁగెను!

తలుపుదీసిన చప్పుడుచే ఆతనికిఁ దెల్వివచ్చెను. రాత్రియైనదని అవల సేరుకొనిన ఇరులు చాటెను. చూడ భీతిఁగొలుపు భటు లిర్వురు ఆహారముఁ గొని ఆగారమున బ్రవేశించిరి. రాబర్టు చివాలున లేచి కూర్చుండెను. తనకుఁ జీకాకుఁ గొలుపవలదని వారితో గట్టిగఁ జెప్పవలెనని యాతఁ డనుకొనెను. కాని, ఆతఁ డేమియు ననలేదు. భృత్యులు తమ యొడయుని యాన ననుసరించిరి మాత్రమని ఆతఁడు యోచించెను. ఆతఁ డేమి యనినను, దానిని వారు చెవిఁబెట్టువారు కారు. ఇఁక నూరక మాటదండుగ గావించుకొను టేల?

పాప మాతని యుదరమున నాఁకలి చిచ్చువలె మండుకొని పోవుచుండెను. దినమంతయు నాతఁ డనాహారియైయుండెను ! — అశనమొల్లని యెడల నేమిఫలము సేకూరును? నేఁడు గాకున్న మఱిరెండు దినముల పిదపనైన నుదరమును పూరింపకున్న లోనున్న ఉసురు లెగసి పోవును ! — ఆకటిమంట మిగుల దుస్సహమైనది. అందుచే బాగుగ యోచించి ఆతఁడు బంటులతో నేమియుఁబలుకక మిన్నకుండెను. తల్పమొకటి తలలనిడికొని సుసిద్ధులు పదాతు లందు ప్రవేశించిరి. సైనిక వేషధారులైన మఱి యిర్వురుభృత్యులు ద్వారపార్శ్వమునఁ గడు మెలకువతో నిలువంబడియుండిరి. "దీర్ఘకాలము నన్ను బంధించియుంచ బోరిషఫ్‌దార నిశ్చయించి యుండును ! కాని, ఆతని యుద్దేశము వితథము కాకమానదు. వీలైన నేనిందుండి పలాయన మొనరింతును. లేకున్న నేవెరవుననైన నాకుత్తుక నుత్తరించుకొందు" నని రాబర్టు వితర్కించుకొనెను.

విం దారగింపుఁడని సమ్మానపూర్వకముగ భృత్యులు రాబర్టును వేఁడిరి — నానావిధ భక్ష్యభోజ్యంబులును, పలువిధోత్కృష్ట మధుపానీయంబులును యువకుని కోసరమై తేఁబడియెను ! ప్రాణములు నిలుపుకొనుటకుఁజాలు నాహారము మాత్రముకొని ఆతఁ డూరకొనెను — మధుకలశము దేనిఁగాని ఆతఁ డంటలేదు.

ఆహారము ముగియఁగనే కవాటము తెఱువఁబడెను. కర్నలు బోరిషఫ్ ఆగారమధ్యమునఁ బ్రవేశించి, మందస్మితవదనుఁడై యిట్లనెను — "మీ కెట్టి కష్టము కలుగలేదు కదా? — చాలసేపు మీ రొంటరిగ నుంటిరి. చేతియందుఁ జాలపని యుండుటచే మరల మిమ్ముఁ జూడఁజాలకపోతిని. కాని, తాము నా యతిథు లను విషయము నేను విస్మృతింపలేదు. మరల నేనిపుడే అవ్వాలి కరుగవలయును. అందుచే మిమ్మొకమాఱు చూచి పోవలెనని వచ్చితిని."

క్రోధముచే రాబర్టుముఖము వివర్ణమైపోయెను. తాఁ గావించిన దుర్నయమునకుఁ దల వాచునట్లు దొరకుఁ జీవాట్లు పెట్ట నాతఁడు నిశ్చయించెను. కాని, అందులకు వలయు నడు వేమియు ఆతనికిఁ దోపలేదు. సమ్ముఖమునఁగల ఆసనముపైఁ గూరుచుని దొర సిగరెట్టును ముట్టించెను.

“ నేఁ డొక మిత్రునింట నిమంత్రణ ముండెను. కూఁతురుతోఁ గూడ వర్జర్సు విందునకై యరుదెంచునని వింటిని. అందులకై నే నత్తావునకుఁ బోక తప్పినదికాదు. ”

“ కోటీపతిని గలిసికొనినపుడు మీరెట్టి కుత్సితో పాయమున నన్ను బట్టి బంధించితిరో ఆతనితోఁ దెలిపివైచితిరా ? ”

యువకుని నుదువులకు కర్నలు విచలితుఁడు కాక ప్రశాంతస్వరమున నిట్లనెను — “ మహాశయా ! మీ రూరక అగ్ని వెదఁజల్లుకొనుచుంటిరి. మొదలిచి మీరేమన్నను అనుఁడు. నే నించుకంతయైన నలుగను. నాపైబడిన కఠోరకర్తవ్యమును నెఱపుకొనిన గాని నేను నహానము వీడరాదు — ఏమనుచుంటిరి ? — అవును. కోటీయధిపతిని నే నీదినము కలిసికొంటిని. ”

“ అట్లైన నాతని కంతయు విదితమేనా ? ”

ఆతని కేమియు విదితముకాదు. మీజాడ లేమియుఁ దెలియరాలేనియు, పేరిను వీడునందే ఎందో మీ రడఁగియుందురనియు, ఒకవేళ నందుండి అవ్వలి కరిగినను అనతికాలములో మీరు మరలి రావచ్చుననియు నే నాతనితోఁ జెప్పితిని. ”

“ ఇంకను నే నపరాధిననియే ఆతఁడు యోచించుచుండెనా ? ”

“ మీ దెస నాతనికిఁగల దురభిప్రాయ మీవఱలోకంటె మఱింత దృఢమాయెను ! మొట్టమొదట ఇంచుక నందియము మాత్రముండెను. ఇపు డాశంక యంతరించి గాఢవిశ్వాసముగ, బరిణమించెను ! కాని,

మీరు దోషులగుటగాని, కాకపోవుటగాని ఆతఁడంతగా పాటించుట లేదు. ఈదేశమును దాటి, మీ రన్యసీమకుఁ బోవలెననిమాత్ర మాతఁడు వాంఛించుచుండెను."

"మరల నాతని ఇనుపపేటిఁ బగులగొట్టి చౌర్య మొనరింతురని ఆతఁ డడలు చుండెనా?"

"లేదు — ఇందుండిన, మీకును ఆతని కన్యకును సంబంధము కలిసి పోవునను భీతి ఆతని మనసును బీడించుచుండెను."

"ఈ దుర్విషయమున నాపెను జడిత మొనరింపవలదని ఈవఱలోనే మీతో నొక్క వక్కాణించితిని — ఎంతవారించినను మీరు నామాట పాటింపఁదలంచుకొనలేదా?"

వ్యంగగర్భితమైన చిరునగవు నగి దొర యిట్లనియెను — "మీరు నన్ను వారింతురు! — కన్ను లెఱ్ఱఁజేసి నాపై నుఱుకఁ గమకింతురు! కాని ఈ దుర్విషయమునఁగల గభీరరహస్యము భేదించునందాక ఇందుండియే చేయవలయు చెయువులకొఱకై యీ దేశముల జారీచేయు చుందును. — వానిని పాలన మొనరించుట కవ్వల పెక్కు లున్నారు : — తన దుహితదేన మీ రనురాగ మూనియుంటి రనియు, దానంజేసి దూర మరుగ మీకు ముదలనొసఁగవలసివచ్చెననియుఁ గొరీపతి వాక్రుచ్చెను. నిక్కమేనా?"

"ఇందొక యుత్తరమైన నబద్ధముకాదు."

"మీ రీసీమవీడి చనితిరని తలంచి వృద్ధుఁడు మిగుల సంతసించెను. కాని, ఇత్తఱి మీ రిందే యుంటిరని విని ఆతఁడు కడు నడలుచుండెను. తన పట్టినిఁ జూడవలెనని ఉద్దేశించియే మీరు పేరినునగరమునకు మరలి యరుదెంచితిరని ఆతఁడు తలంచుచుండెను. కొరీపతి కూఁతురు కూడ మిమ్ము విలోకింప నువ్విళులూరుచున్నది. బాగుగఁ బరీక్షించి చూడ, ఆసుందరి మిమ్ము మఱువనేరకున్నట్లును, మీనిర్దోషత్వ

మును బుజువుచేయుటకై శక్తివంచనలేక యత్నింప నామె నిశ్చ యించినట్లు తోచుచున్నది. వృద్ధుని యుద్దేశముకూడ నిదియే."

"ఇట్లని స్పష్టముగా వృద్ధుఁడు మీకుఁ దెలిపియుండెనా ?"

"అవు నాతఁడే తెలిపెను. కాని, ఇంచుక సమయము గడువఁగనే తన తనూభవమునకుఁ బ్రిప్పుకొనునని ఆశఁ డాళవఁసుచుండెను. అయి నను, మీరింత దున్నంత కాల మాయాశ పూర్ణముకాదు. ఇపుడు కాకున్న నింకొకప్పుడైన మీరిర్వురు కలియవచ్చును — మీ ప్రేమ గ్రంథి నపుడు విచ్ఛిన్న మొనరించుట దుస్సాధ్యమగును! తామిం దుంటిరని వర్జస్సుతనయు, — మీప్రణయిని యెఱుంగును. మీకమ్మ ఆకొమ్మ కందియుండును. ఏలనన — నేఁటి యపరాహ్ణసమయమున నుపాధ్యాయిని వెంటఁగొని తన కొమరిత ఎందో విహరింపనరిగెనని వృద్ధుఁడు తెలిపెను. అది విని కొన్నిగంటల విమదల మీ రపేక్షించి యుంటిరని నే నూహించితిని. — మీ యుత్కంఠకు హేతువేమో నేను సరిగ గ్రహింపఁజాలితినా లేదా ?"

"గ్రహించితిరి."

"మీ యిర్వురు పరస్పర ప్రణయబద్ధులు! — కోశపతి తనూభవ మీకర్ధాంగి కావలెనని మీరు వాంఛించుచున్నను, మీ మనోరథము సఫలీకృతమగుట కొక యంకిలికలదు. తాము నిరపరాధులనియు, — నిర్హేతుకముగ అన్యాయముగ నెవరో కిట్టనివారు మీ స్కంధముపై నిట్టి గురుతరాపరాధము మోపిరనియు వృద్ధుని కెట్టులైన బోధింపఁ జాలితిరేని, సంతసపురస్సరముగ నాతఁడు తన ముద్దుకూతును మీ కుద్వాహ మొనరించి, తాఁ గావించిన దుర్నయమునకుఁదగు ప్రాయ శ్చిత్త మొనరించుకొనును."

"ఏమి ? ఏమనుచుంటిరి — ! !"

"మీకిదియంతయు స్వప్నముచాడ్పున చూపట్టుచుండవచ్చును,

కాని నేనీ స్వప్నమును సత్యమొనరింపఁజాలుగాను. కేవలము నా వాంఛమీఁదనే మీయిర్వురకలయిక ఆధారపడియుండెను!"

"ఎట్లు?"

"ఈప్రశ్న కుత్తర మొసఁగకమున్ను, ప్రజాలోక యమలోకమున మీమానసంభ్రమము లెప్పటట్ల అక్షీణముగై యున్నవనియు, మువ్వురు నల్వురు తక్క ఈ కాదంత మన్య్వ లెవ్వరు నెఱుఁగ రనియు స్వార్థాను రోధమున వారలు దీనిని గోపన మొనరించి యుంచి రనియు, అందుచే మీరు మరలఁ గార్యదర్శిపదవియందు నియుక్తులైన, నెవ్వరి మనసునం దెట్టి సందియము జనింపదనియు వక్కాణించుచుంటిని. కోశీ యధ్యక్షుని కన్నియకును మీకును, బరిణయమైనదని లోకులు విని నపుడు వారి యెడనలందుఁ గూడ నెట్టి సంశయ హేతువు చూపట్టదు. కారణ మేమన నిటువంటి వివాహము లెల్లయెడల జరుగుచునే యున్నవి."

"వర్జర్సు అట్టి స్వభావము కల పురుషుఁడు కాదు. — చెప్పిన దేమో ఆతఁడు చేసి తీరును!"

"నిక్కముగ నాతఁడు దృఢచిత్తుఁడే కావచ్చును. కాని, ఆ భార మంతయు నాపైనున్నదని నొక్కి మీతో వక్కాణించుచుంటిని. చోరుఁడు చేఁబడెననియు, కాని ఆతఁడు కార్యదర్శి కాఁడని —"

ఆతని మాట కడ్డు వచ్చి "ఏమి! అట్లని మీరు వచింతురా?" అని రాబర్టనెను.

"అట్లు వచించుట మాత్రమే కాదు. ఒకపెద్దమనిషిపై కాని వాదము వైచి, ఎంతేని అపరాధ మొనరించితి మని వర్జర్సునకుఁ దెలిపి మీాక్షమ వేఁడి ఉచితరీతి మిమ్ముఁ బురస్కృతులఁ గావింతుము. నాయీయుద్దేశమున కాతఁడు మాఱువలుక సాహసించునా?"

"అది నేఁ జెప్పఁజాలను. కాని మీరు న్యాయమార్గమునుండి తప్పిరి. మీయాచరణ మీానదుద్దేశమునకుఁ బ్రతికూలముగ నుండెను!"

"నామాటలు నమ్ముము. నిక్కముగ మే మిద్దర మట్లొనరింతుము. అంతియగాక, అపహరింపఁబడిన విత్తమంతయు వర్జన్సనకు నేనొసఁగెదను. నాపెట్టె యెందున్నదో, — లేక దాని నెవరు కొంపోయిరో మాత్రము మీరు నాకుఁ దెలుపవలెను."

"ఆ కుత్సితమిథ్యాపవాదమును మరలనాపై నారోపించుచుంటిరా!"

"పేటిక నాకొసఁగివేయుఁడని మీతో నేఁ జెప్పుటలేదు. ఏలనన యిపు డది మీయొద్దలేదని నే గ్రహించితిని. పేటిని పడయు నెవ్వరు మహాశోకాంతకులోనైరో, వారి చేతులం దే యదిపడెను! అందలి యమూల్యపత్రము ప్రాయశః భస్మ మొనరింపఁబడియుండును! వారెవరో యని మాత్రము తెలుప మిమ్ము వేఁడుచుంటిని. పేరు మాత్రము చెప్పుడు. మీరు నిక్కము వచించితిరని తోఁచు నెడల, తత్క్షణమే నా ప్రతిజ్ఞను పాలన మొనరింతును."

"వారి పేరేమో నేఁ దెలుపఁగలిగిన యెడల, వారు సలిపిన చెడుకార్యమున సాయ మొనరించినది నేనే యని ఋజువుఁ గావింపఁ జాలియేయుందును."

"మహాశయా! నా యూహ ఏమో వినుఁడు. ఎవ్వతియేని రమణి ఈరహస్యమున నిశ్చయముగ సంశ్లిష్టయైయుండును. నేనా కాంత నన్వేషించుచుంటిని. అచిరకాలములో నేనామెను బట్టుకొనఁజాలుదునని గట్టిగ నమ్ముచుంటిని. పత్రములు దొరతనము వారికిఁ జెందినవి. ఈవిషయము మీఁక మీయొద్ద నడంచియుంచను. అన్యరాష్ట్రములందు మాసీమయేలికలకుఁ బ్రతికూలముగ నగివితాన మొనరించు గూఢ యత్నములను లక్ష్యించుభారము నాపైఁ బడినది. ఆవిషయమునంతయు మీకిపుడు విప్పి చెప్పుటకు నేనేమియు సంశయింపను. మాపగతు రర్ధసంపన్నులు. — చాలినంత బలగము కలిగియున్నతావస్థయం దున్నవారు. ఐశ్వర్యయుతులైన సామాన్య

మానవులకే గాక రారాజులకుఁ గూడ చెట్టపెట్టి, బద్ధమూలములై యున్న సంప్రదాయములను సమయింపఁజేయుట వారి యుద్దేశము! ఆ యుద్దేశ సాధనార్థము వారలు చౌర్య మొనరించుటకుఁ గాని, రక్తపాతముఁ గావించుటకుఁ గాని వెనుకంజ వేయరు. నన్ను హత్యఁ గావింపవలె నను సంకల్పము కూడ వారికిఁ గలదు. దానంజేసి నే నింత జాగరూకుఁడనై యుంటిని. -- దానంజేసియే పత్రములను విశ్వసనీయుఁడైన కౌశీపతి చెంత నుంచితిని! ఈ దళమందు ఉచ్చావస్థ నున్న సీమంతినులు కూడ కలరు! అట్టి సీమంతినులలో నెవర్తెక ప్రేమవాగురమందైన మీరు పడియుందురు! కాని, ఇత్తటి మీ రా వాగురమునుండితప్పి యావలఁ బడితిరి! కాని, ప్రథమయౌవనమునఁ బ్రేమించిన సుందరి ప్రభావ మొక్కమాఱుగ మాపుకాదు. పెక్కు ఉపాయములచే మీ మనసును మఱపించి, ఈ చెద్దిమున కాచేసియు మీచేయిఁ ద్రిప్పియుండును. మీ ప్రణయచరితము సంతయుఁ దెలిపి వైచుచుఁ గౌశీపతిపుత్రిక పాలి కొక పత్రము లిఖింతునని ఆమె మీకు భయము సూపియుండును. అందుచే దోషభారము మీపై మోప నేను సాహసించుట లేదు. ఈ యవస్థయందుఁ బడినపు డనేకు లిట్టులే యాచరింతురు. ఇనుపపెట్టెఁ దెఱచు గుఱుతుఁ దెలిపి బీగము నామానిని చేతుల నప్పన మొనరించు టంత పాపహేతుకము కాదని మీరు భావించితిరి. ఆ మగువయే పైకమును గూడ నపహరించియుండును. మీ రానాఁటి నిశీథమందే పేరిసును వీడి చనుదురని ఆమె యెట్టులో యెఱింగియుండును. అందుచే చౌర్యాపరాధము మీపైఁ బడునని ఆమె గ్రహించెను! ఈసీమకు మీరు మరలి రారని యెఱిఁగి, చౌర్యోదంతముఁ గాని, మీపైఁబడిన అపనింద వృత్తాంతముఁ గాని ఇంచుకైన మీకుఁ దెల్లము కాదని కూడ ఆజాణ గ్రహించెను. కాని, పదంపడి మీరు పేరిసు వీడునకు మగుడి వచ్చితి

రను ఆ యూరాండుని పెట్టెలో నెట్టిగి, పేరులేని యొక చీటి వ్రాసి, తా నపహరించిన పత్రములను పోలీసువారికంపెను. ఈవిషయము లన్నిటిం బరిశీలించి చూచిన నిక్కముగ మీరు నిరపరాధులని తేలుచున్నది. కేవల మొక్క దుర్బలత మాత్రము చూపియుంటిరి. అంతియే! మానవమాత్రుండై పుట్టినవాండీపాటి యకార్యమునకేని పాల్పడుట యక్కజము కాదు. హా! మీరని యెంచితినేని, మీకిట్టి యాదరణమునుం జూపియుండువాండనుగాను. నాయుద్దేశము సంశయము నెఱుంగ జాలితిరి గాన, ఇప్పు డున్న ట్లిందలి రహస్యమును కృపాళులై నాకుం దెల్పుడు. — ఆ యానాతి యెవ్వరైన నాకుం దెల్పుడు. అట్లొనరించితి రేని, అచిరకాలములో శ్రీనాథుని సంపని కేలుం బట్టిజాలి సంసార సుఖము మీరు హాయిగ ననుభవింపం జాలుదురు !"

కర్నలుపైం దీక్ష్ణదృష్టులం బరపి, రాబర్ట్లి ట్లనెను — "మహాశయా! తమ కల్పనాశక్తి అత్యంత ప్రకరమైనది. ఇట్టి కల్పనాశక్తిసంపన్నులై బూటకంపు నవలా రచనవలన మీ మనోరథము పూర్ణము కానేరదని తా మెఱింగియుండవలసినది! ఏయింతికైన నీచౌర్యసంఘటనమందు సబంధమున్నదో లేదో నేనెఱుంగను. మీరవినట్లు అట్టి యాడొక తెయున్నను, ఆమె యెవరో నేనెఱుంగను. ఈవిషయమున నేం జెప్పవలసిన దేమియు లేదు !"

"అట్లైన జాన్సన్ విగసరీ వర్జర్సుకుమారి పాణిగ్రహణ మొనరించుకొనుట కిక నే యంతరాయము నుండదు."

విషణ్ణముఖుండై విస్మితుండై రాబర్ట్సు "ఏమి! — ఏమనుచుంటిరి! విగసరీ యామెను చేంబట్టునా?"

"అవును. విగసరీ ఎలిసును బ్రేమించెను. దుహిత నాతనికే యీయవలెనని మొదటినుండియు వృద్ధుండు వాంఛించియుండెను."

"విగసరీ నాయంతరంగ మిత్రుండు. నేనాతని ప్రమోల నా ప్రేమ

కాహినిఁ బ్రకాశ మొనరించి యుంటిని. ఆతఁడు నా యుదంతము నంతయు నెఱుంగును. ఎలిసు తానే ప్రేమించియున్న యెడల అట్లని ఆతఁ డేల నాకుఁ దెలిపియుండలేదు? నా దేశ నామిత్రుఁడు విశ్వాసఘాతుకతఁ దలఁచినట్లు మీ మాటలవలన నే నూహింపవలసి వచ్చుచున్నది."

"అట్లూహింపకుఁడు — అతఁడు విశ్వాసఘాతకుఁడు కాఁడు. మీ పత్త్రమున నాతఁడట్లే చాలగా వచించియుండెను!"

"ఆతఁడట్లు వచించువాఁడని యెఱుంగుదును."

"నా తనయను పెండ్లి గావించుకొందువా' యని గౌరీపతి నేఁటి యుదయము విగనరీ నడిగెను. తన్నాపె ప్రేమింపలేదని యువకుఁడు త్తర మొసఁగెను. కాల మతివాహితమ్మైనకొలఁది తనపట్టి యాతనిఁ బ్రేమింపఁజాలునని వృద్ధుఁడు వచించెను. కాని యది సంభవమని విగనరీ విశ్వసింపలేదు. తానీవఱలో నెవ్వనికైనఁ బ్రేమించియుండెనాయని పదఁపడి వర్జర్సు ప్రశ్నింత చాలదినములనుండి తానాతని పుత్త్రియెడ నంతరంగమున ననురక్తుఁడై యున్నట్లు నిసెచ్చెలి తెలిపెను. కాని, మీ దేశనా సుందరి ప్రణయదృష్టులు ప్రసరింపఁబడియుండుటెఱిఁగి, స్వీయవ్యర్థ ప్రణయోదంతము నిసుమంతైన నాతఁ డెవ్వరికిని దెలుపలేదు. తనకన్నియకుఁ దాను తగినట్లు నచ్చచెప్పఁగలననియు, ఆచిన్నారి తన ప్రీతివాక్కుల నిక్కముగఁ బాటించుననియుఁ గౌరీపతి మరల వాగ్రుచ్చెను. ముదుసలి పట్టుపట్టి, తనముద్దుపట్టి నాతనిచేయిఁబట్ట నంగీకరించుచుంట గ్రహించి, విగనరీ ఆతని నుడువులకెట్టి ప్రతివాదముఁ గావింపలేదు. సంగతియంతయు నెంతవఱకు పెచ్చుపెరిగెనో — కన్యాప్రణయము నాటకమెంతదనుక నతివాహితమాయెనో ఇంచుక యోచించి చూడుఁడు. అనతికాలములో వృద్ధునిపట్టుమొయి విగనరీ యెలిసులు పరిణయబంధమున బంధితులు కాఁజాలుదురు! — కాని, అపరాధి యభిధేయము మీరు తెలిపివేయునెడల, ప్రణయ కమలాకరమునఁ దన యొనలేని

హఠాత్తులున పిరాట్లు ఆసీనులౌ హృత్పుండరీకము చుట్టుప్రాకిన అవాంతర ప్రతతీసందోహమును నా శక్తిలపిచిత్రములచేఁ ముక్క తునకలుగఁ ద్రుంపి, జనరోజమును మీ కరములం దప్పన మొనరింతును. నా మాటలు విశ్వసింపుము."

"వ్యాపారము చాలనటకుఁ బెచ్చిల్లియే పోయినది — మీ నుడువులన్నియు నాకు స్పష్టముగ బోధపడినవి. కాని నా సంకల్ప మెప్పటట్టు లటలమై యున్నదని యెఱుంగుఁడు. చౌర్యసంఘటనమును గుఱించి నే నించుకం తేని యెఱుంగను! ఒకవేళ నెఱిఁగియేయున్నను, దానిని మీకడ నాపైఁబడిన దుర్వాదము నాపికొట్టకైనను నరే ప్రకాశ మొనరించువాఁడగాను. కష్టము వచించునదేమన నేనీ దుర్ఘటనము గుఱించి ఇంచుకంతైన నెఱుఁగను. నన్నెంత యాతనమునకు లోను గావించినను, నానుండి మీ రేమియు నెఱుఁగఁజాలరు!"

"ఇదియేనా మీ కడపటి నుడువు!"

"అవును."

అట్లైన మీకుఁ ( తికూలముగ నేమైన ఘటించునెడల నా దోసము వీసమంతైన లేదని యెఱుంగుడు."

"ఇఁక ఘటించున దేమి? నేను మీ యధీనమునఁ గైదినైతిని. — కాని, చిరకాలము నేను కారాగారమునఁ బంధితుఁడనై యుండను. నేఁడుగాకున్న మఱి రెండు దినములు పిదపనైన నన్నుఁ గొనిపోవుట మీ విధి! అపుడు నేనెఱిఁగినదేమో చెప్పివైతును."

పెద్దనవ్వు నగి కర్నలిట్లనెను. "ఓ! ఒకనాఁటితో మీకు నేను విడుదల నొసఁగుదునని యూహించితిరా? అట్లు భ్రాంతి పడకుఁడు. మి మ్మిందుండి ఒక్కయుడుగైన నావలికి పెట్టనీయను. శాసన విరుద్ధముగ మి మ్మిచ్చాతావున బంధించినందులకు దోషినేనైతిని. ఈదోసము

నాకెంతేని దొసఁగు నాపాదింపవచ్చును. కాని, ఏమి కానున్నను మి మ్మిందుండి నే నావలికిఁ బోనీయను."

స్థిరదృష్టులను కర్నలు ముఖముపై నిలిపి రాబర్టు "అట్లైన నన్నిందే యుంచి హత్యగావింతురాయేమి!"

ఘృణావ్యంజకస్వరమున కర్నలిట్లనెను: "ఛీ! — ఇది భద్రపురుషుని లక్ష్యముకాదు. చాలకాలము బంధించియుంచినయెడల, మీరు మీయొప్పుము నొప్పుకొను తీరుదురు."

"అప్పుడుకూడ నే నేమియుఁ బ్రకాశ మొనరింపకున్న నేమిచేతురు!"

"సైబీరియా యందలి మరుభూమియందు మిమ్ము నిర్వాసితుఁ గావింతును! శకటమధ్యమున బంధించివైచి, విశ్వసనీయులైన యనుచరులు నిర్దిష్టస్థానమునకుఁ గొంపోయి మిమ్ము విడిచి వచ్చెదరు. సుంకపురశీదును చూపినంతనే బండి నెవరును తెరచి చూడరు. ఆ వాలుసీమఁ జొచ్చినపిదప, అందుండి కదలివచ్చుట దుస్సాధ్యము. కాని, అకార్యమునకు దొడరకమున్న మీకొక మాసము గడు విచ్చుచుంటిని. గడువు గడచినపిదపకూడ మీరు నేరము నొప్పుకొనని యెడల, నేరస్థులైనను కాకున్నను ఈ ఘటనముగురించిన వృత్తాంతము మఱుఁగుపరుపక చెప్పివేయకున్న యెడలఁ దప్పనిసరిగ నే నా చెట్టకు చేయి చేసుకొనవలెను."

"ఒక్కమాసమే యేల, పది వత్సరముల కాలము నాకుఁ గడు విచ్చినను నాయొద్దనుండి ఒక్కమాటయైనను మీరు బయలుపెట్టజాలరు."

"పదియేండ్ల ప్రయోజనములేదు — ఒక్కనెలయేచాలును. మాసానంతరమున మీ యాసలన్నియు నడఁగంటును. ఏలనన నప్పటికి నెలిను విగనరీ కర్థాంగియైపోవును! మహావైభవమున నీ యుద్వాహము జరుగుటకు వలయు జతనము శక్తివంచన లేక సలుపుదును. ఏనాటి వార్తలానాఁడే మీకుఁ దెలుపుచుందును. గడువు గడవకుండగనే — ఆశ

యతీతము కాకమున్నె, నా వేడికోలును మన్నించి తీర్చుదురని విశ్వ
సించుచుంటిని."

"చెప్పుకొని పొందుము. నిష్టురతనము గల్గినచో ప్పు ఎంతమునో దయా
విహీనము మొనరించి ప్రయోగింపుము. బందుమిత్రమైన నా ధైర్యము
విలుప్తము కానేరదు."

"ఇంక మీతో వచింపదగినదేదియు లేదు. నేనింక పోవుచుంటిని."

రాబర్టు తలవంచుకొని కూరుచుండియుండెను. అతని హృదయ
మంతయు వ్యర్థరోషముచే పుంజీభూతము కాజొచ్చెను. నిష్టురతం
బూనిన బొరిమఫ్ దొర ప్రేమవు యొక్కందు అతని హృదయము విదీర్ణ
మొనరించినదై చుచుండెను! ప్రియతముడైన సుహృద్వరుడే అతనికి
ప్రాణసమముగు సుందరి కేలుబట్ట కాంక్షించుచుండెను! జామాతయందు
వర్జ రైన్నట్టి గొనములనన్నియు వినెడిచుండెను అవన్నియు విగనరీయందు
విద్యమానములై యుండెను. ఇవ్వనమున రంజింపజాలు గుణ
ములుకూడ అతనికి తక్కువలేవు. ఆ యువకుడు రూపవంతుడు! —
బుద్ధిమంతుడు! వినయశీలుడు! జీవనమున నాతడెన్నడు నెట్టి
దుష్కృత్యములు చేసి యెఱుగడు."

"మిత్రుడగుడు ఆతని గుఱించి యనుచితము యోచింపజాలను.
కాని ఆతనికతన నాయకునులకన్న మిన్నయైన యన్నల మిన్నను
గోల్పోవుచుంటిని. ఆసుందరి వానినే పరిణయంబాడును. పితృాజ్ఞ నామె
లంఘన మొనరింపదు. చాలకాలము నన్ను జూడనికతన ఆపె నన్ను
మఱచియుండును. సిక్కముగ నేను నేరస్థుడనని ఆమె గ్రహించి
యుండును. దానం జేసి దురంతమైన జుగుప్సచే నాపె యెడద రవులొకాని
పోవుచుండవచ్చును."

రాబర్టిట్టులు వితర్కించుకొని దుస్సహమైన మనస్తాపముచే బొగు
లుచు, అంతరంగమునుండి యవిరళముగ నశ్రుధార లుప్పొంగ, బావ్ప

నుసిక్తమైన మొగమును రెండు చేతులందు మూసిపెట్టుకొని, నతమస్తకుడై ఆతఁ డట్టులే కూర్చునియుండెను. నలుగిక్కులందును ప్రగాఢ నీరవత విరాజిల్లుచుండెను. నిజ దుర్బలతకు రాబర్టు లజ్జితుఁడు కాఁదొడఁగెను. "ఎట్టులైన నే నీతావునుండితప్పి అవ్వలఁ బడవలెను. కాని, యుద్ధారమున కెట్టి యుపాయము తోఁపకున్న రెండు, నీయింటికి చిచ్చు పుట్టించి అనర్ఘలింగములం పుడఁ బడి అస్తమింపుదును!"

కాని, అగ్ని పుట్టింపవలెనను వాంఛ నాతఁడు త్యజించివైచెను. కన్నులు బంటులే పెక్కురు నిలుచుకునుటకు నాలుఁగు వలనుల నప్రమత్తులై కాఁపు గాయుచుండిరి. నిప్పంటిన యిల్లు భస్మముగ కాండిపోదు కదా! అంతటను గల యారెకు లరసియునమూలో నవలము నారిపి వేయఁజాలుదురు. ఆ పూనిక నిరర్థకమని నిశ్చయించి, రాబర్టు లేచి నిలువంబడి, ఆగారము నంతయుఁ బాగుగఁ బరిశీలింపఁ దొడంగెను. పైన మూఁడు కిటికీలు చూపట్టుచుండెను. కాని, యవి గాజుతలుపులతో మూయఁబడియుండెను. ఒకతూరి వాతాయనముఁ జేరఁ జాలిన మొడల, పలాయన మొనరించుట కేదైనను నున్నదో లేదో యాతఁ డవలీలగ నూహింపఁజాలును. కాని, అంత యెత్తునకు నెక్కుట యెట్లు? తానున్న గది యేదిక్కున నున్నదో కూడ నతఁడే బాగుగ నెఱుఁగడు!

మూఁడు వెలుఁగు ప్రదీపము నెత్తి రాబర్టు గదియంతయుఁ గడుంగడు జాగ్రత్తగఁ బరిశీలింపఁదొడఁగెను. ఆయాగారము మిగుల విశాలమైనది. నాల్గుమూలలు తిరిగి వచ్చుచుండ నొకచో నొక చిన్న నిశ్రేణి ఆతని కన్నులఁ బడెను. నిశ్రేణిగుండా వలయముగనున్న పైవసారాఁ జేరవచ్చును. యువకుఁడు మెల్లగఁ బైకినెక్కెను. గవాక్షమచటి కనతిదూరములో నుండెను. దానిని సమీపించి, దీపము నతఁ డవ్వలికిఁ బట్టి పరిశీలించెను. ఆవల నొక పెద్దతోట కానంబడెను! ఉన్నతములైన వృద్ధసాలములచే నా యుద్యానము నిండియుండెను.

ఉద్యానమునకు నలుకెలఁకులఁ గల ఉన్నత ప్రాచీరముకూడ ఆతని కన్నులఁ బడెను. కాని ప్రాచీరసన్నికట మున నొక్కచెట్టుయైన లేదు. ఎవ్వరిజాడకూడ నందుఁ జూపట్టలేదు. ఆరామ మంతట గభీర నిస్తబ్దత నిరాజిల్లు చుండెను — భూమితలమంతయుఁ బచ్చగఁ బట్టుపగిదినున్న చెంగలువచేఁ గప్పబడియుండఁ బ్రకృతికాంతహరిద్వర్ణాంబరము నేలఁ జీరాడుచుండెనా యనులీలఁ దోఁచుచుండెను! పచ్చనలుపైఁగల తెల్ల చుక్కలట్లా పచ్చికపట్టునంతయు శుభ్రతుషార బిందువులచే నలరారు చుండెను! మనుష్యపాద చిహ్నమేమియుఁ గానుపించుటలేనందున యనవరాశిపైనున్న శిశిరబిందువులిసుకపైన మాపుగాక ఆణిముత్తెము ములట్లు తోఁచుచుండెను! ఉద్యానమాలి యెవండును అందు లేనట్లు రాబర్టు గ్రహించెను. వాతాయనమునుండి నేల సుమారు ముప్పదడు గుల నిమ్నమున నుండెను. దానంజేసి గవాక్షమునుండి ఆవలికుఱికిన యెడల తోడనే మృత్యుదేవి యొడియందుఁ బడుట నిశ్చయ మని ఆతఁడు గ్రహించెను. సావధానచిత్తుఁడై రాబర్టు నాల్గుదిక్కులఁ దేరి చూచెను. ఆరామభిత్తికపై నేదియో కదలుచున్నట్లాకస్మికముగ నాతనికిఁదోఁచెను. బాగుగఁ బంశీలింప నా కదలునదేదియో మానిసి శిరమువలె యువకునకు నూపట్టెను!

ఆ మానిసి అందేమి చేయుచుండెను? గోడమీఁది కాతఁ డేల యెక్కెను! ఎట్టులాతఁ డెక్కఁజాలెను? కర్నలు యాదేశానుసార మెవండో ప్రతీహారి అందడఁగియుండి, పహరా గాయుచుండెనని రాబర్టు మొట్టమొదట యోజించెను. ఎక్కుటకు దుస్తరమైయున్న నాచోటునఁ గాఁపుకూడ నెందులకు? ఏ దేని మఱుఁగున నిలువంబడి కాపరి కాఁపు కాయవచ్చును. ఎత్తైన తోటగోడ కడ్డముగ నిచ్చెనఁ గాని మఱి యే మెట్లవరుసగాని లేదు. భిత్తిక కావలితట్టునుండి ఆ మానిసి యెట్టులో యెగఁబ్రాకియుండును! అట్లైన ప్రాచీరమున

కావలివలనున రాజపథముండి యుండును! ఏయుద్దేశమున నాతం డా కుడ్యము నారోహించెను! చౌర్యోద్దేశమా? — కావచ్చును! రాతిరి యింకను గభీరము కాలేదు. సంఘటిల్లగడచిన యనంతరమే అపహరణమునకు దొడరిన వాని సాహసము తక్కువదిగాదు!

"ఆవలినుండి ఎట్టిసాయమునైన పడయుదునను ఆస యుడిగితిని! అయినను ఇంకను పూనికపలిపినఁ జెల్లదా! గోడమీఁదివానికి సైగ జేసిన, నష్టమేమి? కాని, నన్ను గ్రహించినయెడల నతఁడు పలాయన మొనరించునేమో! అయినను ప్రయత్నించి చూచెదగాక!" ఇట్లని యోచించి వెలుఁగుచున్న దీపమును రాబర్టు పైకెత్తిపట్టుకొని, కిటికీ, యావలికి దాని వెలుఁగును ప్రసరింపఁజేసెను. బాహిర మంతయు నిబిడాంధకారబంధురమై యుండెను! — కానం జేసి యాలోక శిఖ నిశ్చయముగ గోడమీఁది వానికి దృగ్గోచరమైయుండును. అతఁ డేమి యొనరించెనో పరీక్షింప రాబర్టా దిక్కునకే తదేకదృష్టితో వీక్షింప సాగెను! భిత్తినంటియున్న యాకార మాయాలోకము వీక్షించి పలాయనమగుటకు మాఱు మోచేతి నూఁతగావించుకొని మఱింత పైకెక్కఁదొడఁగెను! ఇసుమంతయైన సంశయపడక గవాక్షమునుండి ప్రదీపము నవ్వలికి బాగుగవంచి, రాబర్టు మెల్లగ దాని నటు నిటు నూపసాగెను! తన్నుద్దేశించియే సంకేత మొనరింపఁబడుచున్నదని గోడమీఁదివాఁడు గ్రహింపవలెనని యతని యుద్దేశము! ప్రాచీరముపై నున్న మానవుఁ డా యింగితము నుపలక్షించి, తన దృక్కులఁ గిటికీ తట్టుగసారించెను!

రాబర్టాతని యాకారముఁ జూడఁజాలెను. — ఒక బాలుని యాకృతివలె నది వానికిఁదోఁచెను! కాని, దూరమందుండుటచే స్పష్టముగ నా రూపమును విలోకించు టాతనికి సాధ్యముకాకపోయెను.

బాలకుఁ డొక బాహువునెత్తి తన బొమ్ముఁజూపి, "నన్నుద్దేశించియే ఇంగిత మొనరించుచుంటిరా ?" యను భావమును వ్యక్తీకరించెను.

దీపము నిటునటు నూఁగఁజేయుచు, రాబర్టు దానిని తన మొగము చెంతకు నెత్తిపట్టుకొనెను. బాలుఁడు రాబర్టును తేరిచూచి, చివాలున గోడపై నిలిచి జోహారుఁ జెప్పుచుఁ దలనుండి టోపీఁదీసెను !

"బాలకుఁడు నన్ను గుర్తించినట్లు తోఁచుచున్నది ! అతఁడు నన్నెందుఁ జూచియుండును ?" అదె యాతఁడు క్రిందికి దిగిపోవుచున్నట్లు తోఁచుచున్నది ! భయపడకుము. నేను మరలివత్తునని చేసన్నచేఁ నాతఁడు తెలుపుచుండెను. [illegible] కోటుబొత్తా మకస్మాత్తుగ రాబర్టు కన్నులబడెను. "ఓ ! అతఁడు జర్జెటు ! నిశ్చయముగ జర్జెటు !"

ఉదయమున కర్నలు గృహమునకుఁ బో నరుదెంచుచుండ పథమున తోఁడిబుడుతలఁగూడి జర్జెటు ఆడుచుండుటఁ దాఁ గాంచినట్లు రాబర్టున కాకస్మికముగ జ్ఞప్తికివచ్చెను. బాలుఁడన రాబర్టునకు పంచప్రాణములు. బుడుతఁడుకూడ ఆతని ప్రేమాల భక్తితాత్పర్యములతో మెలంగుచుండెను. కర్నలు గృహమున రాబర్టు ప్రవేశించుటఁ జూచి, బాలకుఁడు కడు నబ్బురపడియెను. అతఁ డచటి కేల గొంపోబడెనో యెఱుఁగ, గుర్తుఁ దుత్తునకుఁ డాయెను. బలవంతముగ దొర వానిని బంధించివైచెనని పిల్లవాఁ కెట్లు తెల్లమాయెను ? ఆతని మనసునం దట్టి సందియము కలుగకపోయినయెడల ప్రాచీరభిత్తికపై కాతఁడు ప్రాకు టెందుకు ? బ్రతుకవలె నను వాంఛ వానికి లేదా ! గోడనుండి దిగునపుడు " నన్ను నమ్ముఁడు. ఇంచుక పెటసాయము పడసి మిమ్ము విడుదలజేతునని సన్నచేఁ దెలిపి ఆతఁ డరిగెను.

బాలుని యసమాన ధైర్యమునకును, అద్భుతౌదార్యమునకును మిగుల నబ్బురపడి నిశ్చింతచిత్తుఁడై రాబర్టు తల్పమున తనువుఁ జేర్చెను. నిద్రాభంగమై ఆతఁడు లేచుసరికి వాతాయనపథముగుండా ఆగార

మధ్యమునఁ బ్రవేశించి అరుణాంశుని స్వర్ణహస్త నృత్య మొనరింపసాగెను. వేసముమార్చి అతఁ డొక కుర్చీలోఁ గూర్చుండెను! అకస్మాత్తుగఁ దలుపు తెఱువబడెను. బ్రహరుఁ డొకఁడు గదిలోఁ బ్రవేశించెను.

రా — "మీ కేమి కావలయును?"

"మీకు నిద్దురపట్టెనా?"

రాబర్టేమియు నుత్తర మొసగలేదు.

బ్రహరి — మీ కే భిన్నహస్తము పొందకోరును. మీ కది లభింపదు.

"అట్లైన తాము దాని నపహరించితిరా?"

"అది నాకడనే యున్నది. సిక్కుసును సత్కరించినంతనే మీరు మఱల మీ హస్తమును పడయఁగలరు!"

రాబర్టు ముఖము వివర్ణమై పోయెను. అర్థముకొఱకై అతఁడు చింతిలువాఁడు కాఁడు. అతని నిర్దోషత్వమును నిరూపించు నాధారము శత్రుహస్తగత మగుటచే, పాప మతఁడు గొప్పముప్పునఁ బడిపోయెను!

"మీ యజమాని నొకసారి యిటు పంపుడు — అతనితో మాట్లాడ వలసియున్నది."

"మా యొడయుని కించుక సుస్థిగా నున్నది. ఇప్పు డిచటి కాతఁడు రాలేడు. చౌర్యసంఘటనమునకు సంబంధించిన యుదంత మంతయు మీరు నాకు విప్పిచెప్పినంతమాత్రాన మా చేతులనుండి మీరు విడుదలఁ బడయఁగలరు."

కర్ణకఠోరములైన వాని పల్కులు విని, రాబర్టేమియుఁ బలుకక తనలో నిట్లు వితర్కించుకొనెను. "ఆహా! ఎట్టి దుస్థితి ప్రాప్తించెను! ఎట్టులైన నీతావునుండి తప్పి, అవ్వలఁ బడవలెను! కాని దౌర నిష్ఠుర నియమమునకు లొంగి ముక్తిఁ గైకొన నిచ్ఛగింపను!

తుషారము ప్రబలముగఁ గురియుచున్నను, ఆనాఁటి నిశీథిని నాటకాలయము లన్నియుఁ దెఱువఁబడియే యుండెను. శ్రాంతుఁడై, మేక్బెము గృహమునకు మరలెను. వేషముమార్చి ఆతఁడు మఱల ఇలువీడి అవ్వలి కరిగెను. నాయర్గును చూచుటకై ఎలిను చనిన విషయము నడంచిపెట్టి, ఆనాఁడు జరిగిన సంగతుల నన్నిఁటిని విగనరీకిఁ దెలుప నాతఁడు నిశ్చయించెను. రుడేనువేనిని కాతఁడరిగినంతనే నృత్యసభ కాహూయమానుఁడై తనయుసహితుఁడై మాతులు యరిగిన సువార్త చెప్పఁబడెను. ఎలిను యెన్నఁడు నట్టిసభ కరిగి యుండలేదు. నేఁ డచటి కరిగినందున నాపె మనోభావము పరివర్తన మగుట నిశ్చయము. వర్జిగ్సు నిలయమునుండి విగనరీ యావాసమున కరిగి ఆతఁడుకూడ నృత్యసభకుఁ జనినట్లు మేక్బెము తెలిసికొనెను.

ఆరేయి యానందమున గడిపివేయ నిశ్చయించి, నాటకశాల దిక్కుగ నాతఁడు పదములు మరల్చెను. అచటి కాతఁడు సేరు నప్పటికి రంగస్థలమున నభినయ మారంభమాయెను. లోఁజొచ్చి నలుదెసల కాతఁడు దృక్కుల సారించెను! — పరిచితులైనవా రెవరు నందుఁ జూపట్టలేదు. ఒంటరిగ గూరుచుని నాటకము జూచుట కడుకష్టకరము. ఏమియు పాలుపోక యెఱిఁగిన వారెవ్వరైనఁ గానుపింతురను నాసతో నాతఁడు మఱల నాలుఁగుతట్టులు చూచుచుండ, రంగస్థలమునకు దక్షిణమునఁగల ఆసనముపై ఆకస్మికముగ అతనిదృష్టులుపడెను. మువ్వురు యువతులందుఁ గూరుచుని నవ్వుకొనుచు, పరమోల్లాసమున ప్రసంగించుకొనుచుండిరి!

నీ పౌరనృత్య ప్రాంగణమునఁ దా నీవరలోఁ జూచిన మువ్వురు కాంతలే వారని మేక్బెము నిముసములో గుఱుతించెను. ఇంతిం

తనరాని సంతసమున నుప్పొంగుచు నాయిందిపులు యువకునిఁ జూచి, చేసన్నలచే నాతనిఁ దమపాలి కాహ్వానించుచు. అంగన కభివాదన మొనరించి మొగము ప్రక్కకు మరల్చుకొని మేక్సిము కూర్చుండెను.

గానయంత్రమునకు వామభాగమునందే లెడ్డీ యాసన ముండెను. తనప్రక్క గల రెండు బాక్సులయందు నెవ్వరైనఁ గూర్చుండిరో లేదో ఆతఁ డెఱుఁగఁజాలక పోయెను. ఆసనాసనములకు నడుమ జవనికలు కలవు! మేక్సిము కౌతూహల మంతకంతకు వృద్ధికాఁదొడఁగెను. తెర మఱుఁగున నెవరుండిరో చూచుటకై ఆతఁ డించుక ముందునకు జరిగికూర్చుండెను. ఒక యాఁడుదాని బుజమునం బొక యంశ మాతని కన్నులఁబడెను. అందుఁ గూరుచున్న యాపె యెక్కుతియొ కాదని యువకుఁడు గ్రహించెను. అపుడపు డెవరితోడనో ఆ యింతి ప్రసంగించుచున్నట్లాతనికిఁ దోఁచెను. మేక్సిము మఱల తిరిగి కూర్చుండెను. మొదటి మూవురు కాంతలు కూర్చుచున్న వైపు కాతఁడు మఱల తన చూడ్కులఁ బరపెను. యువకుఁ డెంత యుదాసీనముఁ జూపుచున్నను, ముగ్వురు జవ్వనులు పరమప్రమోదముగ వాని దెసఁ జేసన్నలు కావింప దొడంగిరి. వారిలో రోజ్ అను నామె చేసైగచే నాతనిప్రక్కఁ గల ఆసనము జూపుచుఁ గనుసన్నలు వాని దిక్కుగఁ బరపుచు, ప్రసారిత వక్షమునుండి పొంగివచ్చుహాసలాలసహరి వదనకళలవను మఱింతకాంతి మంత మొనరింప వగలుజూపు విలాసవతిలీల నభినయించుచు సుందరుఁడగు యువకు నుద్దేశించి మెల్లనిస్వరమున నేమో పలికెను! "ఇచటికి రండు. మంచి తమాషాచూడఁగలరు! అందే కూరుచున్న యెడల మీకది గోచరింప" దనుభావము నాపె వ్యక్తీకరించుచుండెనని యువకుఁడు గ్రహించెను. కాని, ఆతఁడు తాఁ గూరుచున్న తావునుండి కదలలేదు. యువతి మరల సన్న యొనరించెను!

"మీచెంతఁగల ఆసనముపైఁ గూరుచున్న రమణి మీ రెఱిఁగిన

యాపెయే " యని రోజు తెలుపుచుండెను. " ఈపె యెవరో చూచిన నష్ట మే " మని యూహించి, యువకుఁడు లేచి రమణులు మూవురున్న తావున కరిగెను.

రోజ్ — మావిన్నపమాలించుటకు చాలసేపుపట్టెనే !

డెలిఫిన్ — మహాశయా ! మే మన్న మీ కింత నిర్లక్ష్యమా ? జవ్వనులయెడ నిట్టి యుపేక్షభావముఁ జూపఁ జెల్లునా ? ఒక్కవరుసను మూవురము పిలుచుచుండ మొగముద్రిప్పకొని కూర్చుండిరి ?

" నేను వచ్చినయెడల, కూర్చుండుటకు మీ కిబ్బంది కలుఁగునని గాలేదు ! "

లిలీ - ఏమి మీ వాక్కు ! ఎట్టి చతురులు ! బాక్సునందు నాలుఁగు ఆసనములు ఉండునని యెఱుఁగనే యెఱుఁగుదురు కదా ! ఇటు విచ్చేసి మాచెంగట గూర్చుండుటకు మీకింత శంకయేల ! కుశీలవుల యభినయము మిచటికి బాగుగఁ జూపట్టకుండుట నిక్కమే ; కాని, రంగస్థలమున జరుగుచుండు అభినవనాటకమును చూడ రండని మిమ్ము మేము పిలువలేదు ! "

" అట్లైన నేమిచూపుటకుఁ బిలిచితిరి ! "

రోజ్ — మీ కేమియు చూపనేకూడదు. మే మెంతనిలిచినను, కూరుచున్న తావునుండి మీరు కదలనే తలఁచుకొనలేదు !

" ఆ కూరుచున్న రమణిని చూపుటకై పిలిచియుందురు ! అట్టి స్కంధసీమఁగల నీమంతినీచూడామణి నెందో చూచియుందు నను కొనుచుంటిని ! ! "

రోజ్ — అట్లైన బాగుగఁ బరీక్షింపుడు — నాదుర్భిణి ( దర్శన యంత్రము ) నీయమందురా ?

లిలీ — ఒకమాఱేయుము. మహాశయుల నేత్రముల —

మేక్సిము — నా నేత్రములకు దృష్టి దోషము లేదు. దుర్భిణి

యొక్కఱలేదు. జవనిక యెఱుఁగులేకున్న, ఆ జవ్వని నీవఱలోనే గుఱుతించియుండును!

అప్పు డా కపురుషుండు మొగమును ముందునకు బాగుగ సాచి రంగస్థలమందలి కుశీలవుల అపూర్వాభినయమును వీక్షింపఁ దొడఁగెను. ఆ పురుషు నెందో చూచియున్నట్లు సేక్స్పియునకుఁ దప్పైను! అతఁడు సూర్యుల వంటిమేనుగలవాఁడు — ఒడ్డుపొడుగులుగల పూరుషుఁడు! వాఁకము కడు రోమశముగనుండెను!! కాని వానియొడలునఁగల ఉడుపులను జూచినంతనే ఆతఁ డొక వైదేశిక రాజకుమారుఁడని తోఁచుచుండెను!!!

"ఆతనిఁజూపుటకే నన్నుఁ బిలిచితిరా! ఆతఁ డెవరో యెఱుఁగుదురా!"

రోజ్ — ఎట్లెఱుఁగుదుము? జీవితమం దిపుడే ఆ బాలకము మా మ్రోల సాక్షాత్కరించెను! అందమున కాటపట్టై ఆవిగ్రహము మాఱారుచుండెను!

"ఆరమణి నెఱుఁగుదు రనుకొనెదను!"

"ఎఱుఁగుదుమే యని యనుకొందము!!"

"ఆమె యెవరో తెలుపుదురా?"

"ఎవతెయైయుండెనో మీరే యోచింపుఁడు!!"

"నే నెట్లు యోచింపగలను? — యవనిక వెనుకనున్న మొగమును నేను చూడనేలేదుగదా? — ఇఁక నామెను గుఱుతించు టెట్లు?"

"ఆమె మగనినైనను గుఱుతింపఁజాలరా?"

"ఆమె మగఁ డెవరో నేనెఱుఁగను."

"అవును — మేముకూడ నట్లే యూహించితిమి. మీరు చెప్పినను, ఆరమణి వివాహితయని మేము విశ్వసింపలేదు.

"ఏమి! — నేనట్లు చెప్పితినా? — నాతో మీరు పరిహాసములాడుచుంటి రనుకొనెదను."

" అన్నప్పుడేల మేలమాడుదుము ? —

సాంద్రమైనగడ్డముతోను, వలయములుగఁ బై కెగఁబ్రాకిన బుగ్గ మీసములతోను, అలవారుచు బూచివలెనున్న ఆవికారాంగుఁ డట్టి యందకత్తెకు పెనిమిటియని నమ్ము టెట్లు ? ఆ సుందరిపాలికి మీరు తఱచుగఁ బోవుచు వచ్చువారు గాన, నీవిషయము మీరు బాగుగ నెఱింగియుండవలసినది !!"

" నాతో పరిహాసమునకు గడంగితి రేని, నే నిందుండి వెడలిపోదును."

రోజ్ — పోవుదు పోవుదునని యుబలాటపడువారి కాలుసేతులు పెనవైచి యొడిలోఁ గూర్చుండఁబెట్టుకొనుట ఉచితము కాదు. కాని మిమ్మింతలో విడిచిపెట్టుటకు మేమంత నిష్టురులము కాము! — ముఖ్యముగ నామన సందుల కీయకొనదు. కంకణ మిపుడుకూడ మీచేతనే ఉన్నటులున్నదే! — అట్లైన మీకు దానినొసఁగిన కామిని యెడ మీ రింకను అనురక్తులై యున్నట్లు తోఁచుచున్నది. ఆమె నామధేయము మీకుఁ దెలుపుదునని మేము వచించియుండలేదా!

" అవును — అంతియకాక ఆ కులకాంత ప్రకృతి కడు విచిత్రమైనదని కూడ వచించితిరి."

" ఆసమయమున చికిత్సకుఁడు వచ్చి ముందు దాపరింపకపోయిన యెడల ఆయింతినిగుఱించి మీ రెన్నెనివిశేషములను వినియుండెడివారు"

" నేఁ డిచట నెవరును లేరు — ఆ కాంత యుదంతము నంతయుఁ దెలుపుఁడు."

రోజ్ — మంచిది — మీ స్వప్నరాజ్యమున కథినాయికయైన నా మహిళతోఁ గలిసి ఒకహోటలున నొకనాఁడు విందారగించితిని.

" ఏమి ! — అట్లా ?

" మావలెగాక మీ ప్రణయిని కులకాంతయని మీరు యోచించు చుంటిరి ! — మహాశయా! మీరు పొరపడితిరి! మీరు వలచిన

వధూటికూడ కులకాంత కాదు. నెలదినములకు మున్నామె ఎవరో యొక విదేశీయునితో గాఢమైన ప్రణయ సంపర్కమున మెలగు చుండెడిది. ఆ విదేశీయుఁ డింకొక విదేశీయుని కంతరంగ మిత్రుఁడు. ఆ రెండవయాతఁడు నా కనుంగు నెచ్చెలియైయుండువాఁడు! వారిర్వురకు గల సంపర్క మెట్టిదియో యీయిరువుర సంపర్కముకూడ నట్టిదియే! ఇంచుక చుట్టిచెప్పినను, మీరాసంపర్కము నందలి గుట్టును గ్రహించియే యుందురు! ఒకనాఁ డకాత్తుగ నా విదేశీయమిత్రు లిర్వురు నాటక ప్రదర్శనము చూడ సత్రావునకు విచ్చేసిరి — నెయ్యురు లిర్వురొంట రులై వచ్చితిరని తలంపకుఁడు. ఒక్కొక్కనితో నొక్కొక్కని మక్కు వంపు పొలంతికూడ నరుదెంచెను. నాటకము ముగిసినపిదప నుభయ మిథునములవారును అనతిదూరమున నున్న పీటర్సు హోటలునకు జనిరి — వసించుటకు, శయనించుటకుఁ దగు వసతు లందుంట మీ రెఱిఁగియే యుందురు!"

"ఆపడఁతి పేరేమి! — చూచుట కెట్లుండును? ఆమెను గుఱించి నీ వేమెఱుఁగుదువు?"

రోజ్ — తన పేరేమో ఆమె నాకుఁ దెలుపలేదు. ఆమె మాటలం దారి తేరిన తెఱవ — వినమ్రము నభినయించు వలపులాడి! కాని, ఆమె తన సంగడీనిపోలెఁ గూడఁ బూర్తిగ నాత్మప్రకాశ మొనరింప లేదని ఆమె ముఖభావమువలన బోధపడుచున్నది. ఆ యింతి యెందుండి యరుదెంచెనో యెఱుఁగను. కాని రష్యా తుర్కీ దేశీయులతో నా పడంతికి గాఢమైత్రి యున్నటులు గ్రహించితిని. ఆనాఁడు తక్క నే నామెను మరలఁ జూడలేదు. మీచేతికంకణముఁ జూఁడగనే నా కాపె జ్ఞప్తికి వచ్చెను. ఆనాఁడు సాయంసమయమున మిమ్ముఁ గలిసి కొనినపుడు నాకన్ని సంగతులు స్మృతికిరాలేదు. అనంతర మొకనాడు పీటర్సుహోటలునందు విందారగించుచుండ, అకాత్తుగ నాపొలంతి

ష్టిపథమునకు వచ్చెను. హఠాటలునంటే ఆమె నాకిట్టి కంకణముం జూపియుం డెను! కంకణమందలి మరకతశిల యొకటి పోయెను — వస్తువును మరమ్మ తొనరింపఁగోరి మంచి కమసాలి నెవనినైన నెఱుఁగుదురా యని నన్నామె యడిగెను — నేను మీ లోహకారుని పేరుఁ దెలిపితిని.

“ పిదప ఆమెను నీవు మఱలఁ గలిసికొనలేదా ? ”

“ లేదు. నేనిపు డామెను చూచుచుంటిని. అదే ఆపెట్టెలోనే ఆమె కూర్చునియున్నది. ”

“ ఆమగువ యామెయేయని నమ్మఁజాలను. ”

“ శపథపూర్వకముగఁ బలుకుచుంటిని — నా దృష్టిశక్తి పాడు కాలేదు. స్పష్టముగ నిందుండి ఆమెను విలోకించుచుంటిని. ఆమెకూడ నన్నుఁ జూచియుండును. నాతో మాటలాడవలెనను వాంఛ ఆమెకు లేకుండవచ్చును. దానం జేసియే తెరమఱుఁగున నామె కూరుచుని యుండెను. ”

“ ఆ సీమంతిని నొక పర్యాయము చూడ నువ్విళ్ళూరుచుంటిని. ఇచ్చోటున కా మచ్చెకంటి స్పష్టముగఁ గానుపించుటలేదు. కావున నిందుండి లేచిపోవలసి వచ్చుచున్నది. ”

యవనిక పైకెత్తఁబడుట విలోకించి, ద్రుతగామియై మేక్సిము ప్రథమపంక్తిలోని ఆసనమున నుపవసింప నుద్యమించెను. బాక్సు నుండి అవ్వలి కరుగుదారి ఆరమణిదాపునందే యుండెను. ఎప్పటి చోటునఁ గూరుచుని యువకుఁ డిట్లు యోచింపఁదొడఁగెను !

“ రోజ్ చెప్పినది సిక్కము. నగలవానిమాటతో నామె మాట కలియుచున్నది. కాని, చేయి తెగిన పదునేను దినములలోనే ఎట్లాపె నాటకముఁ జూడ నరుదెంచెను ? మఱొకర్తుకైనయెడల, మంచముఁ బట్టియుండును. ఆమె సంగడికాఁడు చెంత లేడా ? తన యనుంగు నెచ్చెలి కొక చేయి లేకుండు టాతఁడు లక్ష్యింపలేదా ?

ఒకవేళ ఇరువురు కలిసియే కుట్ర పన్ని, ఇనుపపెట్టె దెఱువఁ జని యుండిరా? ఏమైనను, ఇఁక నన్ని వేళల నొకకన్ను వైచి, వారి జాడలను బాగుగ గుఱుతింపవలెను. మెల్లగ రమణిదరిఁ జేరి, పరీక్షించెదగాక!"

ఇట్లు వితర్కించుచు మేక్సి మించుక అన్యమనస్కుఁ డాయెను. రమణియున్న పెట్టెవంకఁ దిరిగి చూచునరి కది తెరచే బారుగఁ మూయఁబడియుండెను — రమణి కానుపించుటలేదు! అచ్చోఁ దోఁచిన వికారపురుషుఁడుకూడ నిపుడచట లేడు.

"అదిగో! పలాయన మొనరించుచుండిరి! విడువరాదు! వారిని పట్టుకొనుట కిదె తరుణము." అని నిశ్చయించి, యెదుట నున్న వారిని బలంబునఁ ద్రోసివేయుచు, చివాలున నందుడి యున్మత్తుని చాడ్పున మేక్సి మాపురుషుఁ డదృశ్యుఁడైన దిక్కుగఁ బర్విడెను. ఆ పూరుషుఁడు చప్పుచప్పునఁ దన నిడివిపాటి కోటును తొడుగు కొనుచు చనుచుండెను. ఆతనితో రమణి లేదు! తన్నాతఁడు చూడకయే పర్విడుచుండెనని మేక్సిము గ్రహించెను. వికారపురుషుని వికలాంగము లన్నియు నొక్కుమ్మడి యునకుని దృక్పథమునఁ బడియెను. "ఈవింతమానిసి నింతకుమున్నెందో చూచియుందు" నని మేక్సి మనుమానించెను!

"ఈతని నెందుఁజూచియుంటిని? — బాగుగ యోచింపవలయును. రమణి యిపు డొకతెయే యున్నది! ఈ మాటామె ద్రోలకరుగ వలెను. తన కంకణము నాకు లభించెనని ఆమె యెఱుఁగదు — పురుషుఁ డెవఁడో నాకిపుడు జ్ఞప్తికి వచ్చినది! నాఁటి యుదయము రుజోప్రాయందు సుందరి మేడకేలుపు నన్ను గద్దించి మూఁచివైచినఁ వికారాకారుఁడే ఆతఁడు! అట్లైన నీరమణియే ఆమె — సరే చూచెదఁగాక! ఇందలి రహస్యమేదో ఇంచుక తెల్లమగుచున్నది!"

"అందు నిలిచి యేమి చేయుచున్నారు? — దారి తెఱువఁబడెను.

పెట్టెదాపున కీమాటు చనుఁడు" అని సైగచే, కూరుచున్న తావు నుండు రోజ్ ఆతని హెచ్చరించెను.

మేక్సి నలుదిక్కులగ దృక్కులు పరపి విస్మయపడిపోయెను. నీహార నృత్యప్రాంగణమున ఆనాఁ డెవర్తుకను తాను గాంచెనో – నిశీథినీ సమయమున నెవ్వతె ననుగమించి ఆపె యింటిదనుక తా నరిగి యుండెనో ఆ కుంరియే, ఆసాస్టవ సౌందర్య సంపన్నయే బాక్సునమ్ము ఖమునఁ గూరుచునియుండెను! యువకుఁడు తన కన్నులఁ దా నవ లీలగ నమ్మజాలకుండెను! కూరుచునియున్న రమణి నిక్కముగ నా సుందరియే! మహోజ్వలమైన విద్యుదాలోకమునఁ ననన్యసామాన్య లావణ్యోపేతమైన ఆ సుందరి యంగ ప్రత్యంగములు యౌవనద్యుతుల నీనుచు ఆతని కన్నులపండు వొనరించుచుండెను!

రోజ్ పల్కులు విశ్వసనీయములు కావు. నిక్కముగ నామె యున్మాదినియై యుండును! ఇనుపపేటిఁ దెఱచి, చౌర్య మొనరింపఁ బూనిన చాన కొక చేయిలేదు! కాని, ఈ కాంతకు రెండు కరములు కలవు! ఒక వేళ నొకటి కృత్రిమహస్తమై యుండునా? సమున్నత మైన అస్త్రవిజ్ఞానమున నబ్బురపడవలసిన విషయమేమియు లేదు! కాని, అది యసంభవము! రమణి తన వామహస్తమును స్వాభా వికముగనే చలన మొనరించుచుండెను! ఎవతెయైన నేమి! - ఈ పర్యాయ మా పడంతిని తేఱిచూడఁ జాలితిని! ఈ పల్లవాధర జాడ లను బాగుగ లక్ష్యింపవలెను!" అని యువకుఁడు వితర్కించుకొనెను. సుందరి నలుదెసలకుఁ దన వీక్షణములను నిక్షేపించుచుండెను! అతా త్తుగ నిర్వురి దృష్టులు పరస్పరాలింగనమున సమ్మిళితములై పోయెను! మందస్మిత వదనసరోజయై సుందరి యువకున కభివాదన మొన రించెను! మేక్సి యింక తడయలేదు. దర్శకులను ద్రోసివైచి రమణీ యాసనాభిముఖముగఁ జనసాగెను! మాటిమాటి కాతఁడు వచ్చుచు,

పోవుచుంటఁ గాంచి ప్రేక్షకులు మిక్కిలి చికాకుపడి, ఒక్కుమ్మడిగ నగ్రసరులై, పథమధ్యమున నిలిచి, అతని ప్రతిఘటింపఁ దొడంగిరి! హాలుసం దల్లరి బయల్దేరెను! రంగస్థలమందలి కుశీలవులు తమ యభినయమును విరమించి, ఎదుట జరుగు ప్రేక్షకాభినయనము విలోకించుచు నిలువంబడిపోయిరి! "ఆతని నింక నవ్వలికి సాగనంపుఁడు!" అను కేకలు నలువంకల బయల్దేరెను! పోలీసు లా గందరగోళమునఁ బ్రవేశింప నుద్యమించిరి. కాని, మేక్సి మీపాటి యలజడికి నడలి యవ్వలి కరుగువాఁడు కాఁడు! మృదుస్వరమున నాతఁ డిట్లనెను "క్షమింప వేడుచున్నాను. వేఁడినను ఊరుకొన నిచ్చగింప లేని, పోరునకు వెనుదీయువాఁడను కానని యెఱుఁగుఁడు!"

ద్వంద్వయుద్ధసూచన జూచి, కుపితులైన దర్శకులు నెమ్మదిగఁ దమదమ నెలవులకుఁ దప్పుకొనిరి! ఏయడ్డులేక మేక్సిము సుందరిసమీపాల కరిగెను!

సుందరి ప్రఫుల్లముఖియై యువకునకు తన కరపల్లవము నందించెను! దాని నాతఁడు గ్రహించి అత్యంత ప్రీతిపురస్సరముగ నూపెను! — అది కాష్ఠమయమైన కృత్రిమకరముకాదని ఆతఁడు గ్రహించెను!

ప్రఫుల్లవదనుఁడై యువకుఁడు "నన్ను వెదకుచుంటిరా" యని ప్రశ్నించెను.

"అవును సౌభాగ్యవశమున మరల మీదర్శనము లభించెను. నాకుఁ జెప్పవలయు విశేషము లెన్నియో యున్నట్లు మీ ముఖముఁ జూచినంతనే బోధపడుచున్నది?"

"అవును ఉన్నవి! 'పేరిసు వీడును వీడి వెడలిపోవుచుంటి' నని పల్కి మీ రేల నన్ను మోసగించితిరి?"

"నా నిషేధమును పాటింపక మఱునాఁటి యుదయమందే మీ రేల నామీఁద కరుదెంచితిరి?"

" అట్లు నే నచటి కరిగినట్లు మీకెట్లు తెలిసెను ? "

" ఎట్లు తెలిసెనా ! బాగు ! బాగు !! అందులకై నేనెంత యవమానమును సహింపవలసివచ్చెను ! "

" నిజమేనా ! నేడు మూఁడు గంటలప్పుడు మిమ్ము ప్రాదతీరమున విహరించుచుండ విలోకించితిని. "

" శరీరమానసము లస్వస్థములై యున్నపుడు నేను కాసారతీరమున భ్రమణ మొనరించుచుందును. మీరు నన్నందుఁ జూచియున్నయెడల, ఏల పిలిచితిరి కారు ? "

" అపుడు నే నొంటిగ లేను ! "

" ఎవతెయేని భద్రమహిళ కూడ నున్నదను కొనెదను ! "

" ఇంచుక సేపటికి ముందు మీరుకూడ నొక భద్రపురుషునితోఁ గలిసి కూర్చునియుంటిరి కాదా ? "

" అవును. కూర్చునియే యుంటి " నని సుందరి యొక నిట్టూర్పు పుచ్చెను.

" మీ మొగ మట్లు విన్నబోయెనేల ? — ఆపెద్దమనిషి మీచిత్తమునకు క్లేశ మొసఁగుచుండెనా ! "

" పెద్దమనిషి యనుటకు సందియము లేదు — ఆతనిమూలమున దివారాత్రములందు నరకయాతన ననుభవించుచుంటిని ! "

" ఏల సహించుచుంటిరి ? "

" అది నాప్రారబ్ధము !!! "

" అతఁడు మీభర్తయా ? "

" కాదు ! కాదు ! — సర్వస్వ మొసఁగినను, ఆతని నేను పరిణయ మాడను ! "

" బాగు — అట్లైన నే స్వతంత్రమున నాతఁ డొక కులకాంతను పీడించుచుండెను ? "

పక్కున వచ్చు నగవు నతికష్టమున నణఁచికొని, చేతఁగల చిరు వీవన మొగమున కడ్డుగ నిడికొని సుందరి యిట్లనెను. "కులకాంత ననియే కాఁబోలు ఆనాఁటి రాత్రి నావెంటఁబడి చీఁకటియందు నన్ను చాలదూరము కొనిపోతిరి!

"అప్పటి మీ వైఖరిని, మాటలతీరునుజూచి నేనట్లు యోచించితిని!"

"ఇపు డట్లైన మఱొకవిధముగ యోచించుచుంటిరా?"

"ఆహా టటుంచుడు — అల్లదె ఆ యాసనమునఁ గూర్చుని యున్న రోజ్ అను నాపరిచిత యొకర్తుక మిమ్మెఱుఁగును. ఒకనాఁడు కొండొక విదేశీయునిఁగూడి మీరు హొటలులో విడిసియుండ, ఆమెకు మీపరిచయము కలిఁగినదట!"

"అవు నామె చెప్పినది నిక్కమే!"

"పరిచయమేమియు లేనట్లు మీ రామెయెడ వర్తించితి రేల?"

"నిక్కము వచించున దేమన పూర్వపరిచితులైన వారందఱి సఖ్యమును నేనిపుడు త్యజించివైచితిని. చెడుపేరుగల వారితో మనలుట నాకిష్టములేదు!"

"మీరట్టివారు కారా? మీ ప్రకృతి వేఱా?"

"నేను వారివంటిదానఁగాను. చూడుడు — ఒకనాఁడు సంధ్యవేళ నీహార ప్రాంగణమున నృత్యమొనరింపఁ జనితిని. నన్నందుజూచి, ఒక సుందరాంగుఁడు, వలపుమాటలచే నన్నలరింప దొరఁకొని పిదపఁ జీఁకటియందు నావెంటఁబడెను. అతఁ డెంత యత్నించినను, నేను వాని యీప్సితము చరితార్థ మొనరింపలేదు!"

కడుపుబ్బ నవ్వుచు మేక్సి యిట్లనెను. "అకస్మాత్తుగ ఆతని ద్వారసమ్ముఖమునపడి, ఆకాంత అంధకారమున అంతర్ధానము కాకపోయి నచో ఆతని మనోరథము వితథము కాక నేపోయెడిది? — నేఁ డాతఁడు నాటకమునకురానియెడల, ఆజవ్వని వానికిఁ గానుపింపక నే పోయెడిది!!"

"ఒకపక్షము దినము లపేక్షించినయెడల, నిశ్చయముగ నన్నుఁ గలిసికొనఁజాలియుందురు !"

"అన్నినాళ్ళు గడు వెందుకుఁ బెట్టితిరి ?"

"ప్రస్తుతము నాపై నిరంకుశ ప్రభుత్వమును చలాయించు నిష్టురుఁడా గడవుకాలములో నంతర్ధానమై పోవుననియు ఆ కొలఁది దినములు ఓరిమిఁ పట్టునెడల నపున మిష్టారాజ్యమున స్వేచ్ఛావిహారము సలుప వచ్చుననియు యూహించి ఆసమయము నియమించితిని !"

"అట్లని నా కపుడు మీరు విప్పి చెప్పియుండవలసినది. దాని నెఱిఁగి యుండిసయెడల నే నను డంత తొందరపడువాఁడను కాను — గడువు గడచినందాక తడసియే యుందును. — కాని, మీ కాపాదిల్లిన విషాద మేమి ? నేను వచ్చినపుడు, ఆ వికారపురుషుఁడు తలుపుఁదీసెను. నేఁ డాతని మరలనిందుఁ జూచితిని. తోడనే వానిని గుఱుతింపఁ గలిగితిని. అతఁడు మీయింట చాకిరిచేయువాఁడని యోచించితిని — భృత్యుఁడు కాక మీ కాతఁడు యజమానుఁడా ?"

"ఆ పురుషుని జూచియుంటిరికదా ? — ఆ యందగాని వాలకము చూడఁగనే మీకు వాంతులు రాలేదా ?

"అతఁడు సందిగ్ధపూర్ణ చేతస్కుఁడనియు, నీర్ష్యాపరాయణుఁ డనియు నాయూహ ! నేఁ డాతఁడు నన్ను థియేటరునందుఁ జూచి యుండెను. ఇపు డాతఁ డవ్వలికి వెడలిపోయెనేల ?"

"మి మ్మాతఁడు చూచియుండలేదు — నాకోస మాపురుషుఁ డున్మాదుఁడై పోయెను ! ! ఇందుండి ఆతఁడు వెడలిపోవుటకు వేఱు కారణముకలదు. — అది ఈర్ష్య కాదు ! — ఆపలుఁగు పేరువడసిన జూదరి ! ద్యూతసంఘము సేర అతఁ డవ్వలికరిగినపుడు, ఇంచుక సేపు బ్రతుకుజీవుఁడా యనుకొందును. ఇపు డాతఁడు జూదమాడఁబోయెను ! నేఁడు వాఁడు మఱలివచ్చుటకుఁ జాల యాలస్యము పట్టును !"

"అట్లైన నేఁటిరాతిరియంతయు మీకు స్వేచ్ఛయున్నమాటే!!!

"అట్లేయని యోచించుచుంటిని! — కాని, ఆయదృష్టము నాకు దక్కునని నొక్కిచెప్పఁజాలను. — అతఁడొకవేళ వెంటనే వచ్చినను, రావచ్చును! — రాకనుయుండవచ్చును! అర్ధపిపాసయున్నవాఁడు గాన అతఁడు సాధారణముగ ద్యూతమును విడిచి రాలేదు! — అయితే మిత్రమా! నావిషయమై మీకీ వివరము లన్నియు నెందులకు? తఱచి తఱచి ఇట్లు ప్రశ్నించుచుంటిరేల?"

"ఏలనో మీరే యూహింపుఁడు!!!"

"'నీ మక్కువఁ గలిగితి' నని మీ రనవచ్చును! కాని నే నా నుడువును నమ్మఁజాలను. మీరు నన్నుఁ బ్రేమింపలేదని నేను బాగుగ నెఱుఁగుదును. మఱొక మదవతియెడ మీ రనురక్తులరై యుంటి రనుటకుఁ దగు ప్రమాణ ముండనేయున్నది!"

కంకణమునుగుఱించిన ప్రసంగము నెత్తుటకుఁ దగు నదను దొరకెనని మేక్సిము గ్రహించెను? — కాని, అతఁ డింకను ఆప్రసంగమును గదుపలేదు. చెంగటనున్న చెల్వ తనుల్లత నాతఁడు తేఱిచూడసాగెను! కడుంగడు నవలీలగ నాసుందరి వామకరమును వ్యవహరించుచుండెను! కృత్రిమహస్తమని అతని కించుకంతైన ననుమానము తట్టలేదు!!!

"నా నుడువులను మీరు నమ్మనపుడు, నా ప్రేమ ప్రసంగమును మీముందల నెత్తనేమెత్తను! — నిక్కముగ నింకను నే నేయాఁడుదానికి నా హృదయ మర్పింపలేదని, ఒక్కనుడువుమాత్రము మీకుఁ దెలుపుచుంటిని!"

"మఱల మీరు నాసాహసమునకు విచ్చేయ వాంఛింతురా? అట్లే మీరు విచ్చేయుచో, మాయింటనున్న నావంగడీఁడు ఒక్కమాఱుగ నన్ను నమలకుండ మ్రింగివేయును"

"మీ కట్టి ముప్పు రానున్నపుడు, నే నచ్చటి కేల వత్తును?

మీయింటనుండి ఆతఁడు కదలిచనుదనుక నేను వేచియుందును!! కాని, అతఁడు నేఁడు ద్యూతోద్యోగమున నవ్వలికిఁ జనియుండెనుగదా? — ఇఁక వెఱపేల? సందియమేల? యోచనయేల? నడువుము! ఏ దేని హోటలున కరిగి నేఁటియామినినందు హాయిగ గడిపివేయుదుము రారాదా?"

హాసనలహరి యాననమున వెల్లివిరియ, నా వలపుఁజిలుక యిట్లనెను. "అట్లనేవత్తును. కాని నడిరేయి కాకమున్న నే నింటికి మఱలి పోవలెనుజుడీ!!!'

"నడిరేయివరకు గడువున్నదిగదా? — అంతియుచాలును!"

"వగలాడి రోజ్‌ను వెంటఁగొనిరారుకదా?" అని స్మితముఖయై ఆపె యనెను.

"ఆ తలోదరినిఁగూడ దోడ్కొనివచ్చిన మిగుల చోద్యముగ నుండును! కాని, మన మిర్వురమే పోదము!!"

"మంచిది. ఏనిముసమున రమ్మనిన అనిముసమే మీవెంట వత్తును! — సిద్ధముగనే యున్నాను!!"

సుందరి తనవేడికోలున కింత యవలీలగ నీయకోలొనఁగునని యువకుఁడు కలనైన తలఁపలేదు! ఆపెనుగురించి అతఁ డీవఱలో పడిన యభిప్రాయ మిపుడు చాలవఱకు మాఱిపోయెను! "ఇంచుక తాళుఁడు. వేగిరమే ఒక బండిఁ దోడ్కొనివత్తును"

"ఇఁక నాలస్య మెందులకు? — బండి యక్కఱ యేమి? తుషారము పైనుండి కాల్నడకను పోవలెనని నా వాంఛ! ఏలనన, నాపద చిహ్నములను విలోకించినంతనే నే నాదారిఁ బోతినని నా నెచ్చెలులు గుర్తింపఁగలరు!! నా కిదియొక ముచ్చట!!"

"తుషారపాతమున నేఁడు నడిచిపోవుట కష్టకరము. అందుచే శకట—"

"అక్కఱలేదు. వృథాకాలహరణమేల? అదె! నికటమునఁ గల

హోటలునకుఁ బోదము రండు. దూరము లేనందున మన మచ్చటికి త్వరలో పోఁజాలుదుము! అంతియుగాక నానంగడీడగు జంతువు నేనందు నుందునని యెఱుఁగఁజాలఁడు — అందుచే నన్ను వెతకుటకై ఆతఁ డచటికి రాఁడు! రెండవయంతస్తున నాహర్మ్యమున రమ్యమైన ఆగారము లెన్నో యున్నవి"

సుందరి యన్నిహోటలులను బాగుగ నెఱిఁగియుండెనని గ్రహించి యువకుఁ డబ్బురపడి, "అట్లైన, నచటికే పోదము రం" డనియెను.

ఇర్వురును కడువడిగ నాటకాలమునుండి యీవలికి వెడలివచ్చిరి. పథమున జనసంచలనము లేదు. హోటలు కొంచెము దూరమందే యుండెను. అచటి కరిగి మేక్సి యొక విశాంతాగారము కావలయు నని యజమాని నడిగెను. విశాలగవాక్షయుతమైన సుందరాగారము నొండు సార్జెంటు దొరసాని యెన్నుకొనెను. ఇరువు రా యందంపుగదిఁ జొచ్చి ఫలహారమునకై ముకలనొసఁగిరి. యువతీయువకులు సుఖాసీనులై రుచ్యమైన భక్ష్యముల నారగింపఁదొడగిరి. కుడుచుటకుమున్న సుందరి చేదొడుగుల మెల్లగ విప్పివైచెను. చేజోడును గప్పియున్న మేజోడులు తీయఁబడఁగనే సుందరి కరపల్లవములు మిరుమిట్లు కొలుపుచు యువకుని కన్నులఁబడెను!! ఆతని హృదయకరండమున మోహనిర్ఝరిణి యుప్పొంగి పోయెను! ఆత్మసంవరణ మొనరించుకొనశక్తుండై ఆతఁడా లతాంగి కరపద్మములను నిజహస్తములఁ గైకొని ప్రీతిమెయి వానిఁ బలుమాఱు చుంబించి, చుంబించి వదలివైచెను.!!! రెంటిలోను ఒకటియైనను కృత్రిమకరముకాదు! యువకుని మోహోచ్ఛ్వాసమునకు జవ్వని ఎట్టియంకిలి పెట్టలేదు!! పులకిత గాత్రియై ఆ మనోమోహిని చిరునగవు నగుచు మ్రోలఁగల అందగాని అనిర్వచనీయ ప్రణయదర్శనమును కన్నులు పండువుగ విలోకించుచుండెను!!!

సుందరి ఛిన్నహస్తకాదనియు, ఇనుపపెట్టె దెఱువ యత్నించిన దామె కాదనియు మేక్సిము గ్రహించెను. కాని ఆమె చోరాంగనకు సహకారిణి యై యుండుననియు, అందుచే నా యపహరణకృత్యమున నెవ రెవరికి సంబంధ ముండునో ఆ తెలుప వెఱుఁగకపో దనియు ఆతఁడు యోజించెను. ఆ యద్భుత సంఘటనమునకు సంబంధించిన విశదములన్నిఁటిని వెలికిఁదీయుట కిదె తగిన యదనని యనుకొనెను గాని అతాత్తుగ నా తలోదరిని తారుకొనుట అనుచితమని పిదప నాతఁడు యోచించెను!

మేక్సిము — జీవనము దుర్వహము కాదు. దిన మంతయుఁ దిరిగి తిరిగి వేసారియుంటిని. కాని, ఇపుడా యలసటకుఁ దగు ఫలము నను భవించుచుంటిని. ఇంతకంటె మిన్నయైన పురస్కార మేమి? — పేరిస్ నందలి యందకత్తియ లందఱిలోను ప్రథమురా లని వన్నెకెక్కిన మిన్నతో ప్రణయసల్లాపమును, ఆపెగూడి హాయిగ నీ యేకాంత — "

యువకుని నుడువులకు నగి సుందరి యిట్లనెను. "అట్టివాంఛ నిపుడు ప్రకాశింపకుడు! ఆ మనోరథము పూర్ణమొనరించుకొన గడం గితిరేని, తోడనే కిటికీతలుపులను తెరచివేయుదును. మీ రేలనో నన్నెంతయో ఉగ్గడించుచుంటిరి. పేరిసునఁగల అందకత్తియలలోఁ బ్రథమురాలనని నేను వన్నెకెక్కియుండలేదు! మీతో ప్రేమాలాపము సలుపుటకై నే నరుదెంచియుండలేదు!! ఫలహారముకోసరమే నే నిచటికి వచ్చితిని."

"కేవల మందులకేనా?"

"అవును. నెలదినములనుండి, రుచ్యభోజ్యమన నేమియో యెఱుఁ గను. నాయింటనున్నవాఁడు వట్టిలోభి. తానైన నెన్నఁడు మంచి పదార్థమును రుచి చూచి యెఱుఁగడు!"

"అదృష్టవశమున, వానిరాజత్వము శీఘ్రములో అవసానమగును!!"

"అదెట్లు సాధ్యమగును? అతఁడు నన్నేదేని యటవీస్థలములకుఁ గొంపోవ నిశ్చయించెను."

"మీరందులకు సమ్మతించితిరా?"

"నేనింకను నేమియు స్థిరమొనరింపలేదు. ఒంటెకత్తియనై బ్రతుకు గడుపఁజాలనపుడు, ఆతని ననుసరించిపోక తప్పదుగదా."

"ఒంటిగ బ్రతుకు గడపుటేల? ఎట్టులెట్టులు మీ రామోద ప్రమోదములఁ బడయఁగోరుదురో నాతోఁ జెప్పుడు. నే వాని మీ కొసఁగితీరుదును. ఎన్నెని తెఱఁగుల మిమ్మలరింపజాలుదును."

"ఓహో! అటులనా! మీకుమీరే ఆమోదమును అన్వేషించుచు మతిలేనివారి మాడ్కి మసలుచుంటిరి! రోజ్ దొరసాని పాలి కరుగుడు. మీకున్న పాటి ప్రమోదమును తాను పడయుటకును, తనకుఁగల ఆమోదమును మీకుఁ బ్రసాదించుటకును, ఎన్నెని తెఱఁగుల దా నలరి మిమ్మలరించుటకును ఆమెయే తగును!

"మీరు పొరపడుచున్నారు. వెలుపలికి నీరసునివలె నేఁ గానం బడుచున్నను, నేనంతగ స్త్రీలోలుండనని యోచింపకుడు!"

"మీరు స్త్రీలోలురు కాకుండుట నిక్కమే! — పొరబడి అట్లంటిని. మీ కట్టి దౌర్బల్య మున్నది లేనిది, మీచేతికిఁ గట్టుకొనిన కంకణమే చెప్పక చెప్పుచున్నది! అది మీ పూర్వపురుషుల స్మృతి చిహ్నమని పావము మీరు వచించితిరి. కాని, అది యట్టిదై యుండు నని ఏ యాఁడుది నమ్మజాలదు."

"మీరు వచించినట్లది మా పూర్వులకుఁ జెందినదికాదు — ఏ రమణికడనుండికూడ అది పడసినదికాదు!!"

"అట్లైన మీకది యెందేని దొరకెనా?"

"ముమ్మాటికి అది దొరికినదే"

"అట్లయ్యు నిక్కమింపు టధికారిణికి దాని నిచ్చుటకు మీరు యత్నింపలేదు! — మీ మాటలను నమ్మఁజాలకపోవుచుంటిని!"

"కంకణమును గుఱించి ఒక విచిత్రకాహానికలదు?"

"అదేమో చెప్పుఁడు. ఇదె తగిన సమయము!"

"మీ రీ వస్తువును చూచియుంటిరా?"

"మీరు చూపకున్న నేనెట్లు చూడఁజాలుదును?"

చేతినుండి కంకణముఁ దీసి, యువకుఁడు దానిని ముంగలఁగల మేజాపై నిడెను! దానిని విలోకించినంతనే, సుందరి యాననమున నేమూరుపైనఁ గానంబడునేమో యని అతఁడు తేఱిచూచెను!

"ఇది అంత అందమైన నగగాదే!"

"రోజ్ యభిప్రాయమునకు మీయభిప్రాయము సరిపోయినది!" — ఆమె యీ యలంకారము నెవ్వతెచేతినో చూచెనఁట!"

"ఉండుడు — పరిశీలింపనిండు. నేఁ గూడ దీని నెందో చూచి యుంటిని — ఓ! జ్ఞప్తికి వచ్చినది. ఒకమాసమునకు మున్నే ఈ నగ నా చేతినే యుండెను. — మీతో రోజ్ చెప్పినది నిక్కము. ఒకనాఁటి రాతిరి మే మిర్వుర మొకహోటలున కలిసికొంటిమి — అత్తఱి నగను చేతినిఁ బెట్టుకొనియె వచ్చితిని!"

అబ్బురమును నటించి మేక్సిము "ఏమి? — ఏమనుచుంటిరి? — నగ మీయదియా?"

"అవును నాదే! నాకుఁ బరిచితమైన విదేశీయురా లొకర్తుక దానిని నా కుపహారముగ నొసఁగెను. ఆచెలిమికత్తెను సంతసపెట్టుటకు దానిని నాచేత ధరించుచుండుదానను! కంకణమందలి శిల యొకటి పోవుటచే దాని నొక నగలవానికి బాగు చేయుటకు యిచ్చితిని. నా నెచ్చెలి వెడలిపోయినతరువాత నే నా నగ నమ్మివేయ నిశ్చయించి బహుప్రయాసానంతరమున నొక దలాలికి ముప్పదిమూఁడు రూకలకు

దాని నిచ్చివై చితిని. ఇపుడు మీరు వచింపఁబోవు కాహినియేమో చెప్పుడు !"

ఇంచుకతడసి మేక్సిము "దానిని తప్పక వినఁదలఁతురా ?" యనెను.

"తప్పక వినఁదలఁచియే యడుగుచుంటిని"

"ఈ కంకణ మేకాంత కరమందుండెనో ఆమెయే దొంగతన మొనరించెను !"

"వట్టి దొంగతనమేనా ! — ఆచెయిద మేపాటిది ? — హత్యగావింప లేదా ! సామాన్యాపహారణము మాత్ర మేనా కావించినది ?"

"అపహారణము సామాన్యమైనదికాదు ! — అసాధారణమైనది."

"కావచ్చును ! అపరాధిని పట్టుకొనుటకై కాఁబోలు తాము వెదకి వెదకి వేసారుచుంటిరి. — నిక్కముగ నిది యద్భుతవాంఛయే !"

ఒక్కొక్కరి కొక్కొక కార్యమం దభిరుచి యుండును. తుషార ముపై నడిచిపోవలెనను నభీష్టము నాకుఁగలదు !"

"అటులనా ! బోధపడినది. చౌర్యము సలిపినది నేనే యని మీరు యోచించుచుంటిరి !" అని సుందరి నవ్వి ఆగారమును మాఱుమ్రోయింపఁజేసెను.

"ప్రతినపూర్వకముగ నేనట్లు — "

"తప్పించుకొనకుఁడు — నా కంతయు బోధపడినది. రోజ్ దొర సాని నాచేతఁ గంకణముఁ జూచెను ! అది నాదియే యని ఆమె మీకుఁ జెప్పియుండెను ! దానిగుట్టు నెట్టులైన నాకడనుండి బయల్పెట్ట సమ కట్టి నాయెట్టయెదుట మీరు గొప్పయెత్తు వైచితిరి ? తాము కంక ణముఁదీసి మేజాపై నిడుతఱి దానిఁగాంచి నే నట్టె మూర్ఛిల్లిపోదునని యోచించితిరి ! నిక్కముగ నాదోఁతచేత నాచేతనైనదే ! — ఇఁక పోలీసులను పిలుచుటకు తరువాయి యేమి ?"

ప్రతివాద మొనరింప మేక్సిము యత్నించెను. కాని, సుందరి కడు

పుబ్బ నవ్వుచు మాటలాడుట కాతని కవకాశ మొసఁగలేదు. "ఏమి! ప్రతివాద మొనరింప నుంకించుచుంటి రా? — అట్లైన మీరు నన్ను రక్షకభటుల కరములు నప్పన మొనరింపరా? చౌర్యకార్యము సలిపినది నేఁ గానని విశ్వసించుచుంటిరిగదా? మంచిది! — మఱికొంత ఫలహార మును దెప్పింపుఁడు. ఎందులకు? — కిటికీతలుపులను కూడఁ దెఱచి వేయుఁడు! ఈచిత్ర మంతయు నడంపగాని నవ్వుఁగలిగించి నాయూపిరిఁ దిరుగకుండఁ జేసెను."

యువకుఁ డప్రతిభుఁడై పోయెను! — వాంఛ పూర్ణము కాలేదు! కాని అతఁడు గవాక్షములనుఁ దెఱువలేదు. సుందరికోసరమై మాత్ర మించుక ఫలహారము నాతఁ డందుకొనెను.

యువకుఁడు కిటికీతలుపులను మఱింత బలముగ మూసివైచి వచ్చి నెచ్చెలిపొంత నాసీనుఁ డాయెను! సుందరి ఇంతలో మేజాపైఁగల కంక ణము నిటునటు ద్రిప్పుచుఁ పరీక్షింపసాగెను. ఆకాంత చోరాంగన యని తా ననుమానించినందుల కంతరంగమున నాతఁ డెంతో నొచ్చుకొనెను.

సుందరి – ఇది నాకంకణమే!—ఎట్టిసందియములేదు. ఇదిగో! ఈ నవ మరకతమును నే నిటీవలనే ఇందుఁ దాపింపజేసితిని. — ఎట్టి విపరీతము! ఈపాటి నగకోసరమై నా యసువు నెబట్టి దీయవలె నను నుద్యోగమా!

మేక్సి మేమో చెప్పఁబోవుచుండెను. ఇంతలో నవ్వలినుండి తలుపు తట్టిన చప్పుడు వినంబడెను! "లోపలఁ బ్రవేశించుచుంటిని — అడ్డురా వలదని మాత్రము నొక్కి చెప్పుచుంటిని. జాగ్రత!" అను కర్కశ స్వరము కర్ణగోచర మాయెను.

పొంతఁగల పొలంతి భీతిచే నట్టె యులికిపడి "ఇఁకేమున్నది! — కొంప మునిఁగినది! అతఁడు వచ్చిపడెను! ఈమాఱు నాపనిసైనది!" అని గద్గదకంఠయై పల్కెను.

సుందరికిఁ దోడుపడవలెనని యువకుఁడు కృతనిశ్చయుఁడై, కవా

టము దిక్కునకుఁ బర్వెత్తెను! ఆవలివాని జతనముకతన తలుపు తోడనే తెఱువఁబడెను! వింతమానిసి ఏ యుద్దేశమున నరుదెంచెనో వాని ముఖారవిందమును విలోకించినంతనే మేక్సిమునకు బోధపడియెను. గుమ్మమున కడ్డముగ నిలువంబడి కఠోరస్వరమున నాతఁడు "అడ్డులెమ్ము" అని యఱచెను.

"ఇందు నీకేమి కానలెనురా!" యని భీషణస్వరమున యువకుఁడాతనిఁ బ్రశ్నించెను.

రెండడుగులు వెన్కకు వైచి యతఁడు "అది నా యాఁడుది! నా కామె కావలయును!" అని దృఢస్వరమునఁ బల్కెను.

"ఇచట ఆఁడుది ఎవతెయులేదు! పోయి యమలోకమునఁ జొరబడుము! అవలీలగ నిందుండి కదలవేని నాచఱపుల చవిచూచి మఱిపోదువు — జాగ్రత!"

"దుర్మతీ! నిన్ను గుర్తించితిని మామేడఁ జొరఁబడ యత్నించిన బడుగు వీవేకదా! ఇఁక నాలసింపక నా యాఁడుదాని నా కొసఁగివేయుము. వలయుచో, పిదప పోరునకు రమ్ము."

"లోనికిమాత్రము చొరకుము. ఇంకొకయడుగు — "

మేక్సిము నుడువుఁ బూర్తిఁ గావింపకమున్ను, ఆతని వెన్కనుండి ఎవరో దూసుకొని అవ్వలికిఁ బర్వెత్తుకొని పోయిరి. అవ్వలి కరిగినంత వీక్షింపగనే సుందరి ఆతని కన్నులఁ బడెను!!! వింతమానిసి ఆమె వెనుకఁ బర్వెత్తసాగెను! విస్మయపరీతచేతస్కుఁడై, మేక్సి మట్టులే నిలువంబడిపోయెను!! వారివెంటఁ బర్వెత్తి తెరువున కయ్యమునకు డీకొనుట కూడనిపని యనియు, సుందరి నిక్కముగఁ దన కెట్టులైనఁ గబురుఁబంపుఁ గానఁ గానిగొడవఁ దేఁబూను టనుచిత మనియు యోచించి యువకుఁడు వాతాయన పథముగుండా తనదృక్కులను వారి

దేనఁ బఱపెను ! ఇరువురుఁ గదురయమున నొక బండి నెక్కుచుండిరి !— అవు డాకస్మికముగఁ గంకణముమాట ఆతనికి జ్ఞప్తికివచ్చెను !

లోనికివచ్చి మేజాపైఁజూచునరికి కంకణ మచ్చోటఁ గానంబడలేదు. పొరపాటున సుందరి దాసని కై కొనియుండును ! ఏమిపొరపాటు ! ! తన చేఁదొడుగులను చేగుమాలును ఆమె మఱువలేదు. చోరాంగనఁ బట్టు జాలుట కాధారమైన యొకేవమాత్రపు నిదర్శనము చేతులనుండి జారి పోయెను ! ఇన్ని నాళ్ళు పొంతనున్నను, మేక్సిమునకు దానియక్కఱ ప్రాప్తింపలేదు ! — ఒక్కరునితో ద్వంద్వయుద్ధమునకు డీకొనుట మాత్రమే ఇంతదనుక జరిగినపని ! ద్వంద్వానియం దాతని కే యాటం కములేదు ! ఆత్మశక్తిపై ఆతని కగ్గలవు విశ్వాసముకలదు ! వికార పురుషుని సమయించిన, సుందరి సంతోషసంభరితస్వాంత యగు ననియుఁ, దన కట్టి మే లొనఁ గూర్చినందులకుఁ బారితోషికముగ నాచాన కంకణమును తనకుఁ దిరిగి యిచ్చివేయుననియు యువకుఁ డూహించెను !

ఇట్లాతఁడు తలపోయుచుండ హఠాటలు భృత్యుఁడు బిల్లుఁ దీసికొని ఎదుట నిలిచెను. బిల్లు చెల్లించి మేక్సి మూవలికరిగెను !

ద్వంద్వ కదనమున కిర్వురు సహాయులను పడయుటకై మేక్సిము క్లబ్బుదెస కరిగెను. నేఁడు జరిగిన విషయము లన్నిఁటి నాతఁడు తెరు వునఁబడి నడచుచు యోచింపఁదొడంగెను. వికారమానిసి తమజాడల నెట్లెఱిఁగియుండును ? రోజ్ దొరసాని వానిని దెలిపియుండదు. నాట కాలయమందు వింతమానిసి మేక్సిమును జూచియుండును. అందుచే నాతఁ డవ్వలికివచ్చి ఎందేని దాఁగియుండును ! పదంపడి సుందరీ సహి తుఁడై యువకుఁడు హఠాటలున కరుదెంచుటఁ జూచి, తానుకూడ వారి ననుగమించి యుండును ! కిటికీ తలుపులను మేక్సిము బాగుగ మూయ నుకించుతఱి, అవ్వలినుండి వింతమానిసి అతనిఁజూచి, గది

గుఱుకించి, దానిదిక్కునకుఁ బర్విడివచ్చి యుండును! — ఇదంతయు నిట్లుండ — అట్టిసుందరి యట్టి వికలాంగుని యదుపాజ్ఞలకుఁ గట్టువడియె నేల? వింతమానిసి ప్రాయశః మిగుల ధనాఢ్యుడై యుండును. కంకణ మిఁక లభించుట శక్యముకానట్లు యునకునకుఁ దోఁచెను. తోడ్తోడనే చోర వసితను బట్టఁజాలు నానకూడ నడుగంటెను. 'సుందరి నగనెవరికి విక్రయించి యుండెనో తెలిసికొనక మొఱకునై యూరకుంటి!" నని ఆతఁడు చింతించెను.

ఇట్లు చింతించుచు మేక్సిము క్లబ్బును చేరుకొనెను. అప్పటి కందుండి పల్వురు తమతమ నెలవులకు మఁగుడిచనిరి. మిగిలిన కొలఁది మాత్రపువారిలో ద్వంద్వజన్యమున దనకుఁ దోడుపడఁజాలు వారెవ రును ఆతనికిఁ గన్పట్టలేదు. ఏ మొనరించుట కాతనికిఁ బాలుపోలేదు — అత్తరి వాని పూర్వపరిచితుఁడైన చికిత్సకుఁ డాతనిఁ బ్రమోల సాక్షాత్క రించెను!

ఆతనిఁ గాంచి, మేక్సిము ప్రముదితచిత్తుఁడై ఇట్లనెను! "వైద్య మహాశయా! తేపాక ద్వంద్వరణ మున్నది. మీరు నాకందుఁ దోడు పడుదురా!"

"యుద్ధ మెవరితో?"

"ఆతఁడొక విదేశీయుఁడు. మీరెఱిఁగిన కొండొక రమణికోసరమే ఆకయ్యము కావింపఁబడును. సుందరియు, నేనును నాటక భవనమందుఁ గలిసికొంటిమి. ఇరువురము హొటలుకరిగి ఫలహారముఁ గుడుచు చుండ, పెద్ద చోరవఁజేసి అతఁడు గదిలోఁ బ్రవేశించెను!"

"కన్నులకుఁ గట్టినట్లు నాకంతయు బోధపడినది. అతఁడు లోపలఁ ప్రవేశింప నుంకించినంతనే పోరునకుఁ వానిఁ బురికొల్పితిరి. అతనికి సంసి ద్ధుఁడనై యుంటినని చెప్పి సుందరిని గూడి అతఁడు పలాయన మొనరిం చెను — అంతియేనా? ఆపురుషుని మీరు మఱలఁజూడ జాలరని

నేను నొక్కి చెప్పఁగలను. అట్టివారు పేరుసునగర విలాసినులఁ గూడి కాలము హాయిగ గడుపవత్తురుగాని దుర మొనరింపరారు."

"అతఁడు నాకింపుఁ గానుపింపనియెడలఁ ఎచ్చోనైనను వానిఁబట్టి సదాచరణమున వానికిఁ దనుగుణపాఠము బోధింతును!"

"ఈ చర్యయంతయు నెందులకు? — అతఁడు మీ కాయమునఁ జేయి వేయలేదుకదా! సుందరియెడ కూడ మీకంతగా ననురాగము పుట్టలేదు! మీ రూరక కయ్యమునకుఁ గాలుద్రువ్వ నేల? ఇఁక శాంతించి, ఎట్టిచేతకును చేయి చేసికొనకుండుటే మంచిదని నాయభిప్రాయము. కాని అతఁడే వచ్చి పోరునకు మిమ్మాహ్వానించిన యెడల మీరందులకు వెనుఁదీయకుఁడు."

"మంచిదట్లె యొనరింతును. మీరునాకుఁ దోడు పడుదురా?"

"కతిపయ దినము లూపిరి విడుచుటకైన నాకు వ్యవధియుండదు." కవుంటెస్ వ్యాధి కడుప్రబలమైనది. నన్ను మన్నింపుడు."

"ఏమి! ఇయ్యట్టా దొరసాని వ్యాధిగ్రస్తమాయెనా?"

"అవును. తెవులేదో ఇంకను గుర్తింపలేకపోతిని. బొత్తిగ చిక్కి శల్యమై, ఆబోటి మంచముపట్టెను. మిమ్ము వెతకుకొనుచు, నే నిత్తావునకు వచ్చితిని. జేపొకమాటు దర్శన మీయుఁడని మిమ్మానెలంత వేఁడియుండెను కదా. కాని 'ప్రస్తుతావస్థలో నేమియుఁ బ్రసంగింపఁ జాలననియు, అందుచే శ్రమపడి ఇపుడు రానక్కఱలే' దనియుఁ దెలుప ఆమె నన్ను మీపాలికంపెను! ఎప్పటికామె యరోగ్యవతి కాఁజాలునో కూడ ఇవుడు తెలుపఁజాలము."

మేక్సిము నిక్కముగ కవుంటెస్ కొసరము చింతితుఁడై "వైద్య మహాశయా! ఆమె వ్యాధిని మీరు కుదురుపఁజాలుదురా?" యనెను.

"నిశ్చయముగఁ గుదుర్పఁజాలుదును — కాని, ఆమె నేఁ జెప్పిన చొప్పున నడుచుకొనవలెను. కతిపయదినములు నామాటకుఁ గట్టు

వడి ఆపడఁతి మంచముపట్టి యుండవలెను. ఇంచుకగుణము కానుపించినంతనే గుఱ్ఱపువారికిఁగాని, కసరతునకుఁగాని ఆకాంత గడంగ రాదు. ఏలనన నించుక యలయికఁగూడ సంకటమును తిరుగఁబెట్టి అపాయమాపాదింపవచ్చును. అందుచే నామె ఎప్పటట్లారోగ్యవతియై, తినితిరుగునందాక ఆమె నెచ్చెలు లెవ్వరైన నామెఁ జూడకుండుట మంచిది — మీరుకూడ నానెఁతనెచ్చెలులం దొకరుకదా!”

“ఆమె ఎట్లున్నదో వాకపుచేయుటకైన నాయింతి యింటికి నేను రాకూడదా?”

“మీకెందులకాశ్రమ? మీకావార్తను స్వయముగ నేనె తెలుపుచుందును. నేఁటినుండి ఆమె భవంతియుందే బసఁజేసియుందును. ఇఁక నాకు సెలవిండు. సుందరికోసరమై ద్వంద్వసమాగమునకుఁ దారుకొనకుఁడు! ఒకయాఁడుదానికొరకై ఒకని విపన్నుఁ గావించు టుచితము కాదని యోచింపుఁడు!! — ప్రణామము.”

కవుంటెస్ ఇయల్టావ్యాధివార్త విని మేక్బెము మిక్కిలి చింతింతుఁడాయెను. సమరసహాయుల విషయమిం కాతసచేతనమున నుదితము కాలేదు. నాఁడు జరిగిన సంగతులన్నిఁటిని దలపోయుచు, బండిఁజేసికొని యువకుఁడు నిజాలయమునకు మగుడిచనెను!

ప్రథమభాగము — సంపూర్ణము.

దీని తరువాత కథ “ద్వితీయభాగము” నందున్నది.

సరస్వతీ పవర్ ప్రెస్ — రాజమహేంద్రవరము 816/54